జాతీయ కవి

# ఇక్బాల్

ఉర్దూ మూలం :

సయ్యద్ ముజఫర్ హుసేన్ బర్నీ

తెనుగుసేత :

డాక్టర్ ఇరివెంటి కృష్ణమూర్తి





తెలుగు విశ్వవిద్యాలయం

కళాభవన్, సైఫాబాదు,

హైదరాబాదు - 500 004

ఆంధ్రప్రదేశ్.

"JAATHIYA KAVI – IQBAL" — Urdu original by Sayed Muzaffer Hussain Burney – translated into Telugu by Dr. Iriventi Krishna Murthy.

---

తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాదు - 500 004.

ప్రథమ ముద్రణ : సెప్టెంబర్, 1987

ప్రతులు : 2000

వెల : రూ. 15/-

ముఖచిత్ర రచన : శ్రీ శీలా వీర్రాజు

ప్రతులకు :
తెలుగు విశ్వవిద్యాలయం
కళాభవన్, సైఫాబాదు,
హైదరాబాదు - 500 004.

ముద్రణ :
పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్
3–5–850, హైదర్‌గూడ,
హైదరాబాదు - 500 029.

ముఖపత్ర ముద్రణ :
ది ప్రింటర్ [ఆఫ్‌సెట్]
3–6–584/హెచ్, హిమాయత్‌నగర్,
హైదరాబాదు - 500 029.

# అంకితం

ఈ కృతిని
జాతీయ సమైక్యం కోసం
దేశ సమగ్రత కోసం
తమ ప్రాణాలను సైతం అర్పించిన
స్వర్గీయ శ్రీమతి ఇందిరాగాంధి గారికి
సమర్పిస్తున్నాను.

—రచయిత

* * *

"ఆస్మాన్ తెరీ లహర్‌పర్ షబ్నం అఫ్షానీ కరే !
సబ్జయ్ నూరస్త ఇస్ ఘర్‌కీ నిగెహ్‌బానీ కరే !"

(నీ సమాధిపై హిమబిందువుల వాన కురుస్తుండాలె.
పచ్చదనం ఈ ఇంటిని కాపాడుతుండాలె.)

—కీర్తిశేషురాలైన తన తల్లి స్మృతికి నివాళులర్పిస్తూ
"వాలిదా మర్‌హూమాకి యాద్‌మేఁ"
(మృతి చెందిన తల్లి స్మృతికి) అనే కవితలో
ఇఖ్బాల్ రచించిన పంక్తులివి.

# ప్రకాశక విజ్ఞప్తి

ఒక జాతిసాహిత్యం ఆ జాతిసంస్కృతికి అక్షరసాక్ష్యం. నాగరకప్రపంచంలోని మానవజాతి తన సంస్కృతికి సంకేతమైన సాహిత్యాన్ని పదిలపరచుకుంటూ వస్తున్నది. ఈ విశ్వసాహితీకోశం రకరకాల సంస్కృతుల మేళవింపుతో రంగురంగుల పూలతోటలా పరిసరాలన్నింటినీ సురభిళం చేస్తుంది. ఆ సాహితీపరిమళాలు ఖండఖండాంతరాలు వ్యాపించి ఆయా దేశ సాహిత్యాలను ప్రభావితం చేస్తాయి. ఆ రకంగా బహుభాషాసాహితీ సంస్కృతి భరితమైన భారతీయసాహిత్యం భిన్న భిన్న సాహితీ స్వరూపాల సంపర్కంతో సరికొత్త అందాలను సంతరించుకొంది.

భారతీయ భాషా సాహిత్యాలలో తెలుగు సాహిత్యం చెప్పుకోదగిన స్థానాన్ని సముపార్జించుకొంది. ఈ స్థానాన్ని సుస్థిరం, సుప్రతిష్ఠితం చేసుకోవడానికీ, మరింత ఉన్నతికి తీసుకొనివెళ్ళడానికీ ఆయా కాలాలలో అవతరించిన సాహితీమూర్తులు తమ శాయశక్తులా కృషి చేస్తూవచ్చారు వారి కృషిని సుసంపన్నం చేయడానికి ఆవిర్భవించిన వ్యక్తులు, ప్రభుత్వం, స్వచ్ఛంద సంస్థలు అనేక ప్రణాళికలను రూపొందించి వాటి సాఫల్యానికి కార్యోన్ముఖులవుతున్నారు. ఆ దిశలోనే తెలుగు విశ్వవిద్యాలయం సముద్భవించింది. బోధన, శిక్షణ, పరిశోధన, ప్రచురణ నాలుగు దిక్కులుగా తన దృక్కులను సారించి తెలుగు జాతి సంస్కృతిని ప్రపంచపరివ్యాప్తం చేయాలనే మహాలక్ష్యంతో అడుగులు వేస్తున్నది. ఈ ప్రస్థానంలో భాగంగా ఉత్తమ సాహిత్యాన్ని పాఠకులకు అందిస్తూ వస్తున్నది.

బహుభాషా సంస్కృతుల సమ్మిళితమైన భారతీయ భాషా సాహిత్యాలు పరస్పరం ఆదానప్రదానాలు జరుపుకోవడం జాతీయ సమైక్యానికి

ఆయువుపట్టు వంటిది. మన భాషా సాహిత్యంలోని సొగసులు ఇతర భాషా సాహిత్యాలకు పరిచయం చేసినట్లే ఇతర భాషా సాహిత్యాలలోని తియ్యదనాలను మనంకూడా చవిచూడాలి.

తేనెలొలుకు తెలుగుభాషలో ఎంత తీపి ఉందో సురభిళించే ఉర్దూ భాషలో అంత మార్దవమూ ఉంది, మాధుర్యమూ ఉంది. ఆ భాషా సాహిత్యాల సౌష్ఠవాన్ని, సౌందర్యాన్ని ఎందరో ఉర్దూ సాహితీవేత్తలు ప్రపంచానికి పరిచయం చేశారు. వారిలో మన జాతి సమైక్యానికి, దేశ సమగ్రతను అంతస్సూత్రంగా స్వీకరించి "సారే జహాఁసే అచ్ఛా హిందూ సితాఁ హమారా" అని ప్రపంచానికి ప్రపంచీకరించిన మహాకవి ఇఖ్బాల్ ఒకరు. మనదేశ ఔన్నత్యాన్ని, ఐకమత్యాన్ని తమ కవిత్వంలో ప్రకటించారు. ఇతని కవితలలో కాశ్మీరునుంచి కన్యాకుమారి వరకుగల యావద్భారతం నాట్యం చేస్తుంది ఇతని కవితాసౌందర్యం పరమాద్భుత మని ఎందరెందరో మహానుభావులు అభివర్ణించారు. అంతటి ప్రతిభా వంతుడైన కవి ఇఖ్బాల్ జీవితం-కవితావిశేషాలను గురించి సంక్షిప్తంగా పరిచయంచేస్తూ ప్రస్తుతం హర్యానా గవర్నరుగా ఉన్న శ్రీ సయ్యద్ ముజఫర్ హుసేన్ బర్నీగారు ఉర్దూలో 'మొహిబ్బెవతన్ - ఇఖ్బాల్' రచించారు. ఇది కన్నడం, ఆంగ్లభాషలలోకి అనూదితమైంది. ఇప్పుడు తమిళం, మలయాళం, హిందీ, ఒరియా, బెంగాలీ భాషల్లోకి తర్జుమా అవుతోంది.

తెలుగు పాఠకలోకానికి కూడా ఈ రచనను పరిచయం చేయాలనే సత్సంకల్పంతో దీనిని తెనిగింపజేసి ప్రకటించాం. ఈ సందర్భంగా ఉర్దూ మూల రచయిత శ్రీ సయ్యద్ ముజఫర్ హుసేన్ బర్నీ గారికి, తెనుగు చేసిన డాక్టర్ ఇరివెంటి కృష్ణమూర్తి గారికి మా విశ్వ విద్యాలయం పక్షాన ధన్యవాదాలు తెలుపుకొంటున్నాం. ఈ పుస్తకం పాఠకుల మన్నలకు పాత్రమవుతుందని ఆశిస్తున్నాం.

హైదరాబాదు, ప్రకాశకులు

తేదీ :- 21-9-1987. తెలుగు విశ్వవిద్యాలయం.

# ధన్యవాదం

ఉర్దూ భారతీయ భాష. సంస్కృతం నుంచి పుట్టుకుని వచ్చిన ప్రాకృత, అపభ్రంశ భాషల కలయికనుంచి పుట్టుకునివచ్చిన భాష. పదజాలంలో అరబ్బీ, ఫార్సీ పదాలు కలసినా, క్రియలన్నీ భారతీయమైనవే. వాక్యరచనావిధానం లోనూ, వ్యాకరణ పద్ధతిలోనూ భారతీయభాషల ప్రభావమే అధికం. ఉర్దూ ఇక్కడే పుట్టింది. ఇక్కడే పెరిగింది. ఉర్దూలో ఏ పదం కూడా ఉర్దూది కాదు. ఎన్నో భాషల పదాలు కలసి ఉర్దూ భాషగా రూపొందింది. అసలు ఉర్దూ అన్న పదానికి సైన్యం అని అర్థం. బహువర్ణకుసుమాల మంజరి ఉర్దూ. పాకిస్తాన్‌లో అధికారభాషగా ఉర్దూకు గుర్తింపు ఉన్నా ఆ దేశం భాష ప్రధానంగా ఉర్దూకాదు. పంజాబీ, కాశ్మీరీ, సింధీ, పుస్తూ భాషలే అక్కడ ప్రచురంగా ఉన్నవి. ఉర్దూకు భారతదేశంలోనే ఎక్కువ ప్రచారం ఉంది. ఉర్దూ మైనారిటీ ముస్లింల భాష అని ముద్ర వేయడంలో భాషాశాస్త్రీయదృక్పథం ఏదీలేదు. రాజకీయమే ఎక్కువ ఉంది. ప్రముఖ హిందీ రచయితలు సృజించిన సాహిత్యం ఉర్దూ వాళ్లకూ ఉర్దూ రచయితలు సృజించిన సాహిత్యం హిందీ వాళ్ళకూ ఆస్వాదయోగ్యంగా ఉంటూ ఉండటం భాషాభిజ్ఞులు అందరికీ తెలిసిన యాథార్థ్యం, పని కట్టుకుని సంస్కృత శబ్దజాలాన్నీ, ఫార్సీ, అరబ్బీ శబ్ద జాలాన్నీ చొప్పించకపోతే సహజంగా అందరికీ అర్థమయ్యే భాష ఉర్దూ. గాంధీ మహాత్ముడు ఈ విధంగా రూపొందే భాషను హిందుస్తానీ అన్నారు. కొందరు హిందీ విద్వాంసులు ఉర్దూను హిందీ భాషలోనే ఒక శైలీ విశేషంగా గుర్తిస్తారు. స్వతంత్ర భాష అనరు. కాని ఉర్దూకు కొన్ని ప్రత్యేకతలున్నవి. ప్రత్యేకలిపి (ఫార్సీ), ప్రత్యేక ఛందస్సు, ప్రత్యేక కవి సమయాలు (ఫారసీ అరబ్బీ సాహిత్యాలకు సంబంధించినవి) ఉన్నవి. ఇతర భాషా పదాలనూ, ఉపమా సామగ్రినీ, సామెతలనూ, జాతీయాలనూ, కవిసమయాలనూ, సాహిత్య ప్రక్రియలనూ తనదైన పద్ధతిలో తనలో కలుపుకుని ప్రవహించే గుణం ఉన్నది. సంస్కృతం తరువాత భావ ప్రకటనలో సంక్షిప్తతను అతి మాత్రంగా సంతరించుకున్న భాష ఉర్దూ. కొన్ని పదాలల్లోనే విస్తృతార్థాన్ని అందించగలిగే లక్షణం భారతీయ భాషల్లో ఉర్దూకే

ఎక్కువగా ఉన్నదనే సత్యాన్ని ఇతర భాషలతోపాటు ఉర్దూలో అభినివేశం ఉన్న మనీషులు మౌనంగా ప్రకటిస్తూ ఉంటారు.

గాలిబ్, మీర్, సౌదా, అజ్‌గర్ ఇన్షా. జౌఖ్, చక్‌బస్త్, మీనాయి, ఫిరాఖ్, అనీస్, ఆజాద్, అమ్జద్, జోష్, సర్దార్‌జాఫరీ, జిగర్, సాహెర్, ప్రేంచంద్, కిషన్‌చందర్, ఇస్మత్, మాలిక్‌రామ్, హస్రత్ ఇఖ్బాల్ ప్రభృతులు ఉర్దూ భాషకు స్థాయినీ, సౌందర్యాన్నీ, గాంభీర్యాన్నీ, ప్రయోజనాన్నీ, జన ప్రియత్వాన్నీ ప్రసాదించిన సాహితీసుగతులు, ప్రతిభా సముపేతులు. స్వాతంత్ర్య సమరంతో పెనవేసుకుని ప్రజా బాహుళ్యానికి అత్యంత సన్నిహితంగా మెలిగింది ఉర్దూ. హిందీ పేరుతో ఉర్దూ, ఉర్దూ పేరుతో హిందీ సినిమాప్రపంచాన్ని ఏలినవి, ఏలుతున్నవి. భారతదేశమంతటా ఒక జాతీయభాషను రూపొందించ డంలో ఉర్దూ నిర్వహించిన పాత్ర అభినందనీయం.

ఉర్దూ కవుల్లో ఇఖ్బాల్‌కు సమున్నత స్థానం ఉన్నది. ఆయన ఫార్సీ, అరబ్బీ, ఇంగ్లీషు, సంస్కృతం, హిందీ భాషల్లో వైదుష్యం సంపాదించిన ఉర్దూ కవి. ఆయన తొలిరచనలు ఎక్కువగా ఫార్సీలోనే సాగినవి. ఆ తరువాత ఉర్దూ, ఫార్సీ రచనలు సమానాంతరంగా సాగినవి. దేశభక్తి, తాత్త్వికదృష్టి, స్వేచ్ఛా ప్రవృత్తి, సంఘ సంస్కారం ఆయన కవితల్లో ఉత్తాలతరంగాలతో పొంగి పొరలినవి.

మానవుని వ్యక్తిత్వానికి ప్రాధాన్యం ఉండాలని ఉద్ఘోషించిన కవి ఇఖ్బాల్.

"ఖుదీకొకర్ బలంద్ ఇత్నా కె హర్‌తక్దీర్‌సె పహ్‌లే
కె ఖుదా బందేసె ఖుద్ పూఛే బతా తేరీ రజా క్యాహై"

(భగవంతుడే స్వయంగా వచ్చి "ఏమి నీ అభీష్టం" అని అడిగే విధంగా నీ స్వయం వ్యక్తిత్వ స్థాయిని సమున్నతం చేసుకో)

అయితే వ్యక్తిత్వం సమాజానికి అతి బాహ్యం కాకూడదని ఆయన హృదయం.

"మౌజ్ హైదర్యామె దర్యా సె బాహర్ కుచ్‌నహీం"

(నదిలోనే తరంగం నదికి అవతల తరంగమే లేదు.)

"మిటాదే అప్నీ హస్తీకో అగర్ తూ మర్తబా చాహే
కెదానాభి ఖాక్‌మెఁ మిల్కర్ గులొగుల్జార్ హోతాహై"

(ఉన్నత పదవి కావాలంటే నీ అస్తిత్వాన్ని మలిపేసుకో. విత్తనం కూడా మట్టిలో కలిసి కుసుమాలుగా, నందనాలుగా ఉబికి వస్తుంది).

పురాభారతీయ సంస్కృతినీ ఎలుగెత్తి పాడిన కవి ఇఖ్బాల్. ఉర్దూ కవుల్లో ఈ లక్షణం అరుదనే చెప్పవలసివస్తుంది. దేశభక్తినీ, ఆత్మవిశ్వాసాన్నీ, ప్రాచ్యఖండవిజ్ఞానసంస్కృతుల వైభవాన్ని గానంచేసిన పవిత్రుడాయన.

ఇఖ్బాల్‌ను చదవనివాడు ఉర్దూ తెలియనివాడే.

పాకిస్తాన్ సిద్ధాంత ప్రతిపాదకుల్లో ఇఖ్బాల్ ఒకడని ఒక వ్యాఖ్యానం ఉన్నది. అది కువ్యాఖ్యానం మాత్రమేనని ఈ పుస్తక రచయిత శ్రీ బర్నీగారి అభిప్రాయం. యుక్తియుక్తంగా తన అభిప్రాయం యథార్థమైనదేనని నిరూపించినారు.

శ్రీ బర్నీగారు ఇఖ్బాల్ రచనలను తలస్పర్శిగా అధ్యయనం చేసిన శేముషీ సంపన్నులు. ఫారసీ, ఉర్దూ, ఇంగ్లీషు భాషలలో నిష్ణాతులు. సాహిత్యాభిమానులు. సహృదయులు. మేధావులు. పరిపాలనాదక్షులు.

ఇఖ్బాల్ కవితా పంక్తులను ఉదాహరిస్తూ ఈ పుస్తకంలో ఆయన ఇఖ్బాల్ కవితాపారమ్యాన్నీ, తత్త్వచింతననూ, దేశభక్తినీ సందర్శింపజేసినారు.

ఉర్దూలో ఉన్న ఈ పుస్తకాన్ని తెనిగించాలని నన్ను ఆదేశించి, ప్రోత్సహించిన సహృదయులూ విద్వాంసులు "సియాసత్" (హైదరాబాదునుంచి వెలువడే ఉర్దూ దినపత్రిక) సంపాదకులు శ్రీ ఆబిద్ అలీ ఖాన్‌గారు, ఆంధ్ర సారస్వత పరిషత్తు అధ్యక్షులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు.

విశ్వ విద్యాలయ స్థాయివరకు నేను ఉర్దూలోనే చదువుకున్నాను. ఉర్దూ సాహిత్యంతో కించిత్తు అభినివేశాన్ని కూడా సంపాదించుకోగలిగినాను. నా లోని ఈ భాషాభినివేశాన్ని గుర్తించి నన్ను ఈ అనువాదానికి పురికొల్పిన శ్రీ ఆబిద్ అలీఖాన్‌గారికీ, శ్రీ రామానుజరావుగారికీ కృతజ్ఞుడను.

నేను ఈ అనువాదంలో బర్నీ గారు ఉదాహరించిన ఇఖ్బాల్ కవితలభావాన్ని మాత్రమే తెలిపే ప్రయత్నంచేసినాను. బర్నీ గారి హృదయాన్ని మాత్రమే తెలిపే ప్రయత్నం చేసినాను. కేవలం శాబ్దికమైన అనువాదం కాదిది. ఒక భాష నుడికారాన్ని అనువదించడం అసాధ్యం. కనుక సాధ్యమైనంత మేరకు తెలుగు నుడికారం దెబ్బ తినకుండా అనువదించే ప్రయత్నం చేసినాను. నా అనువాదం సర్వవిధాలా నిర్దుష్ట మైనదని నేను అనుకోను. అంత సాహసం నాకు లేదు. సహృదయులకు ఈ అను వాదం ఏ మాత్రం నచ్చినా ధన్యుడనే.

తెలుగు విశ్వవిద్యాలయంవారు ఈ అనువాదాన్ని ప్రచురించడానికి ముందుకు వచ్చి చరితార్థులైనారు. ఉర్దూ మహాకవి ఇఖ్బాల్‌ను తెలుగువారికి పరిచయం చేయడంలో చరితార్థత ఉందని నమ్మినాను. తెలుగు విశ్వ విద్యాలయం ఉపాధ్యక్షులు ఆచార్య శ్రీ తూమాటి దొణప్పగారు ఉన్నతశ్రేణికి చెందిన ఆచార్యులే కాదు, ఉత్తమ భాషా సాహిత్య పరిశోధకులు. తులనాత్మక పరిశీలనంలో ఆరితేరిన బహు భాషావేత్తలు, సహృదయులు. అందుకే చొరవ తీసుకుని ఈ గ్రంథ ప్రచురణకు పూనుకున్నారని భావిస్తున్నాను.

"జాతీయ కవి - ఇఖ్బాల్"ను అనువదించే అవకాశం కల్పించిన తెలుగు విశ్వవిద్యాలయం వారికి, ప్రత్యేకించి ఆచార్య దొణప్పగారికి నా ధన్యవాదాలు.

ఇంత చక్కని పుస్తకాన్ని చదువడానికీ, అనువదించడానికీ నాకు అవకాశం కల్పించిన హర్యానా రాష్ట్ర గవర్నరు శ్రీ సయ్యద్ ముజఫర్ హుసేన్ బర్నీ గారికి అభివందనాలు.

—ఇరివెంటి కృష్ణమూర్తి

రచయిత గురించి...

# సయ్యద్ ముజఫర్ హుసేన్ బర్నీ

హర్యానా రాష్ట్ర గవర్నర్ సయ్యద్ ముజఫర్ హుసేన్ బర్నీ బరన్ (బలంద్ షహర్)లోని ఒక ఉన్నత కుటుంబానికి చెందినవారు. సుదీర్ఘకాలం నుంచి నిరంతరంగా సాహిత్య సేవకు అంకితమైన కుటుంబం అది. ఆగస్టు 14 1923 లో బులంద్‌షహర్‌లో జన్మించారు. ఆయన విద్యాభ్యాసం చాలా సముజ్జ్వలంగా సాగింది. బి.ఏ.లో ఇంగ్లీషు సాహిత్యంలో ఉన్నతశ్రేణి సంపాదించి టెంపుల్ గోల్డుమెడల్ అందుకున్నారు. ఇంగ్లీషు సాహిత్యంలో ఎం.ఏ. చదివారు. 1948 లో ఐ. ఏ. ఎస్. ప్రథమ పోటీపరీక్షలో ఉత్తీర్ణులైనారు. ఒరిస్సాలో నియామకం జరిగింది. అక్కడ ఆయన వివిధపదవులను నిర్వహించి చివరకు బోర్డ్ ఆఫ్ రెవిన్యూ రిలీఫ్ కమిష్నర్ (1978-79) ప్రధాన కార్యదర్శి, డెవలప్‌మెంట్ కమిష్నర్ (1979-80) వంటి అత్యున్నత పదవిని చేపట్టారు. కేంద్ర ప్రభుత్వం కూడా ఈయన సేవలను వినియోగించుకున్నది. వివిధ దశల్లో కమ్యూనిటీ డెవలప్‌మెంటు సంయుక్త కార్యదర్శి (1965-67), సంయుక్త కార్యదర్శి వ్యవసాయ శాఖ (1967-72), అదనపు కార్యదర్శి పెట్రోలియం, కెమికల్స్ మంత్రిత్వ శాఖ (1973-75), సమాచారశాఖ కార్యదర్శి (1975-77), హోంమంత్రిత్వశాఖ కార్యదర్శి (1980-81) వంటి ఉన్నత పదవులను అలంకరించి కృతార్థులై కీర్తిమంతులైనారు. గవర్నరు పదవిని చేపట్టిన మొదటి ఐ.ఎ.ఎస్. అధికారి ఆయన. ప్రథమంగా ఆయన నాగాలాండ్, మణిపూర్, త్రిపురాల గవర్నరైనారు (1981-84). జూన్ 14, 1984 నుంచి హర్యానా రాష్ట్ర గవర్నరుగా ఉంటున్నారు.

సయ్యద్ ముజఫర్ హుసేన్ బర్నీ పబ్లిక్ సెక్టర్‌లోని దాదాపు ఎనిమిది సంస్థలకు డైరక్టరుగా కూడా ఉన్నారు. అంతర్జాతీయ సభల్లో, సమావేశాల్లో పాల్గొన్నారు. దాదాపు 22 దేశాలలో పర్యటించి అపారమైన అనుభవాన్ని

గడించారు. ఐక్యరాజ్యసమితి సమావేశాలెన్నింటిలోనో భారతదేశానికి ప్రాతినిధ్యం వహించారు.

ఇంత సుదీర్ఘ కాలంగా దేశానికీ, జాతికీ తన సేవలను అర్పిస్తూనే తమ సాహిత్య స్నేహాన్ని వాడిపోకుండా కాపాడుకోగలిగారు. ఆయన ఇంగ్లీషు, ఉరుదూ, ఫారసీ సాహిత్యాలనే కాక, ఆ భాషా పరిచయాలతో విశ్వసాహిత్యంలోని విశిష్ట అంశాలను అధ్యయనం చేయగలుగుతున్నారు. ఉరుదూ గజల్ లాలిత్య మాధుర్యాలను ఎరిగిన సహృదయులు. 'గజల్' సంఘానికి అధ్యక్షులు. అల్లామా ఇఖ్బాల్ కళ, తాత్త్విక చింతనంతో చిన్ననాటినుంచే ఆసక్తిని పెంచుకున్నారు. ఆ విషయంలో ఆయన అధ్యయనం చాలా విస్తృతం, గంభీరం, నిశితముకూడా.

ఇంగ్లీషు, ఉర్దూ, ఫారసీ భాషలలో చక్కని అభినివేశం సంపాదించిన వారు. అనేక గ్రంథప్రణేతలు. ద్వీపకల్పం మొత్తంలో ఇఖ్బాల్ సాహిత్య తత్త్వాన్ని మధించిన పండితుడు. ఇఖ్బాల్‌నుగూర్చి ఆయన చేసిన కృషిని గుర్తించి గౌరవడాక్టరేటు (D.Sc)తో సత్కరించారు.

ఆయన రచించిన ఈ పుస్తకం, ఇంగ్లీషు, ఉరుదూ, హిందీ భాషల్లోనే కాక బెంగాలీ, అస్సామీ, తమిళభాషల్లో కూడా ప్రచురితమవుతున్నది. పునః పరిశీలనం, చేర్పుల తరువాత ఈ విద్వత్ప్రసంగం ఒక శాశ్వత గ్రంథంగా రూపు దిద్దుకుంది. ఒక విలక్షణమైన, ఎవరూ పట్టించుకోని అంశం మీద తొలిసారిగా జరిగిన గంభీరమైన పరిశోధనాత్మక కృషి ఇది.

ప్రస్తుత నివాసం
హర్యానా రాజ్‌భవన్,
చండీగఢ్ - 19.

స్థిరనివాసం చిరునామా
3/17 వసంత్ విహార్
కొత్తఢిల్లీ.





हरियाणा राज भवन,
चण्डीगढ़ ।
HARYANA RAJ BHAVAN,
CHANDIGARH.


No. 2-HRB-PSG-87
February 18, 1987.

My dear Prof. Donappa,

I am very happy indeed to know that under your inspiring guidance Janab I. Krishna Murthy has translated my book 'Mohabbe Watan : Iqbal' into Telugu language with devotion and high degree of professional skill. It is most difficult to render the literature of one language into another language, more so its poetry, for very often distinctive structure and idiom of a language stands in the way of proper translation. But a consummate translator sometimes works the miracle of producting a version that looks more like a creative work than a mere translation, by dint of his professional excellence, maturity and hard labour. The present Telugu version is one such example. Besides, It not only conveys the message of the poet, but also presents his verses in the most enchanting and artistic manner.

I am deeply grateful to you for your initiative in the publication of this book under the auspices of Telugu University with the object of propagating the message of Iqbal amongst the people of Andhra Pradesh.

In this context, I am also grateful to my esteemed friend Janab Mir Abid Ali Khan, Chief Editor, Daily 'Siasat', Hyderabad who took keen interest in the venture and in his own inimmitable way resolved all the problems in the matter of translation and publication of the book.

With kind regards,

Yours sincerely,

(S.M.H. Burney)

Prof. T. Donappa,
Vice-Chancellor,
Telugu University,
HYDERABAD-500 004.




हरियाणा राजभवन,
चण्डीगढ़ ।
HARYANA RAJ BHAVAN,
CHANDIGARH.

گرامی قدر پروفیسر صاحب!

آداب نیاز!

مجھے بےحد مسرت ہے کہ آپ کی زیر نگرانی جناب آئی۔ کرشنا مورتی صاحب نے میری تصنیف "محب وطن اقبال" کا تیلگو زبان میں ترجمہ نہایت محنت، لگن اور خوش اسلوبی سے کیا ہے۔ کسی زبان کے ادبی خصوصاً شعری سرمائے کو کسی دوسری زبان میں منتقل کرنا دشوار ترین کام ہے۔ اور اگر چہ مطلب بھی کہ اس میں مخصوص تشبیہ زبان اور لب و لہجہ کی انفرادیت آڑے آتی ہے۔ لیکن ایک کامل اور کامیاب مترجم اپنی مہارت، ذہنی پختگی اور جگر سوزی سے وہ کمال انجام دیتا ہے کہ ترجمہ پر تصنیف کا گمان گزرنے لگے۔ "محب وطن اقبال" کے تیلگو ترجمہ میں یہ خوبی بدرجۂ اتم موجود ہے۔ اس میں پیام اقبال کے علاوہ ان کے اشعار کو نہایت دلپذیر اور خوبصورت انداز میں شامل کیا گیا ہے۔

میں آپ کا بےحد ممنون ہوں کہ آپ نے تیلگو یونیورسٹی کی اعانت سے کتاب کی طباعت و اشاعت میں غیر معمولی فعالی سے کام لیا جس کی بدولت آج پیام اقبال کو آندھرا پردیش کے عوام تک پہنچانے میں کامیابی حاصل ہوئی۔

اس سلسلے میں میں جناب مرزا عابد علی خاں صاحب، مدیر اعلیٰ روزنامہ "سیاست" کا بھی شکرگزار ہوں کہ جن کی دلچسپی اور تگ و دو سے ترجمہ کی اشاعت کے مراحل طے ہو گئے۔

نیک خواہشات کے ساتھ!

مخلص

سید مظفر حسین برنی

# తొలి ప్రచురణకు ఉపోద్ఘాతం

'ఇఖ్బాల్-దేశ సమైక్యత' అనే అంశాన్ని గూర్చి ఈ ఉపన్యాసాన్ని 14, జనవరి 1984లో భూపాల్ విశ్వవిద్యాలయంలో చదివి ఉంటిని. ఇఖ్బాల్ జీవితంలో భూపాల్‌కు ప్రముఖస్థానం ఉంది. ఆ నగరంతో ఆయన సంబంధాలు అతిమధురములు. 'సబ్‌హాలఖ్నవీ' తన పుస్తకం 'ఇఖ్బాల్-భూపాల్'లో ప్రత్యక్ష సంబంధం 18 ఆగస్టు 1910లో ఒక కవి సమ్మేళనంతో ఏర్పడిందని పరిశోధ నాత్మకంగా తెలిపారు. కవిసమ్మేళనం తరువాత అందులో పాల్గొన్న కవుల కవితలను పుస్తకరూపంలో ప్రచురించారు. ఆ పుస్తకం పేరు 'కవి సమ్మేళన దర్పణం' ("ఆయినయే ముషాయరా") ఈ కవితా సంకలనంలో ఇఖ్బాల్ గారి మూడు కవితలు కూడా ఉన్నవి. ఇఖ్బాల్ కవితా సంకలనాల్లో ఎక్కడా ఈ కవితలు లేవు. మొదటిసారిగా ఆ పుస్తకంలో ముద్రితమైనవి.[1]

హల్ఖై జంజీర్‌కా జోహర్ పన్హా నిక్లా
ఆయినా ఏ ఖైస్‌కీ తస్వీర్‌కా జందాఁ నిక్లా
హంగారాఁ జాన్‌కె లాయేథే ఇరంసే బుల్‌బుల్
బాగె హస్తీమేఁ మతాయెనఫ్సె అరజాఁ నిక్లా
వసత్ అఫ్జాయీ ఆషు ఫ్తగీయె షౌఖ్‌నపూఛ్
ఖాక్‌భర్ ముట్ఠీమేఁ పోషీదా బియాబాఁ నిక్లా.
(శృంఖలావలయంలో ప్రతి లక్షణం గుప్తమే
కారావాస చిత్రం అద్దంలో బందీగానే కనిపిస్తున్నది)

(ఎంతో విలువైందని స్వర్గారామం నుంచి తెచ్చిన కోకిల, మనోవికృతికి కారణమై చౌకగా కనిపిస్తున్నది. విస్తృతిపట్ల ఉండే ఆసక్తి ఏపాటిదని అడుగకు పిడికెడు మట్టిలో నందనమే ఇమిడి ఉన్నది.)

తరువాత ఒక మేధావి, విద్యావతి 'ఖాతూన్ అరషద్'[2] (మౌలానా రషీద్ అహమద్ అరషద్ థాన్వీ భార్య) ప్రయత్నంవల్ల ఇఖ్బాల్ తన ప్రసిద్ధ కవిత

---

1. తరువాత ఈ కవితలు అచ్చుగాని కవితల మూడు సంకనాలలో చేరినవి.
2. ఇఖ్బాల్ ఔర్ భూపాల్ - పుటలు 65,66.

'జవాబ్ షిక్వా'లోని ఒక పంక్తిని మార్చివేశారు. అరషద్ ఖాతూన్ సాహిత్య సామాజిక విషయాలపై వివిధ పత్రికలలో వ్యాసాలు వ్రాస్తూ ఉండేవారు. ఆమె స్వయంగా మహిళలకోసం 'బానూ' అనే పత్రికను 1933 లో ప్రచురించారు. 1918లో ఇఖ్బాల్ ఈ పత్రికను ప్రచురించారు. ఈ క్రింది పంక్తులను అందులో చేర్చారు.

కైసే మిన్నత్ కషే తన్హాయీ సహెరానరహే
షహర్‌కీ ఖాయేహవా బాద్ ఎ పైమానరహే
వొతో దీవానాహై జంగల్‌మే రహే యా న రహే
ఏ జరూరీ హై హిజాబె రుఖె లైలా న రహె
షోకె తహరీర్ మజామీన్‌మేఁ ఘులీజాతీహై
బైఠ్‌కర్ పర్దేమే బేపర్దా పఁహుయీ జాతీహై.
(నగరంలో ఉంటే మాత్రం? ఎడారిలో ఏకాకివలెనే ఉన్నాను.

ఖైస్ అడవుల్లో పరిభ్రమిస్తే మాత్రం? సిగ్గులొలుకుతున్న లైలా ముఖమే అతని కనులముందు భాసిస్తుంది.

రచనాభిలాష సాహితిలో కరిగిపోతుంది. తెరలో ఉన్నా బయల్పడుతూనే ఉంటుంది.)

ఖాతూన్‌అరషద్ ఇఖ్బాల్‌కు లేఖ వ్రాశారు. ముస్లిం వనితల వ్యాసరచనా పద్ధతిని ఆయన విమర్శించారని ఆ లేఖలో ఆమె ఉటంకించారు. గతంలో ప్రత్యే కించి ఇస్లాం తొలిరోజుల్లో ముస్లిం వనితలు అనేక గ్రంథాలు వ్రాసిన సంగతిని జ్ఞప్తికి తెచ్చారు. ఆమె లేఖలోని అంశాలను అంతగా పట్టించుకుంటారనీ, వాటిపై తనకు కలిగిన భావాలను కవితాబద్ధం చేస్తారని ఆమె ఊహించలేకపోయారు. ఇఖ్బాల్ ఆమె లేఖకు సంక్షిప్తంగానూ, సౌజన్యపూర్వకంగా జవాబు వ్రాశారు. ఆయన ఆసక్తి, పవిత్రత, మార్దవం ఆ లేఖలో ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. పైన పేర్కొన్న కవితలోని చివరి పంక్తిని మార్చి ఇలా వ్రాశారు:

గిలజోర్ నహో షిక్వయ్ బేదాద్ నహో
ఇష్క్ ఆజాద్ హో క్యోఁ హుసున్‌భీ ఆజాద్ నహో
(ప్రణయానికి స్వేచ్ఛ ఉన్నప్పుడు సౌందర్యానికెందుకుండగూడదు ?)

భూపాల్ మహిళ ఆమె. ఆమె నిరసన మూలంగానే ఇఖ్బాల్ తమ ప్రసిద్ధ కవిత జవాబె షిక్వా (ఫిర్యాదుకు జవాబు) లో ముఖ్యమైన మార్పుచేశారు.

ఇవి భూపాల్ విద్వాంసులతో ఇఖ్బాల్‌కు ఉన్న ప్రత్యక్ష సంబంధాలు. కాని భూపాల్‌కు ఆయన తొలిసారి మే 1, 1931నాడు వచ్చారు. రాష్ట్ర ప్రభుత్వ అతిథిగృహం 'ఖసరె రాహత్ మంజిల్' ('ఆనంద నిలయం' ఇప్పుడు శిథిలమై పోయింది) లో బసచేశారు. ఈ సందర్భంగా ఆయన నవాబుగారితో ముస్లింలకు సంబంధించిన కొన్ని రాజకీయ సమస్యలను కూడా చర్చించారు.

1934 లో ఇఖ్బాల్ జబ్బుపడ్డారు. ఆయన కంఠం చెడిపోయింది. గొంతుకలో తీవ్రమైన బాధ కలిగింది. 1935లో తమ ప్రియమిత్రుడు సర్ రాస్ మసూద్ అప్పటి విద్యామంత్రి సలహా ప్రకారం ఇఖ్బాల్‌ను భూపాల్‌కు విద్యుత్కిరణ చికిత్సకోసం తీసుకొచ్చారు. ఈ చికిత్సా సందర్భంలోనే ఇఖ్బాల్ భూపాల్‌కు మూడు సార్లు వచ్చారు. మొదటిసారి 31 జనవరి నుంచి 7 మార్చి 1935 దాకా భూపాల్‌లో ఉన్నారు. రెండవసారి 17 జులై నుంచి 28 అగస్టు 1935 దాకా, మూడవసారి అంటే చివరిసారి 2, 3, మార్చి 1936 నుంచి 18 ఏప్రిల్ 1936 దాకా ఆయన భూపాల్‌లో ఉన్నారు. భూపాల్‌లో ఆయన ఉన్నది మొత్తానికి నాలుగు మాసాలే అయినా భూపాల్ నవాబూ, సర్ రాస్ మసూద్‌తో ఆయనకున్న సాహిత్య, రాజకీయసంబంధాలు దాదాపు ఏడేళ్లవి. అంటే 1931 లో ఆయన మొదటిసారి భూపాల్ వచ్చినప్పటి నుంచి 1938 లో ఆయన నిర్యాణం వరకు.

జనవరి, మార్చి 1935లో ఆయన తొలిసారి భూపాల్‌కు వచ్చినప్పుడు సర్ రాస్ మసూద్‌కు అతిథిగా ఉన్నారు. మసూద్‌గారికి ప్రభుత్వం ఏర్పరచిన విడిది 'రియాజ్ మంజిల్'లో బసచేశారు. ఒక మాసం, మరో ఏడు రోజులు అక్కడున్నప్పుడు ఆయన తమ ఏడు ప్రసిద్ధ కవితలను రచించారు.[1]

మే 1935 లో భూపాల్ ప్రభుత్వం ఇఖ్బాల్ కవికి నెలకు ఐదు వందల రూపాయలు యావజ్జీవిత ఫించను మంజూరు చేసింది. ఆయన దుర్భరమైన ఆర్థిక పరిస్థితులతో సతమతమవుతున్న రోజులవి. ఆనాడు ఈ ఆర్థిక సహాయానికెంతో విలువ ఉంది. అప్పటి హైదరాబాదు సంస్థాన ప్రధానమంత్రి మహారాజా

---

1. సుల్తానీ పుట.26, 2. తసవ్వుఫ్ పుట.29, 3. వహి పుట.4, ముజ్నాద్-పుట. 66, 5. హుకూమాత్ పుట. 76, 6. నిగాహ్ పుట. 102, 7. ఉమ్మీద్ పుట. 108.

సర్ కిషన్‌ప్రసాద్ సిఫారసువల్లనూ, ప్రయత్నంవల్లనూ, ఆయనకు సహాయం లభించలేదు. హైదరాబాదు హైకోర్టులో మీర్ మజ్లిస్ (చీఫ్ జస్టిస్) కావాలనుకున్నారు. మీర్ మజ్లిస్ కాలేదు సరికదా జూనియర్ జడ్జి పదవికూడా ఆయనకు దొరకలేదు. ఉస్మానియా విశ్వవిద్యాలయానికి వైస్ ఛాన్సలర్ కూడా కాలేకపోయారు. ఈ పదవిలో తమను నియమిస్తామని అక్బర్ హైదరీగారు అస్పష్టంగా వాగ్దానం చేసి ఉండిరట.

ప్రసిద్ధ ఉర్దూ సాహిత్య విమర్శకులు, కీర్తిశేషులు ప్రొఫెసర్ రషీద్ అహమద్ సిద్దీఖి ఈ సందర్భంగా వెలిబుచ్చిన భావాలు.... ....

"రానున్న తరాలు ఎన్నడూ మరువలేని ఉపకారం భూపాల్ చేసిందని నేననుకుంటున్నాను. ఇఖ్బాల్‌ను నిరుద్యోగబాధనుంచి విముక్తుణ్ణి చేసిన వ్యక్తులకూ సంస్థలకూ ఉత్తమ లోకప్రాప్తి తథ్యం. ఇఖ్బాల్‌కు ఉపకారం చేయడం నా దృష్టిలో పుణ్యకార్యం చేయడమే."

రెండవసారి ఇఖ్బాల్ 1935 ఏప్రిల్‌నుంచి ఆగస్టు వరకు భూపాల్‌లో సంస్థానం వారి అతిథిగృహం 'శీష్‌మహల్'లో బసచేశారు. ఈ కాలంలో ఆయన ఐదు గొప్ప కవితలను వ్రాశారు. 'జర్బెకలీం' అనే కవితా సంకలనంలో అవి చోటు చేసుకున్నవి.

చివరిసారిగా ఆయన భూపాల్ వచ్చినప్పుడు ఆయన ఆరోగ్యం ఏమాత్రం బాగాలేదు. కవితలు వ్రాసే ఓపికగాని, శక్తిగాని ఆయనలో లేవు. ఈసారి ఆయన కుమారుడు జావేద్ కూడా వెంటవున్నాడు. తరువాత ఆయన వ్రాసిన లేఖల్లో భూపాల్‌ను సందర్శించాలనే కోరిక ఉన్నట్లు వెల్లడి అయింది. తుదకు ఏప్రిల్ 19, 1938లో, అంటే తమమరణానికి రెండురోజులక్రితం మంనూన్ హసన్‌ఖాన్ గారికి తమ చివరిలేఖ వ్రాశారు.

ఇఖ్బాల్ తమ ఉర్దూ కవితల మూడవ సంపలనం 'జర్బెకలీం' భూపాల్ నవాబుకు అంకితం చేస్తూ,

బగీర్ ఈఁపఽమా సర్మాయమ్ బహాఅజ్మన్
కెగుల్ బదస్తె తవాజ్ షాఖ్తాజతర్ మాండ్

(నా వసంతోపహారాన్ని స్వీకరించండి. కొమ్మకున్న పూలకంటే మీ చేతిలోని పూలే కలకలలాడుతున్నవి).

ఈ పద్యంలోని రెండవ పాదం ఒక ఈరానీకవి తాలిబ్ ఆమ్లి[1] (జహాంగీర్ చక్రవర్తి ఆస్థానంలో ఉండేవాడు) వ్రాసింది. ఈ పాదాన్ని వ్రాసి మొదటి పాదంతో పూర్తిచేయాలని చాలాకాలం ప్రయత్నం చేశాడని ప్రతీతి. చివరకు ఇలా పూర్తి చేశాడు:

జగారతె చిమ్నత్ బర్ బహారె మన్నత్ హాస్త్
కెగుల్ బదస్త్ తవాజెషాఖ్ తాజెతర్ మాద్.

(ఉద్యానాన్ని దోచుకుని మీరు వసంతానికే ఉపకృతి చేశారు. ఎందుకంటే, కొమ్మపైని పూలకంటే మీ చేతిలోని పూలే కలకలలాడుతున్నవి.)

ఇఖ్బాల్ పూరించిన పాదమే సరసంగా ఉందనే నా అభిప్రాయంతో మీరు ఏకీభవిస్తారు. ఇఖ్బాల్ తన చివరి కవితా సంకలనం "అరముగానె హజ్జాజ్" భూపాల్ నవాబుకే అంకితం చేయాలనుకున్నారు. కాని అది ఆయన నిర్యాణం తరువాత ప్రచురితమైంది.

ఇఖ్బాల్ రచించిన ప్రసిద్ధ కథాకావ్యం "పస్చెబాయద్ కరదాయె అఖ్వామెషర్క్" ప్రణాళిక కూడా భూపాల్లో ఆయన ఉన్నప్పుడే ఏర్పరచుకున్నారు. అయితే అది సెప్టెంబరు 1936లో భూపాల్నుంచి తిరిగివచ్చిన తరువాత రెండు నెలలకుగాని పూర్తికాలేదు.

భూపాల్ ప్రసక్తిలేకుండా ఇఖ్బాల్ జీవితానికి, కవిత్వానికి సంబంధించిన ఏ అంశంకూడా సమగ్రమనిపించుకోదు. ఈ నగరం ఆయన జీవితంలో ఒక మైలురాయి వంటిది. కష్టభరితమైన చరమజీవితదశలో భూపాల్నగరమే

---

1. ఇఖ్బాల్ నామా జహాంగీరి.

ఆయనకు ఊరట కలిగించింది. నెమ్మది, ప్రశాంతత కవితా రచనకు ప్రధాన హేతువని వర్డ్స్‌వర్త్ అభిప్రాయం కదా!

కవిత్వాన్ని నిర్వచిస్తూ వర్డ్స్‌వర్త్ "Emotions recollected in **tranquilty** (ప్రశాంత స్థితిలో ఆవేశాల అనుభూతి లేదా పునర్మననమే కవిత) ప్రకటించిన అభిప్రాయాన్ని నే నిక్కడ ఉట్టకించాను.

చివరకు ఒక అంశాన్ని సూచిస్తున్నాను. మహాకవి ఇఖ్బాల్‌కు అతి సన్నిహితులై మెలగిన, అపురూపమైని వ్యక్తి మంసూన్‌ఖాన్ హసన్‌గారు ఇప్పుడు మన మధ్య సజీవులై ఉన్నారు. భూపాల్‌లో బస చేసినప్పుడు ఆయనకు కార్యదర్శిగా వ్యవహరించగలిగినందుకు ఆయనెంతో గర్వపడుతూ ఉంటారు. నేడు కూడా ఇఖ్బాల్ సాహిత్యాధ్యయన సందర్భంగా మనకు మార్గదర్శనం చేయడానికి మన మధ్య ఉండడం మన అదృష్టం. ఇఖ్బాల్ అభిమానినైన నేను మంసూన్‌ఖాన్‌ను చూస్తూ ఈర్ష్య పడుతూ ఉంటాను. మహాకవి ఇఖ్బాల్ దర్శనమైనా చేసుకోలేక పోయాను. ఒక పాకిస్తానీ కవి తన కవితలో నా అనుభూతిని ఆవేదనను ఎంత చక్కగా వ్యక్తం చేశాడో!

'మైఁ వో మహ్‌రూంకె పాయాన జమానా తేరా
తూ వో ఖుష్‌బఖ్త్‌కె జో మేరే జమానేమెఁ నహీఁ (కుర్షీద్ రజ్వీ)

(నేను నీ వున్న కాలంలో లేని అభాగ్యుడను. నీవు నేనున్న కాలంలో లేనందున భాగ్యశాలివి)

ఈ కవితలో నేను నా పద్యంలో ఇలా మలచుకున్నాను.

మై వో బద్‌బఖ్త్‌కె జో తేరే జమానేమెఁ న థా
తూ వో ఖుష్‌బఖ్త్‌కె జో మేరే జమానేమెఁ నహీఁ

(నీవున్న కాలంలో నేను లేనందుకు దురదృష్టవంతుణ్ణి. నీవు నేనున్న కాలంలో లేనందుకు భాగ్యశాలివి.)

**ఇఖ్బాల్ ఇన్స్టిట్యూట్ - భూపాల్ :**

భూపాల్‌లో ఇఖ్బాల్‌కు ఉన్న సంబంధాలకు స్మృతి చిహ్నం ఏర్పాటు చేయాలని, ఉచితజ్ఞులైన మధ్యప్రదేశ్ ప్రభుత్వము ముఖ్యమంత్రి శ్రీ అర్జున్‌సింగ్ నాయకత్వంలో అనేక ప్రయత్నాలు చేస్తున్నారని తెలుసుకొని చాలా సంతోషించాను. ఇఖ్బాల్ అభిమానులందరూ ప్రత్యేకించి ఉర్దూ ప్రియులు మధ్యప్రదేశ్ ప్రభుత్వానికి ఎప్పుడూ కృతజ్ఞులై ఉంటారు. నా ఉపన్యాస ఫలితంగానే ఈ ప్రయత్నాలు జరుగుతున్నాయని నా మిత్రులు ఊహాపడుతున్నారు. ఏది ఏమైనా ఈ సంస్థతో నాకు సంబంధం ఉండటం వల్ల నాకు ఆనందంగానూ ఉంది. గర్వంగానూ ఉంది. 'ఈ సంస్థ ఇఖ్బాల్ సాహిత్యాధ్యయన పరిశోధన కేంద్రంగా రూపొందాలనీ, జాతీయ స్థాయిలోనేకాక అంతర్జాతీయ స్థాయిలో దీనికి పరిగణన, యశస్సులభించాలని నా ఆకాంక్ష.

నా ప్రియమిత్రులు నిసార్ అహమ్మద్ ఫారూఖ్ గారు ఢిల్లీ విశ్వవిద్యాలయం అరబ్బీ శాఖాధ్యక్షులు) నా యీ ఇంగ్లీషు ప్రసంగ పాఠాన్ని ఉర్దూలో అనువదిస్తున్న సందర్భంగా నాకెంతో తోడ్పడ్డారు. పరాత్పరుడు ఆయన లేఖినీశక్తికి మరింత ఉజ్జ్వలత కలిగించుగాక (అల్లాహ్ కరే జోరె కలం ఔర్ జ్యాదా).

ఇంతేకాక సుల్తాన్ అంజుంగారికి కూడా నేను కృతజ్ఞుణ్ని. ఆయన శుద్ధ ప్రతిని సిద్ధంచేశారు. సందర్భాలను ఎత్తిచూపడంలో నాకు తోడ్పడ్డారు.

చివరికి నేను హృదయపూర్వకంగా హర్యానా సాహిత్య అకాడమీవారికి నా ధన్యవాదాలను తెలుపుకుంటున్నాను. అకాడమీవారు ఈ పుస్తక ప్రచురణకు ఏర్పాటుచేసి సాహిత్యసేవ నందించారు. ఇఖ్బాల్ జాతీయ సమైక్యతా సందేశానికి ఇతోధిక ప్రాచుర్యం కలిగించి ఉత్తమ కర్తవ్యాన్ని నిర్వహించారు. నిన్నటికంటే నేడు ఇఖ్బాల్ సందేశం జాతికీ దేశానికి అత్యంతావశ్యకం.

సయ్యద్ ముజఫర్ హుసేన్ బర్నీ

# మలి ప్రచురణకు ఉపోద్ఘాతం

'ఇఖ్బాల్ - జాతీయసమైక్యత' అన్న అంశం ఒక విధమైన ఊపును, కదలికను ఉత్తేజాల్ని కలిగించే అంశం. ప్రాచ్యఖండానికంతా కవి అయిన ఇఖ్బాల్ భావవైశాల్యాన్ని అవగతం చేసుకోలేక మన విశ్వాసాలతో, మన భావాలతో ఆయన కవిత్వాన్ని ముడివేసుకున్నవాళ్లం మనం. చాలా ప్రసిద్ధమైన విషయం, సర్వసాధారణంగా అందరికీ ఆమోదయోగ్యమైన విషయం, పరిశోధించిన తరువాత, విశ్లేషించినతర్వాత నికషోపలపరీక్ష తరువాత అబద్ధం అని తేలిపోతుంది.

గత సంవత్సరం భూపాల్ విశ్వవిద్యాలయం నన్ను విస్తరణ ప్రసంగం (**Extention lecture**) చేయవలసిందిగా ఆహ్వానించినప్పుడు నా కెంతో సంతోషం కలిగింది. ఆహ్వానాన్ని స్వీకరించాను. ఏదైనా చెప్పే అవకాశం ఉన్న విషయాన్ని గూర్చి ప్రసంగించాలనుకున్నాను. ఇఖ్బాల్ కవిత్వంతో నాకు నిరంతర సాహిత్య ప్రణయం. పండితులు విజ్ఞాన సంపన్నులెందరో ఇఖ్బాల్‌నుగూర్చి అతి విశేషంగా వ్రాసినారు. ఆయన తత్త్వాన్నీ, ఆయన ఆలోచనా విధానాన్ని ఎంతో సూక్ష్మంగానూ, ఎంతో నిశితంగాను పరిశీలించారు. ఇంతవరకు ఇఖ్బాల్ తత్త్వాన్ని గూర్చి జరిగిన వివేచనను ఒకసారి సింహావలోకనం చేయడమే కష్టం: లాభంలేని పనికూడా. భూపాల్‌తో ఇఖ్బాల్‌కు సంబంధంఉండటంకూడా ఒక విశేషమే. ఆయన సాన్నిహిత్యంతో లబ్ధిపొందిన మంనూన్‌హసన్ గారు సజీవులై ఉండడం మరీ విశేషం. ఇఖ్బాల్‌కు భూపాల్‌తో ఉన్న సంబంధాలను గూర్చి తాము ప్రత్యక్షంగా చూసిన సందర్భాల నెన్నింటినో వారు మనకు చెప్పగలరు. ఈ విధంగా ఇఖ్బాల్ జీవితానికి సంబంధించిన కొన్ని కనుమరుగైన అంశాలు వెలుగులోకి రావచ్చు. కాని ఇఖ్బాల్ వ్యక్తిత్వాన్ని గుర్తించడానికి ఏర్పడిన రేఖలు వాస్తవమైనవో, దోషజుష్టమైనవో ? స్పష్టంగా తెలిపే మలుపులతో మనకింకా పరిచయం కలుగనే లేదు. ఏదోవిధంగా ఇఖ్బాల్ ఆలోచనలపై మనకింతవరకు నిలిచిపోయిన చూపుల నుంచి తప్పించుకుని వాస్తవికమైన దృక్కోణంలో పరిశీలించవలసిన అవసరం ఎంతైనా ఉంది.

ఇఖ్బాల్‌ను ప్రాచ్యఖండ మహాకవి అన్నారు. ఎందుకంటే, పాశ్చాత్య సామ్రాజ్యాధికారం మహోన్నత దశలో వెలుగొందుతున్నప్పుడు, ప్రాచ్యఖండ మంతా వలసరాజ్యాధి పత్యం కాళ్లకింద నలిగిపోతున్నప్పుడు, ఆయన ప్రాచ్య ఖండ ఆధ్యాత్మిక సాంస్కృతిక వైభవాన్ని ఎలుగెత్తి చాటినారు. ప్రాచ్యతత్త్వ ఔన్నత్యాన్నీ, ప్రాచ్యఖండ ఆలోచనా విధానాన్ని కీర్తిస్తూ గీతాలు ఆలాపించారు. ప్రాచ్యఖండ జీవిత దృక్పథాన్నీ, జగత్సృష్టికి సంబంధించిన ప్రాచ్య దృక్ప థాన్నీ, ప్రాచ్యజ్ఞానానంతపరిధులనూ హృదయాలకు హత్తుకునేట్టు చేశారు, జీవిత వ్యవస్థ నంతటినీ, ఆలోచనావిధానాలన్నింటినీ సమన్వయపరచగలిగేశక్తి ప్రాచ్య ఖండంలో ఇస్లాంకే ఉన్నదనీ, ఆ ఇస్లాంనే ప్రాతిపదికగా గ్రహించి వ్యక్తిత్వ తత్త్వాన్నీ మానవత్వ ఔన్నత్యాన్నీ స్పష్టమైన సంకేతాలతో వివరించవచ్చునీ ఇఖ్బాల్ విశ్వాసం. వ్యక్తిత్వతత్త్వానికి బీజావాపం చేయడానికి ఇస్లాంజీవిత వ్యవస్థ అనుకూలమైందని ఇఖ్బాల్ ఆలోచనలు ఆ వైపుకు మొగ్గినవి. అప్పటి ప్రాచ్యఖండంలో ఇస్లాంతత్త్వం నిశ్చితంగా అనుగుణంగా ఉందని ఆయన నమ్మారు. వలసరాజ్యాధిపత్యం కటువుగా మార్చిన జాతీయతత్త్వం ఇస్లామీ తత్త్వంలో ఇముడదు. ఇస్లామీ తత్త్వాన్ని తలస్పర్శిగా అవగాహన చేసుకోలేని హ్రస్వదృక్కులైన విమర్శకుల కండ్లను మిరుమిట్లు గొల్పగలిగింది ఇఖ్బాల్ ఆలోచన. కొందరు ఇఖ్బాల్ పాకిస్తాన్ సిద్ధాంతాన్ని సృష్టించారన్న అభిప్రాయం కలిగే విధంగా ఆయన చరమదశలో చేసిన ఉపన్యాసాలనూ, ప్రకటనలనూ వ్యాఖ్యానించారు.

స్వాతంత్ర్యం తరువాత ఉరుదూవాళ్లే, పాకిస్తాన్ సిద్ధాంతంతో ఇఖ్బాల్‌కు సంబంధం ఉన్నదనే అపోహతో ఆయన సాహిత్యాన్ని గూటికెక్కించారు. 1970 తరువాత ఇఖ్బాల్ భారతదేశంలో మళ్లీ జన్మించాడు. భారతదేశం ప్రపంచంలోనే ఉత్తమమైందనీ, భారతీయుల జీవిత తత్త్వాన్నే కాదు, భారతదేశ పర్వతాలనూ, నదీనదాలనూ, లోయలనూ కీర్తిస్తూ తన గీతాల ప్రభావంతో దేశభక్తినీ, దేశ ప్రేమను పునరుద్బుద్ధం చేస్తున్నాడు. నేను సుదీర్ఘంగా ఆలోచించి ఇఖ్బాల్ కవితలోని దేశభక్త్యంశాన్ని, సవిమర్శకంగా పరిశీలించాలనుకున్నాను. ఆయన దేశీయతా దృక్పథం స్వరూపం ఏమి? భారతదేశాన్ని గూర్చి, భారతీయులనుగూర్చి ఎలా భావించేవారు? ఆయన నిజంగా ప్రత్యేక రాష్ట్రవాది యా? లేక జాతీయ

సమైక్యతావాదియా? ఈ ప్రసంగంలో ఈ మౌలికమైన ప్రశ్నలకు సమాధానాలను సమకూర్చాలనుకుంటున్నాను.

ఒక విస్తరణోపన్యాసం విస్తృతులకు కూడా పరిమితులుంటాయి. ఈ ప్రసంగాన్ని వింటున్నవారికి తెలిసిన వివరాలను నేను వదిలివేస్తున్నాను. ఈ ప్రసంగం ఇంగ్లీషులో సాగింది. దీని ఉరుదూ అనువాదాన్ని హర్యానా సాహిత్య అకాడమీ వారు ప్రచురించి నావంటి చిన్న రచయితను ప్రోత్సహించారు. నేను ఆశించిన దానికంటె అధికమైన ప్రోత్సాహమే నాకు లభించింది. విమర్శకులు నేనిందులో చేర్చిన అంశాలకెంతో హర్షించారు. నేను నిష్పక్షపాతంగా పరిశీలన సాగించానని భావించారు. సాహిత్యపత్రికలు, ఇతర పత్రికలు ఎంతో ప్రశంసించినవి. ఆ సమీక్షలు ఇంకా పరిశోధించాలనే ఉత్సాహన్నీ, ధైర్యాన్నీ నాకు కలిగించినవి.

ఇది జనప్రియంకావడానికి మరో నిదర్శనం. కొందరు ఇతర భారతీయ భాషల్లో దీని అనువాదాలను వెలువరించడానికుద్యుక్తులయ్యారు. తమిళం,అస్సామీ, బెంగాలీ అనువాదాలు త్వరలోనే వెలువడనున్నవి. ఇతర ప్రాంతీయభాషల్లో కూడా వెలువడటం కూడా సంభవమే. కేవలం విద్వత్ప్రోషణ కోసం, విద్యా ప్రణయం కోసం ఈ గ్రంథ ప్రచురణకు తోడ్పడిన మహాశయులందరికీ నా హార్దిక కృతజ్ఞతలు. తొలి ప్రచురణ ప్రతులు కొన్ని నెలల్లోనే అయిపోయినవి. మలిప్రచురణ కూడా కొన్ని చేర్పులతో రావాలని మిత్రులు కోరినారు. ఈ పుస్తకం ఇతర భాషల్లో కూడా వెలువడుతున్నది కనుక, ఇక ముందు కూడా వెలువడవచ్చు కనుక చర్చ సందర్భంగా వచ్చిన కవితల నన్నింటినీ ఇందులో పొందుపరచడానికి ప్రయత్నించాను. ఆ మాటకొస్తే ఉర్దూ వాళ్లకు మాత్రం ఇఖ్బాల్ కవితలన్నీ తెలుసునా? ప్రాంతీయ భాషల్లో అనువాదాలు చదివే వాళ్లకు కేవలం గీతాల శీర్షికలను, లేక సారాంశాన్ని అందజేస్తే సరిపోదు. ఈ నెపంతో, పాక్షికంగానైనసరే ఇఖ్బాల్ కవితల అనువాదం జరుగుతుందనుకుంటాను. ఈ విషయాలన్నిటినీ దృష్టిలో పెట్టుకుని ఈ ప్రసంగపాఠాన్ని పునఃపరిశీలించాను. దీనివల్ల ఈ 'పుస్తిక' పుస్తకంగా రూపుదిద్దుకుంది. చర్చకు సంబంధించిన ఏ అంశం కూడా అర్ధోక్తితో ఆగిపోకుండా ఉండాలని నేను ప్రయత్నించేశాను. కాని గాలిబ్ అన్నట్టు ప్రకృతి ఇంకా అందాలను సవరించుకుంటూనే ఉంది.

పే షెసజర్ హై అయినా దాయంసకాబ్ మేం
(శాశ్వతాపకుంతనంలోనూ దర్పణం ఎదురుగానే ఉంది)

అందుకోసం నేను ఇది సమగ్రం అని ఎలా వాదించగలను? కొందరు మిత్రులు తొలి ప్రచురణను చూసి, చేసిన మంచిసూచనలు పునఃపరిశీలనకు ఎంతో ఉపయోగపడినవి. ఆ మిత్రులకు నా హృదయపూర్వకమైన ధన్యవాదాలు. మలి ప్రచురణలోని దోషాలనుగాని, స్ఖాలిత్యాలనుగాని విజ్ఞులు సూచిస్తే, ఆ సూచనలను సావధానంగా పరిశీలిస్తాను.

ఇది ప్రసంగమో లేక పుస్తకమో - ఏదైనా కానీయండి, ఇఖ్బాల్ తత్త్వాధ్యయనానికి అదనంగా చేరెన విషయమనే అపోహకు నేను పాలుపడలేను. ఇది ఇఖ్బాల్‌కు సంబంధించిన అపూర్వవిషయం (బాజ్ యాఫ్త్ - దొంగిలింపబడిన సొమ్ము మళ్లి దొరికింది) అనికూడా నేననుకోవడంలేదు. అయితే భారతీయ సాహిత్య, తాత్త్విక వాతావరణంలో ఇఖ్బాల్‌ను పునఃప్రతిష్ఠించడానికి నిజాయితీతో ప్రయత్నం జరిగిందని నిష్పక్షపాతంగా చదివే మహాశయులకు ఈ పుస్తకం తెలుపగలుగుతుంది. అపోహల దుమారంనుంచి విడిపడి మన కవికదంబంలో ఇఖ్బాల్ ప్రాచ్యఖండ మహాకవిగా వెలుగొందగలిగితే నా ప్రయత్నం విఫలం కాలేదనుకుంటాను.

నా యీ ప్రసంగం, నేను తొలి ప్రచురణ సందర్భంగా వ్రాసినట్టు, ఇంగ్లీషులో ఉంది. ఉరుదూ అనువాదం ప్రచురితమైంది. కాని ఇప్పుడు పునఃపరిశీలన తరువాత ఉరుదూ ప్రతిలో కొన్ని మార్పులూ చేర్పులూ కలిసినవి. అందువల్ల ఇది కేవలం 'అనువాదం' అనిపించుకోదు.

ఈ సంక్షిప్త గ్రంథం విద్వద్వలయంలో సృష్టించిన అభిరుచి నన్నెంతో ప్రోత్సహించింది. ఇఖ్బాల్ తత్త్వాన్ని, కళనూ నేను అంచెలంచెలుగా పరిశీలిస్తున్నాను. ఇంతకంటే సముచితంగా సువ్యవస్థితంగా ఇఖ్బాల్‌ను గురించి కృషిచేసి అందించాలని ఆశిస్తున్నాను. ఇఖ్బాల్ నిన్నటి కవి కాడనీ, రేపటి కవి అనీ, భవిష్యత్కవి అని నా విశ్వాసం. మన సమకాలికులకంటే రానున్న తరాలకు ఆయన అవసరం అత్యధికంగా ఉన్నది.

ఈ ప్రచురణ సందర్భంగా నాకు సహకారాన్ని అందించిన మిత్రులకు నా కృతజ్ఞతలు. విశేషించి నా చిరకాల ప్రియస్నేహితుడు డాక్టర్ నిసార్ అహమద్ ఫారూఖీ గారికి అపాదమస్తకం నేను కృతజ్ఞుణ్ణి. ఆయన విలువైన, సౌహార్ద పూర్ణమైన సలహాలు లభించి ఉండకపోతే ఈ పుస్తకానికి సమగ్రత చేకూరి ఉండేది కాదు. ఇంకా సుల్తాన్ అంజుంగారి వ్యగ్రత, పరిశ్రమ, నిష్ఠ ఈ పుస్తకం చిత్తుప్రతిని సిద్ధం చేయడంలోనూ ముద్రణలోనూ ఎంతో ఉపకరించినవి. ఆయన సహకారాన్ని కాదనడం కృతఘ్నత అనిపించుకుంటుంది. మలిప్రచురణను కూడా చేపట్టిన హర్యానా సాహిత్య అకాడమీవారికి పునః ధన్యవాదాలు సమర్పించు కుంటున్నాను.

హర్యానా రాజ్ భవన్,
చండీగఢ్, 160019.

సయ్యద్ ముజఫర్ హుసేన్ బర్నీ

# విషయ సూచిక

# దేశభక్తి

ఇక్బాల్ నిర్యాణం తర్వాత దాదాపు అర్ధశతాబ్దం కడచినా, ఆయన అందించిన దేశసమైక్యతా సందేశంపట్ల అపోహలు ఇంకా ఉండనే ఉన్నవి. ఇక్బాల్ అచ్చమైన దేశభక్తుడు. పరమత సహిష్ణత పట్ల, భారత తత్త్వవేత్తల పట్ల, దైవభక్తుల పట్ల ఆయనకు అత్యంత ఆదరాభిమానాలు ఉండేవి. ఇస్లాం మతాన్ని తలస్పర్శిగా అవగాహన చేసుకున్న మనీషి. ఐనా భారతీయ తత్త్వశాస్త్రాధ్యయన ప్రభావం ఆయన ఆలోచనలపై అతిమాత్రంగా ఉంది. కుల,మత,ప్రాంత విభేదాలు తలెత్తుతున్న ఈ నేటి విపత్కర తరుణంలో మన దేశమున ఈనాటి చరిత్రలో ఆయన సందేశం ప్రత్యేకంగా పరిశీలింపదగింది.

మాతృదేశ ప్రేమ :- మాతృదేశంపట్ల ప్రేమే జాతీయ సమైక్యానికి పునాది. ఇక్బాల్ తన కవిత్వాన్ని ప్రారంభించినప్పుడే దేశభక్తిపూరితమైన కవితల నెన్నింటినో వెలయించినాడు.

ఇక్బాల్ ఉర్దూ కవితల ప్రథమ సంకలనం "బాంగెదరా" 1924 లోని మొదటి కవిత హిమాలయంపై చెప్పిందే. 1899 లో "అంజుమనె హిమాయతె ఇస్లాం" లాహోర్‌లో నిర్వహించి వార్షికోత్సవ సమావేశంలో ఇక్బాల్ తన కవిత "నాలయే యతీం" (అనాథ ఆర్తి) చదివి సభనంతా రసప్లావితం చేశాడన్న సంగతి ప్రత్యేకంగా పేర్కొనతగింది. కాని ఆయన మొదటి ఉర్దూ కవితా సంకలనం ఈ కవితలో ప్రారంభం కాదు. నిజానికి ఈ కవితను ఆయన తన సంకలన గ్రంథంలోనే చేర్చలేదు.

ఇక్బాల్ తన కవిత "హిమాలయ్" లో భారతీయ ప్రాచీన సంస్కృతినీ, అత్యంత మనోహరమైన కొండలనూ, లోయలనూ చిత్రించాడు. ఆయన దృష్టిలో

హిమాలయం కేవలం పర్వతం కాదు దానికి ఇంకా విశేష ప్రాముఖ్యం ఉంది. అది భారతదేశానికి సంరక్షక శక్తి ఇది భారతీయ సమగ్రతకు పెట్టనికోట.[1]

(ఓ హిమాలయమా! నీ భారతానికి కోటగోడవు ఆకాశమే వంగి నీ పాదాన్ని చుంబిస్తున్నది. నా మౌనమే నా కథను చెబుతున్నది )

ఇక్బాల్ ఈ దేశంలో నివసిస్తున్న వివిధవర్గాలూ, జాతులూ కలసిమెలసి బ్రతకాలనీ, సౌభ్రాత్రంతో మనుగడ సాగించాలనీ నొక్కిచెప్పాడు. విశేషించి తన కవిత "తరానయే హిందీ" ('భారతీయ గీతం') లో ఆయన ఈ దేశంలో వివిధ జాతులు నివసిస్తున్నా ఆ వైవిధ్యంలోనే ఒక ఏకతా సంబంధ ముందని అన్నాడు. 'తరానయే హిందీ' ఆయన దేశభక్తి ప్రపూర్ణమైన ఒక కవితకు సముజ్జ్వలోదాహరణం. ఈ కవితలో దేశంపట్ల ఆయనకున్న ఉత్కటమైన ప్రేమ ఎంతో ప్రభావోపేతంగా, ఎంతో సుకుమారంగా ప్రస్ఫుటమైంది. దురంతమైన భారత విభజన జరిగిఉండకపోతే, ఈ కవిత మన దేశానికి జాతీయగీతమై ఉండేది. చిత్తగించండి [2]

(సర్వప్రపంచంలోనే మంచిది మా భారతదేశం. మేముకోయిలలం ఇది మా వనవాటిక. పరదేశంలో ఉన్నా గుండె మాతృదేశంలోనే ఉంటుంది. అక్కడే మా గుండె లుండాలని అనుకోండి. అన్నిటికంటె ఎత్తైన పర్వతం ఆకాశానికే పొడుగు. మమ్మల్ని అది సదా సంరక్షిస్తుంది. ఆమె ఒడిలో వేలవేల నదీనదాలు ఆడుకుంటున్నాయి. వాటివల్ల మన దేశం స్వర్గానికే అసూయ కలిగించే నందనమైంది. ఓ గంగా! నీ తీరానికివచ్చి మేము విడిదిచేసిన రోజులు జ్ఞాపకం ఉన్నాయా?పరస్పర ద్వేషాన్ని ఏ మతమూ బోధించదు. మేమంతా భారతీయులం. మా మాతృభూమి భారతదేశం. గ్రీసు, ఈజిప్టు,రోం నామరూపాలులేకుండా సమసిపోయినవి. మా ఆనవాళ్ళింకా మిగిలే ఉన్నవి. మన వ్యక్తిత్వం ఎందుకో సమసిపోదు. ఏమి మహిమో!

---

1. చూ. అనుబంధంలోని మూలం; సారాంశం.
2. చూ. అనుబంధం-2.

శతాబ్దాలనుంచి సమకాలికులు మనపై కత్తిగట్టుతూనే ఉన్నారు. ఇఖ్బాల్! రహస్య వేత్త ప్రపంచంలో ఎవడూలేడు మన హృదయవేదన ఇతరులకు తెలిసేది ఎలా?)

1938 లో ఢిల్లీ పత్రిక 'జోహార్' ఇఖ్బాల్ ప్రత్యేక సంచికకోసం సంపాదకుని పేర వ్రాసిన తన లేఖలో మహాత్మాగాంధీ 'తరానయ్ హిందీ'ని ప్రశంసించారు. ఆయన ఈ లేఖను ఉర్దూలోనే వ్రాశారు. ఆయన మాటల్లోనే ఉన్న ఈ లేఖను చూడండి.

"మీ లేఖ అందింది స్వర్గీయ ఇఖ్బాల్‌ను గురించి ఏం వ్రాయను? కాని ఇంతమాత్రం అనగలను. ఆయన ప్రసిద్ధగీతం 'హిందూస్తాం హమారా' చదివి నప్పుడు నా హృదయం ఉప్పొంగిపోయింది. బడోదా జైలులో కొన్ని వందలసార్లు ఈ గీతాన్ని నేను పాడుకుని ఉంటాను ఈ గీతంలోని పదాలు నాకెంతో మధు రంగా తోచినవి. ఈ లేఖ వ్రాస్తున్నప్పుడు కూడా ఆ గీతం నా చెవుల్లో గింగురు మంటూనే ఉంది."

మరో సందర్భంలో గాంధీజీ హిందీ-ఉర్దూ భాషలమధ్య ఉన్న వివాదాన్ని పరిష్కరించాలన్న ఆశయంతో 'తరా నయ్ హిందీ'ని ఉదాహరిస్తూ, ఈ గీతం భారతదేశ జాతీయ భాషకు ప్రతీక అన్నారు.

"ఇఖ్బాల్ వ్రాసిన 'హిందుస్తాన్ హమారా' గీతం విని స్పందించని భారతీయుని హృదయం ఉందా? ఒకవేళ ఉంటే ఆ హృదయానికి దురదృష్టం పట్టిందనుకుంటాను. ఇఖ్బాల్ వ్రాసిన ఈ గీతంలోని భాష హిందీయా లేక హిందుస్తానీయా లేక ఉర్దూనా? ఇది భారతదేశ జాతీయ భాష కాదని ఎవడు అనగలుగుతాడు."[8]

ఈ గీతం అత్యంత వైభవాన్ని అనుభవించింది. లాలా హర్‌దయాల్ స్థాపించిన Young Men's Indian Association ప్రారంభోత్సవ సమా

8. Mahatma & G. D. Tendulkor, VOL VIII, p 296.

వేశంలో ఇఖ్బాల్ అధ్యక్షోపన్యాసంచేస్తూ ఈ గీతాన్ని ఆలపించాడు. ఆ సభకు హాజరైన మహమ్మద్ ఉమర్ (నూర్ ఇలాహీ నాటక్ సాగర్ రచయిత) కథనాన్ని ఆధారం చేసుకుని సయ్యద్ జఫర్ హాష్మీ ఆ సభా వివరాలను ఉట్టంకిస్తూ ఇలా వ్రాశాడు:

"లాలా హర్‌దయాల్ భారతదేశాన్ని వదిలి దేశాంతరవాస శిక్షను అనుభవిస్తూ కొంతకాలం అమెరికాలో ఉన్నారు. లాహోరులోని ప్రభుత్వ కళాశాలలో ఎం.ఏ. చదువుతుండేవారు. హర్‌దయాల్‌ది విచిత్రమైన వ్యక్తిత్వం. అతి విచిత్రమైన, అద్భుతమైన ప్రకృతి అతనిది. మరేకాలంలోనైనా ఆయన ఉంటే ఋషిగానో మునిగానో రూపొంది ఉండేవాడు. ఒకసారి చదివింది మరచిపోయేవాడు కాడు. అంతటి ధారణాశక్తి అతనిది. ఇందులో అతిశయోక్తి ఏమాత్రమూ లేదు. హర్‌దయాల్ తన కళాశాలలోనే కాదు ఇతర కళశాలల విద్యార్థులకు కూడా అత్యంత ఆత్మీయుడు. 1904 లో లాహోర్‌లో Y.M.C.A అన్న పేరుతో ఒకే ఒక్క క్లబ్బుఉండేది. హర్‌దయాల్‌కూడా ఆక్లబ్బులో సభ్యుడు. దేశభక్తికీ జాతీయతకూ అతని హృదయం ఆలవాలం. ఒకనాడు క్లబ్ కార్యదర్శితో ఏదో విషయంలో జగడం రేగింది. మాటా మాటా పెరిగింది ఇంకేముంది? హర్‌దయాల్ **Young Men's Indian Association** కు అంకురార్పణ చేశాడు. అన్ని కళాశాలల్లో విద్యార్థులు హర్‌దయాల్‌ను అనుసరించారు. అప్పట్లో ఇఖ్బాల్ ప్రభుత్వ కళాశాలలో ఉపన్యాసకులుగా ఉండేవారు. హర్‌దయాల్‌తో ఇఖ్బాల్‌కు ఎంతో స్నేహం ఉండేది. తన క్లబ్బు ప్రారంభోత్సవానికి అధ్యక్షత వహించవలసిందిగా హర్‌దయాల్ ఇఖ్బాల్‌ను ఆహ్వానించాడు. ఇఖ్బాల్ అందుకు ఒప్పుకున్నాడు. సాయంకాలం మూడు గంటలకు సభ ఏర్పాటు చెయ్యాలని నిర్ణయం జరిగింది. కాని సాయంకాలం ఆరు గంటలకు ప్రారంభమైంది. ముందు ఇఖ్బాల్ అధ్యక్షోపన్యాసానికి బదులుగా 'సారే జహాఁసే అచ్ఛా హిందూస్తాఁ హమారా' అన్న గేయాన్ని ఆలపించడం ప్రారంభించారు. సభాసదుల్లో ఆనందం తరగలెత్తింది. ఇఖ్బాల్ గీతాలాపన చేస్తున్నాడు. సదస్యులు ఓలలాడుతున్నారు."[4]

---

4. సయ్యద్ జఫర్ హాష్మీ. "అల్లామా ఇఖ్బాల్ కే తరానేకీ షాన్" (ఇఖ్బాల్ గీత వైభవం) 'చట్టాన్' వారపత్రిక - లాహోరు - 1-5-1967.

భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత కూడా ఈ గీతాన్ని గాంధీజీ మరువలేదు ఆగస్టు 21, 1947 నాడు "నవాఖాలీ" (ఇప్పుడిది బంగ్లా దేశ్‌లో ఉంది) లో భారత, పాకిస్తాన్ పతాకాలు ఎగురుతున్న ఒక ఊళ్ళో గాంధీజీ ప్రార్థనా సమావేశంలో ఈ గీతాన్నే ఆలపించారు[5]

"మజ్‌హబ్ నహీం సిఖాతా ఆపస్‌మేం బైర్ రఖ్నా" (పరస్పర విద్వేషాన్ని ఏ మతము బోధించదు.) గాంధీజీ ఆ గీతంలోని ఈ పంక్తిని పునశ్చరణ చేస్తూ "ఇకమీద మన సమస్యలను పరిష్కరించుకోవడానికి ఎప్పుడూ కత్తిని ఎత్తకూడదు" అని సూచించారు.

ఇక్కడ ఒక మనోహరమైన విషయాన్ని చెప్పడం అప్రస్తుతం ఏమీకాదు. దూర్‌దర్శన్ సిగ్నేచర్ సంగీతపుబాణి రవిశంకర్ కట్టిందే. ఇదే గీతాన్ని ఆధారంగా చేసుకుని కట్టింది. దేశంకోసం ప్రాణాన్ని ఆహుతిచ్చిన ఇందిరాగాంధీ ఈ బాణిని ఎంతో మెచ్చుకున్నారు. 1975-76 లో సమాచారశాఖకు నేను కార్యదర్శిగా ఉన్నప్పటిమాట. నిజానికి దూర్‌దర్శన్ సిగ్నేచర్ సంగీతపుబాణి ఈ గీతానికి అనుగుణంగా ఉండాలని ఇందిరాగాంధీయే ప్రతిపాదించారు. ఇక్బాల్ మరో గీతం "హిందీస్తానీ బచ్చోంకా ఖౌమిగీత్" (భారతీయ బాలబాలికల జాతీయ గీతం)లో మతాలెన్ని ఉన్నా దేశం ఒక్కటే అన్న సమైక్య సందేశమిచ్చే గీతమిది.[6]

"ఏ భూమిలో చిష్తీ భగవత్సందేశాన్ని వినిపించాడో, ఏ తోటలో నానక్ దేవుడొక్కడే అన్న గీతం ఆలపించాడో, తాతారులు ఏ దేశాన్ని తమ మాతృభూమిగా భావించారో, పవిత్ర యాత్రికులను ఏ దేశం అరేబియా ఎడారుల నుంచి విడిపించిందో అదే నా దేశం. అదే నా దేశం ... ...పర్షియా విహాయసం నుంచి విరిగిపడ్డ చుక్కలకు కాంతినిచ్చి పాలవెల్లి కాంతులతో వెలిగించిందో, ఎక్కడి నుండి దేవుడొక్కడన్న నినాదం వినిపిందో అదే నా దేశం అదే నా దేశం."

---

5. జాదూగర్ హిందీ నజాద్-ఆతీఖ్‌సిద్దీకి, పు. 41.
6. చూ. అనుబంధం - 8.

'బచ్చోంకి దువా' (పిల్లల ప్రార్థన) అన్న గీతంలో తోటలో పూలున్నట్లే మనమూ ఈ దేశంలో కలకలలాడుతూ ఉందాం అంటారు ఇక్బాల్.

"హో మెరె దంసే యూంహీ మెరే వతన్‌కీ జీనత్
జిస్ తరహ్ ఫూల్ సే హోతీహై చమన్‌కీ జీనత్".

(నా ఉనికే నా దేశానికి అలంకారం. పూవు ఉనికి తోటకు అలంకారం) ఇలాంటి గీతం 'నయాశివాల' (నూత్న మందిరం)లో దేశభక్తి భావాన్ని కాంతి మంతంగా చిత్రించాడు. ఈ దేశంలోని ప్రజల్లో సమైక్య భావం లేదని అతనికి బాగా తెలుసు మతపరమైన సిద్ధాంతాల్లోని వ్యత్యాసమే ఈ అనైక్యతకు ప్రధాన కారణమని ఆయన విశ్లేషించి చెప్పాడు. వాదాలకు అతీతంగా ఉండి కలసి మెలసి సమైక్యభావంతో జీవితం గడపాలనీ హిందువులకూ ముస్లిములకూ ఆయన ఉప దేశం చేశాడు. ఐకమత్యం, పరస్పర ప్రేమ, దేశభక్తి పునాదులపై ఒక నూత్న భారత దేశాన్ని నిర్మించాలని ఆయన కలలు కన్నాడు. వివిధ వర్గాల మధ్య స్నేహం, ప్రేమ, సౌజన్యం నిరంతరంగా కొనసాగాలంటే అందరూ ఒక ప్రతిమను పూజించాలనీ, అదే భారతదేశమని ఆయన అభిమతం.[7]

"ఓ బ్రాహ్మణా! నిజం చెప్పనా? నీ గుళ్ళలో ప్రతిమలు పాతబడినవి. తన వాళ్ళతో వైరం ఆ ప్రతిమలవల్ల నేర్చుకున్నావు! భక్తునికికూడ యుద్ధాలు నేర్పాడు దేవుడు. విసిగి నేను పవిత్ర స్థలాలను వదిలివేశాను. భక్తుల ఉపన్యాసాన్ని వదిలాను. నీ కథలన్నీ వదిలివేశాను. రాతిబొమ్మల్లో దేవుడున్నాడని నీ వను కున్నావు. ఈ భూమి ధూళిలోని ప్రతి ఒక కణం నా కొక దేవత. రా! అన్యత్వ యవనికలను తొలగిద్దాం. విడిపోయిన వాళ్ళను కలుపుదాం. మనోనగరం ఎంత కాలంగానో చిన్నబోయి ఉంది. రా! ఈ దేశంలో ఒక కొత్త మందిరం నిర్మిద్దాం. లోకంలో సకల తీర్థాలకంటే ఉన్నతమైంది మన తీర్థస్థలి. ఆకాశాంచలాలతో ఈ తీర్థశిఖరాన్ని కలుపుదాం. భక్తుల గీతాల్లో శక్తి ఉంది. శాంతి ఉంది. భూలోక

---

7. చూడు అనుబంధం - 4.

వాసులకు ముక్తి ప్రేమలో ఉంది" ఈ గీతాన్ని వ్యాఖ్యానిస్తూ ప్రొఫెసర్ యూసుఫ్ సలీం చిష్తి "కవితా దృష్టితో చూస్తే ఈ గీతం ఇఖ్బాల్ దేశభక్తికి తార్కాణంగా కనబడుతుంది. దేశౌన్నత్య చిహ్నాలను దేశప్రజల హృదయాలపై ముద్రించాలని కవి తన యావత్కవితాశక్తులను వినియోగించుకున్నాడు. హిందూ ముస్లిం ఐక్యతను ఉద్దేశించి ఇఖ్బాల్ వ్రాసిన చక్కని గీతం ఇది అని పలువురు విమర్శకుల అభిప్రాయం" అని అన్నారు.

అనైక్యత - ఇఖ్బాల్ దుఃఖం :-

ఎడతెగని మత కలహాలూ, వివాదాలు ఇఖ్బాల్ మనస్సును ఎంతో బాధ పెట్టినవి. గాయపరచినవి. ఆ బాధను 'సదాయె దర్ద్' (బాధానాదం) అనే గీతంలో ఇలా వ్యక్తపరచుకున్నాడు.[8]

"మండిపోతున్నాను. శాంతిలేదు. గంగా జలమా! నన్ను నీలో ముంచుకో.... ఎవరినీ ఆకర్షించలేని అందమెందుకు? సభాగారమేలేదు జ్యోతి ఉంటేమి లేకుంటేమి? వాక్చాపల్యం మౌనంగా మారదెందుకు? మా భాషా సౌందర్యం పెదవి విప్పిం దెప్పుడు? యుద్ధ జ్వాల ఉద్యానవనాన్ని చిందేసింది. మన భూమిలో ప్రళయాన్ని మరిపించే ద్వేషం ప్రబలుతున్నది. కలయిక ఎక్కడిది? ప్రతి క్షణాన్ని విరహం ఆక్రమిస్తున్నది."

జాతీయ సమైక్యతకోసం విహ్వలపడుతున్న ఆయన మనసు, వైరుధ్యాలు, కలగలపుతనాన్ని వికావికలు చేస్తున్నవని క్షోభపడ్డది. వీటికి అతీతంగా ఉండాలన్న ఆయన విజ్ఞప్తి జాతీయ సమైక్యతా సందేశం ఆ కాలంలో ఆయన వ్రాసిన కవితల్లో దర్శనమిస్తుంది. 'సయ్యద్‌కి లూహెతుర్బత్' అన్న శీర్షికతో వెలువడిన కవితలో విభిన్న వర్గాల మధ్య సఖ్యత ఉండాలని ఎలుగెత్తి చాటాడు

వా నకర్నా ఫిర్ఖబందీకేలియే అప్నీ జబాన్
ఛుప్‌కె బైఠాహై హంగామయె మహషర్ యహాం

8. చూ. అనుబంధం - 6.

వసల్‌కె అస్బాబ్ పైదాహోఁ తెరీ తహరీర్‌సే
దేఖ్, కోయి దిల్‌న దుఖ్‌జాయ్ తెరీ తక్రీర్ సే
మహిఫిలె నో మె పురానీ దాస్తానోఁకొ న ఛేడ్
రంగ్‌పర్ జొ అబ్ న ఆయేఁ ఉన్ ఫసానోఁకొ నఛేడ్

"వర్గనిర్మాణానికి అనుకూలంగా మాటాడకు. ప్రళయం పొంచిఉన్నది. నీ రచనలు కలియికకు కారణాలు కావాలె. నీ ప్రసంగంవల్ల ఎవరిమనస్సుకూడా బాధ కూడదు. పాత కథలను వెలికిదీయకు. రసహీనమైన కథలను చెప్పకు."

సర్ సయ్యద్ అహమద్‌ఖాన్ హిందూముస్లిం ఐక్యతకోసం గట్టి ప్రయత్నాలు చేశాడు. ఆయన 1867లో భారతీయులను ఇంగ్లీషువారి సరసన కూర్చోనివ్వనందుకు బ్రిటిషుదర్బారునుంచి లేచివచ్చేశాడు.[౪]

అక్బర్ దీనె 'ఇలాహీ', కబీరువాణి, సరియైనరీతిలో ప్రజాబాహుళ్యానికి అందిఉంటే కులవర్గ విభేదాలు చాలావరకు తగ్గిఉండేవని ఇక్బాల్ విశ్వాసం. 29 డిసంబరు 1930లో అలహాబాదులో జరిగిన ముస్లింలీగ్ వార్షిక సభలో ఆయన తన అధ్యక్షోపన్యాసంలో-

"మానవుణ్ణి అతనిజాతి కట్టివేయదు. మతం కట్టివేయదు. అతనికి నదుల ప్రవాహాలుకాని, పర్వతపంక్తులుకాని హద్దులుకాలేవు. వివేకం, జాగృతహృదయం ఉన్న జన సమాజం ఒక నైతిక చైతన్యాన్ని సృష్టించుకుంటుంది. ఆ చైతన్యమే జాతి" అన్నాడు రేనాన్.

ఇలాంటి జాతినిర్మాణం సంభవమే, అయితే మానవునిలో నూత్నమైన భావాలను పెంపొందించడానికి సుదీర్ఘమైన ప్రయత్నం అవసరం. కబీర్, అక్బర్ సందేశాలు ఈ దేశప్రజల మనస్సుల్లోకి చొచ్చుకునిపోయి ఉంటే ఈ సమైక్య మానవతాభావం యదార్థ రూపంతో అవతరించి ఉండేది. కాని భారతదేశంలోని

---

౪. మౌలానా అల్తాఫ్‌హుస్సేన్ హాలీ. హయాతెజావేద్, పుట. ౩౩౭.

వివిధ జాతి, మత, వర్గాలు ఈ అభిప్రాయంతో ఎప్పుడూ ఏకీభవించలేదని మనకు పరిశీలనవల్ల తెలుస్తున్నది. తమతమ విశిష్టలక్షణాలు ఒక బృహన్నిర్మాణ వ్యవస్థలో కలసిపోయి నామరూపాలులేకుండా పోవాలని ఎవరూ ఆశించరు. ప్రతివర్గం తన ప్రత్యేకమైన అస్తిత్వాన్ని నిలబెట్టుకోవాలని ఆకాంక్షించింది. భారత ప్రజలలోని వివిధ వర్గాలు తమ తమ విశిష్టతలను నిలుపుకొనుటకు ప్రయత్నించడం అవి వారికి చాలా విలువైనవి వెలకు అమ్ముకోలేనివి "భారతజాతి" అనునది మన అందరి లక్ష్యమే కాని దీన్ని నిర్మించడానికి నిరాకరణదృష్టి పనికిరాదు. పరస్పరావగాహన, పరస్పర సహకారం వల్లనే ఇది సాధ్యమవుతుంది.

సామ్రాజ్య శక్తులన్నీ విభజించి పాలించు అన్న నీతిని అవలంబిస్తూ బ్రతుకుతూ ఉంటాయన్న సంగతి ఇఖ్బాల్‌కు బాగా తెలుసు. అందుకే ఆయన వివిధ వర్గాలమధ్య అనుదినం పెరిగిపోతున్న స్పర్థలూ, కలహాలూ నాడు భారతదేశంపై పెత్తనం చెలాయిస్తున్న సామ్రాజ్యవాద శక్తులను బలపరస్తున్నాయని వివరిస్తూ స్వదేశీయులను సమైక్యంగా ఉండమని హెచ్చరించాడు. తన గీతం "వ్యధాచిత్రం" (తస్వీరెదర్ద్)లో ఆనాడు మన సమాజాన్ని పీడిస్తున్న అనేక దురాచారాలను ఎత్తి చూపించాడు. జాతీయ సమైక్య జీవనానికి అవి ఎలా అడ్డుతగులుతున్నాయో కూడా నిరూపించి చెప్పాడు శక్తిమంతంగా.[10]

"నా కథకు పరిష్కారమే లేదు. మౌనమే భాష. నాలుకేలేని నోరు నాది. ఈ సభలో ఈ నీ వాగ్బంధనం ఎలాంటిదో! ఇక్కడెందుకో నాకు మాటాడాలని ఉంది మరి! తోటలోని నర్గిస్ వంటి నానారకాల పూలల్లో పరచుకున్నది నా కథ. పావురాళ్ళు, చిలుకలు, కోకిలలు ఎగురేసుకుపోయినవి. తోటలోని వాళ్ళంతా కలసి నా మాటల మూటలను దోచుకున్నారు. దీపమా! కన్నీటి బొట్టువై పతంగాల నేత్రాల నుంచి రాలుము. ఆపాదమస్తకం బాధను నేను ఆశలు పెంచుకున్న బ్రతుకు కథ నాది ఈ లోకంలో ఇంకా ఉండి ఏమి లాభం? నేను చిరంజీవినా!

---

10. చూ. అనుబంధం - 6

నాకు మృత్యువు లేదా? ఇది నా ఏడ్పుకాదు- తోట ఏడ్పు నేను కుసుమాన్ని. శిశిరం ప్రతి కుసుమానికి, అయితే శిశిరం నాకే"

స్వదేశీయులను తమ సముజ్జ్వలమైన మనోహరమైన పూర్వేతిహాసాన్ని వల్లెవేస్తూ కూచోవద్దని హెచ్చరించాడు. వర్తమాన కాలానికి అర్థమైన చైతన్యాన్ని సంపాదించుకోమన్నాడు. భవిష్యత్తు స్వరూపాన్ని అర్థం చేసుకోమన్నాడు. నిరాశా నిస్పృహలతో క్రుంగిపోతున్న దేశం కేవలం కన్నీళ్ళతో బాగుపడదని ఆయన నమ్మకం.[11]

"ఓ భారతదేశమా! నీ దృశ్యం నన్నేడిపిస్తున్నది. అతి దీనంగా ఉంది అన్ని కథల్లో నీ కథ. ఏడ్పునిచ్చి నాకంత ఇచ్చివేశావు దేశాన్ని గూర్చి ఆలోచించుకో బుద్ధిలేనివాడా! కష్టాలు వస్తున్నవి నీ వినాశానికి ఆకాశాల్లో కుట్రలు పన్నుతున్నారు. ఏం జరుగుతున్నదో కొంచెం చూడు పాత కథల్లో ఏముంది? మౌనం ఎంతవరకు? ఎలుగెత్తి పలుకడం నేర్చుకో. నీ భూమి మీద ఉన్నావు. నీ నినాదం నింగిలో మారుమ్రోగాలె తెలుసుకోకపోతే నశించిపోతారు భారతీయులారా! కథల్లో కూడా మీ కథ మిగులదు ఇదే ప్రకృతి విధానం. ఇదే ప్రకృతి రహస్యం. ఎవడు శ్రమిస్తాడో వాణ్ణి ప్రేమిస్తుంది ప్రకృతి."

ప్రతి భారతీయుని హృదయంలో అణగిమణగి, నీరసంగా, నిస్తేజంగా ఉన్న బాధ రగులుకుని జాజ్జ్వల్యం కావాలని ఇఖ్బాల్ తపన ఆ బాధ కవి హృదయాన్ని రగుల్కొలుపాలె దేశీయులంతా ప్రక్క దొరలించాలె. ఇఖ్బాల్ దేశభక్తి భావాన్ని జాతి పునర్నిర్మాణాన్ని, జాతి అభ్యుదయాన్ని ఆకాంక్షిస్తూ చెప్పిన ఈ కవిత ఆయన హృదయాన్ని వ్యక్తపరచ గలుగుతున్నది.[12]

"కనబడని గాయాన్ని కనపరుస్తాను. రక్తాశ్రువులతో సభను వనవాటిగా మారుస్తాను. ప్రతి హృదయ జ్యోతిని అణగారిన దుఃఖంతో వెలిగిస్తాను. నీ

---

11. చూ. అనుబంధం - 7

12. చూ. అనుబంధం - 8

చీకట్లను దీపావళిగా మారుస్తాను. విడిపడిన పూసలను మాలగా కూరుస్తాను. ఇక్కట్లను సౌకర్యాలుగా మారుస్తాను నేను చూసిందే లోకానికి చూపిస్తాను. ఆశ్చర్య దర్పణంలో నీ ముఖచ్ఛాయను చూపిస్తాను తెరల్లో ఉన్న దాని అదృశ్య నేత్రాలు చూడనే చూస్తాయి. కాలం ప్రవృత్తిని పోరాటం చూడనే చూస్తుంది."

తన దేశీయులు తన ఔన్నత్యాన్ని తెలుసుకోవాలంటాడు ఇఖ్బాల్. ఆలోచనలను సమున్నతం చేసుకోవాలంటాడు. ఆత్మవంచనా బంధాల నుంచి విడిపోవాలంటాడు. మహోన్నత మానవతాదర్శాలను ఎలుగెత్తి చాట మంటాడు. జాతులు వికసిస్తున్నకొద్దీ, సంకుచితమైన, జాతీయభావం కూడా ప్రాణాంతకంగా పరిణమిస్తుంది. వైయక్తిక, సాంఘిక సామర్థ్యాలు అర్థంలేని విభేదాలకు బలి అవుతాయి. జాతీయతా నిర్మాణ కార్యక్రమం ఆగిపోతుంది జీవితం ఎదుర్కొనే కష్టాలను అర్థం చేసుకోమంటాడు నిర్లక్ష్యమే. నిష్ఠురత్వమే వైయక్తిక, సామాజిక రుగ్మత లన్నింటికీ మూలం. భారతీయ తత్త్వంలో దీనికి సరియైన నివారణోపాయం, ఆధ్యాత్మిక ప్రయోగం, ఆత్మనిగ్రహం, యోగాభ్యాసం, సత్కర్మవంటి రూపాల్లో ఉంది.[18]

"మనస్సుకు ఔన్నత్యానుభూతిని కలిగించలేదు నీవు. పాద చిహ్నాలవలె బ్రతుకంతా అట్టడుగున పడి గడిపినావు. నీ చూపులు నీకే పరిమితమైనవి. వెలుపలి చూపులతో నీకు పరిచయమే లేదు. పరుల అందాల వంకలు తీర్చబోయావు. అద్దంలో నీ ముఖాన్ని చూసుకోలేక పోయావు. పక్షపాత బుద్ధిని వదిలి చూడు. ఈ ప్రపంచ ముకుర మందిరాన్ని చూడు నీకు నచ్చని నీడలన్నీ ఇక్కడున్నవి."

ఈ భావమే విస్తృతంగా ఇకముందు ఉదృతమయ్యే కవితలో కనబడుతుంది. ప్రేమ, సహిష్ణుత, సానుభూతి అలవరచుకోవాలంటాడు. ప్రకృతిని దర్శించి సత్యాన్ని తెలుసుకోగలిగే వివేకం, సానుభూతి వల్లనే కలుగు

18. చూ. అనుబంధం - 9

తుంది ప్రకృతిని చూడ్డానికి మాత్రమే కండ్లను ప్రసాదించలేదు దేవుడు. వీటిలో బాష్ప మౌక్తికాలను నిక్షిప్తం చేశాడు. తన పానపాత్రలో సర్వ ప్రపంచాన్ని చూస్తూ తన ప్రపంచాన్నే మరచిపోయిన జంషీద్ ప్రభువులాగా ప్రవర్తిస్తే, అంతకంటె నష్టం మరొకటి ఉండదు. ఇదే కవితలో ఇఖ్బాల్ స్వమత పక్షపాతాన్ని సంకుచితత్వమనే ఫలాన్నిచ్చే వృక్షంతో పోల్చాడు స్వర్గంలో నిషిద్ధ ఫలాన్ని తిన్నందుకు ఆదమ్ భూలోకానికి పతనమైనట్టే స్వమత పక్షపాత వృక్ష ఫలాన్ని తినేవాళ్లు మాటిమాటికి పతనాన్నే పొందుతూ ఉంటారు. మనల్ని మనమే అర్థం చేసుకోవాలనీ, మన గాయాలకు మనమే ఔషధం సిద్ధం చేసుకోవాలని ఇఖ్బాల్ కోరిక. జాతీయ సమైక్యత. పరస్పర ప్రేమే ఆ ఔషధం.[14]

దిఖావో హుస్నెఆలం సోజ్ అప్నీ చష్మెపుర్‌నం కా
జొతడ్పాతాహై పర్వానేకో రులాతాహై షబ్నంకో
నిరా జారహి అయ్‌బుల్హవస్! మక్సద్ నహీఁఇస్కా
బనాయాహై కిసీనె కుఛ్ సమఝ్‌కర్ చష్మె ఆదంకో
అగర్ దేఖాభి ఇస్నే తో సారే ఆలంకో క్యాదేఖా
నజర్ ఆయీ నకుఛ్ అప్నీ హకీకత్ జాంసేజంకో.

"అశ్రుపూర్ణమైన నీ కన్నులకు బ్రతుకు బాధను చూపించు దీపపు పురుగును విలవిలలాడిస్తుంది. మంచు బిందువులను ఏడిపిస్తుంది."

జాతీయ వికాసాభ్యుదయాలకు ఉత్తమ ఆశయం హృదయంలో కలగడమే మొదటి లక్షణం. ఈ ఆశయం లేకపోతే వ్యక్తి వ్యక్తిగా రూపొందలేడు. జాతులు ముందుకు పోలేవు. వ్యక్తిగాని, జాతికాని తనలో దాగిఉన్న సామర్థ్యాలను తానే తెలుసుకుని, అభ్యుదయ పథంలో నడవాలె. దీనికోసం ఇతరులపై ఆధారపడటం నిజానికి దాస్యమే! భారత భాగ్యవిధాతలు స్వజాతీయులు కాక విజాతీయులని ఇఖ్బాల్ వాపోయాడు. జాతి స్పందించడం లేదనీ, తన ఆత్మ

14. చూ. అనుబంధం - 10

గౌరవాన్ని కోల్పోతున్నదనీ ఇఖ్బాల్ బాధపడ్డాడు. ఒక సామ్రాజ్యానికి బానిసలు కావడమే పెద్ద దుఃఖం మీదు మిక్కిలి పరస్పరావగాహన ఐక్యత లేకపోవడం, స్వమత పక్షపాతం భారతీయుల దాస్యానికి మూలకారణాలు. మనం జాతీయ గౌరవాన్ని సంపాదించుకోవాలె ఇతరుల సహాయాన్ని అపేక్షించకుండా మన వాళ్ళ కష్టాల్లో పాలు పంచుకోవాలె. అప్పుడే జాతీయ రుగ్మతలనుంచి విముక్తుల మవుతాము. అప్పుడే జాతి సుప్తమైన అదృష్టం మేలుకుంటుంది.[15]

"రోగ పీడిత జాతులు ప్రేమవల్ల ఆరోగ్యాన్ని పొందినవి. జాగృత జాతులే తమ సుప్తమైన అదృష్టాన్ని మేలుకొలిపినవి. ప్రేమలో దాగిఉంది స్వాతంత్ర్యం అని నీవు తెలుసుకోగలిగితే వ్యత్యాసాలవల్ల వైమనస్యాలవల్ల దాస్య శృంఖలాలు బిగుసుకుంటాయని కూడా తెలుసుకోగలుగుతావు. పూల కొమ్మమీద గూడు కట్టుకుందామా? అయ్యో! ఈ తోటలో నిరభిమానంగా ఎలా ఉండేది?"

మన సమైక్య భావ స్పందనమే విశ్వమానవ సౌభ్రాత్వానికి పునాది కాగలుగుతుందని ఇఖ్బాల్ విశ్వాసం. ఈ ప్రేమనే ఆయన ప్రపంచ విజేత అంటాడు. కుల మత వర్గకలహాలూ, కక్షలూ జాతులను పొట్టను పెట్టుకొన్నవి. స్వదేశీయుల్లో దేశం బాగుపడాలన్న భావం కాస్తంతైనా లేకపోవడం ఆయనకెంతో క్లేశాన్ని కలిగించింది.[16]

"జాతులను భేదభావం నాశనం చేసింది నా దేశవాసుల హృదయాల్లో దేశ భక్తికూడా ఉంది. ప్రేమే గమ్యం, మార్గం, పథదర్శిని, దారిలో దోచుకునే దొంగ."

"ఖత్తైగానె ఖాహ్‌సే ఇఫ్తెహ్యార్" అన్న కవితలో ఆయన ఒక విషయం తెలుసుకోవాలిని ఉంది. "స్వర్గంలో కూడా భారతీయులు ఇలాంటి మత వైష

15. చూ. అనుబంధం - 11
16. చూ. అనుబంధము - 12

మ్యాలతో బాధపడుతున్నారా? అక్కడకూడా మతోన్మాదానికి గురి అవుతున్నారా? అక్కడ కూడా మానవులు తమ నైజాన్ని తెలుసుకోగలిగారా? మత, కుల, వర్గ ఉన్మాదంలో ఉన్నారా?" అని అడుగుతున్నాడు.

## జాతీయ దృక్పథంపట్ల విసుగుదల-ఏవగింపు

1905 నుంచి 1908 వరకు ఇఖ్బాల్ కవితారచనల రెండవ దశ. ఆయన ఐరోపాలో ఉన్నకాలం కూడా అదే. ఆయన జాతీయ భావాలలో చాలా మార్పు వచ్చింది. ఐరోపాలో ఉన్నప్పుడు ఆయనకు కలిగిన అనుభవాలే ఆ మార్పుకు కారణం. దేశభక్తి హద్దులుమీరి యుద్ధోన్మాదానికీ, దౌర్జన్యానికీ దారికల్పించిన వైనాన్ని ఆయన చాలా బాధతోనూ, భయంతోనూ ఐరోపాలో ఉన్నప్పుడు తెలుసుకోగలిగాడు. అప్పట్లో ప్రబలిన సంకుచిత జాతీయ భావానికి ఫలితంగా ఐరోపా ఖండంలో ఎన్నో స్వతంత్రమైన శక్తివంతమైన రాజ్యాలు పుట్టుకొచ్చినవి. అధికారం కోసం, ముఖ్యంగా విశాలమైన వలస దేశాలను ఆక్రమించుకోవాలనే కోరికతో ఈ జాతుల్లో పరస్పర స్నేహం రూపొందడం ప్రారంభించింది. చిన్నవీ, బలహీనమైనవీ అయిన జాతులను తమ అధీనంలోకి తెచ్చుకోవాలనే పైశాచిక భావంకూడా వాళ్ళను ఆవహించింది. ఇఖ్బాల్ ఐరోపా ఖండంలోని ఈ చారిత్రక పరిణామాలను చాలా సమంజసంగా విశ్లేషించగలిగాడు "మార్టిన్ లూథర్" ప్రారంభించిన ఉద్యమం తరువాత క్రైస్తవమతం ఐరోపా ఖండంలో జాతీయ సమైక్యతను సాధించే శక్తిని కోల్పోయిందని ఆయన అభిప్రాయపడ్డారు. శక్తిమంతమైన రాజ్యాలు విస్తరణకాంక్షతో ముందుకు సాగుతున్నా యన్నారు. సంకుచితమైన జాతీయ భావం వివిధ దేశాలమధ్య కలహాలకు కారణమైందనీ, ఇవి భవిష్యత్తుకు అపశకునము, అశుభ సూచకమనీ అన్నారు.

పాశ్చాత్య సంస్కృతి పతనోన్ముఖ దశలో ఉందని ఆయన భావించారు. రాజ్యవిస్తరణ కాంక్షకు ఫలితం సర్వనాశనమేనని ఆయన భావించారు. ఇంగ్లీషులో ఒక సూక్తి ఉంది.

**"Coming Events Cost their shadows"** (రానున్న సంఘటనలు తమ జాడలను ముందే కనపరుస్తాయి)

ఇఖ్బాల్ అప్పటి రాజకీయ వాతావరణాన్ని చక్కగా పరిశీలించి, ఐరోపా రాజకీయం ఆత్మహత్య చేసుకుంటుందని జోస్యం చెప్పారు.[17]

తుంహారీ తహ్‌జీబ్ అప్నే ఖంజర్‌సే ఆప్‌హీఖుద్ కషీ కర్లేగీ
జో షాఖెనాజుక్‌పె ఆషియానా బనేగా నాపాయ్‌దార్ హోగా

(మీ నాగరికత తన బాకుతోనే తనను చంపుకుంటుంది. లేతకొమ్మమీద కట్టుకున్న గూడు దృఢతరము కానేరదు.) ఆయన చెప్పిన ఈ జోస్యం నిజమైంది. ప్రథమ ప్రపంచ సంగ్రామ జ్వాలలు ఐరోపా ఖండాన్ని చుట్టుముట్టినవి. ఐరోపా నాగరికతను, రాజకీయ ఆర్థిక వ్యవస్థలను చిందరవందర చేసిపెట్టింది ఆ యుద్ధం.

కొంతకాలం తరువాత సుప్రసిద్ధ ఆధునిక ఇంగ్లీషు మహాకవి **W. S. Auden** కూడా ఈ శతాబ్దపు తొలిదశలో ఐరోపా పరిస్థితులు ఇంతకంటే భిన్నంగా లేవనే అన్నారు.

**In the nightmare of dark,**
**All the dogs of Europe bark**
**And the living nations wait,**
**Each Sequestered in its hate.**

(ఆ భయంకర నిశీధంలో
ఐరోపాలో కుక్కలన్నీ మొరుగుతున్నాయి
ఎలాగో బ్రతుకుతున్న జాతులు
ఎందుకో నిరీక్షిస్తున్నాయి
ప్రతిజాతి ఈర్ష్యా అసూయలను ఆశ్రయిస్తున్నది.)

ఇఖ్బాల్ రానున్న పరిస్థితులను తన జాగ్రన్నేత్రతో చూడగలిగేవాడని ఈ సందర్భంలో చెప్పడంలో తప్పేమీలేదు.

---

17. జపానీయులు దీనిని **Harakire** అంటారు.

"ముఝేరాజెదో ఆలమె దిల్‌కా ఆయినా దిఖాతాహై
వహీ కహతాహుం జోకుఛ్ సామ్నె ఆంఖోంకెఆతాహై
హాదెసా జోకె అభీ పర్దె ఇఫ్లాక్‌మె హై
అక్స్ఇస్కా మేరే ఆయినయే అద రాక్‌మె హై
ఆలమెనౌహై అభిపర్దయె తఖ్దీర్‌మేం
మేరినిగాహోంమేంహై ఇస్కీసహర్‌బేహిజాబ్"

"ఇహపరాల రహస్యాన్ని నా మనోదర్పణం నాకు చూపిస్తుంది. నా కనులకు కనిపించిందే నా నోట వెలువడుతుంది. ఎక్కడో శూన్యంలో పొంచివున్న ప్రమాదం నీడలు నా జ్ఞానదర్పణంలో కనిపిస్తున్నాయి. నూత్నప్రపంచం ఇంకా తెరమరుగుననే ఉంది. కాని నా దృష్టికి అది గోచరంగానే ఉంది."

## ఇస్లామీ దేశీయత:-

మొత్తానికి ఐరోపాఖండంలోని ఈ పరిస్థితులే ఇఖ్బాల్‌కు జాతీయ భావం పట్ల వైమనస్యాన్ని కలిగించినవి. ఉన్నతమైన నీతిబద్ధమైన ఒక అంతర్జాతీయమైన వ్యవస్థను అన్వేషించడం ప్రారంభించాడు. ఈ నూత్న సాంఘిక వ్యవస్థకు ఇస్లాం ఒక ఆకారాన్ని ఇవ్వగలుగుతుందని ఆయన ఆలోచించాడు. కాని ఇప్పటి ఈ పరిస్థితులు ఈ ఆశయంలో కూడా మోసం ఉన్నదని ఋజువుచేస్తున్నవి. ఆయన బ్రతికివుంటే ఇస్లాంమతం పునాదులపై మానవులంతా ఏకమౌతారన్న భావం నిన్న మొన్నటి నుంచి నిరంతరంగా కొనసాగుతున్న ఈరాన్, ఇరాక్ యుద్ధంతో తుత్తునియలైపోయి ఉండేది. దేశభక్తి సమున్నతాశయాలకు అంకితం కాకపోతే అతి బలహీనజాతులను దోచుకునేందుకు పీలుకల్పిస్తుంది. డాక్టర్ జాన్సన్ అందుకే అన్నాడేమో! "క్షుద్రుడు చివరకు దేశభక్తిని ఆసరాగా తీసుకుంటాడు." దేశం పట్ల ప్రేమతోపాటు ఆయన తన మతంపట్ల ప్రేమను హృదయంలో పెంపొందించుకున్నాడు. ఇస్లాం పట్ల ప్రేమనూ, ఇస్లాం జీవిత దృక్పథంపట్ల ప్రగాఢ విశ్వాసాన్ని, ఇస్లామీ అధికార పరిరక్షణభావాన్నీ, ఇస్లామీదేశాలపట్ల గౌరవాన్నీ ఆయన నమ్మిన ఇస్లాంమతమే ఆయినను ప్రేరేపించింది. ఈ దేశీయతా భావాన్నే

మనం ఇస్లామీ దేశీయత[18] అనవచ్చు. ఈ సమున్నత దృక్పథమే ఇఖ్బాల్‌తో అని పించింది 'మిల్లీతరాన' అన్నకవితలో-

I చీనా అరబ్ హమారా హిందూస్తాఁ హమారా
ముస్లింహైఁ హం వతన్‌హై సారాజహాఁ హమారా.

II బాజుతేరా తౌహీద్ కి ఖువ్వత్ సే ఖవీహై-
ఇస్లాం తేరా దేస్ హై-తూముస్తఫ్వీహై

III ఖైరా న కర్ సకా ముఝె జల్వయెదానిషె ఫరంగ్
సుర్మా హై మేరీ ఆంఖ్‌కా ఖాకె మదీనా వ నజ్ఫ్.

IV ఆఃషిరబ్ దేస్‌హైమస్లింకా తూ మాదిహైతూ
నుఖ్తయె జాజిబ్, తాసుర్‌కీ షువాఁ కాహైతూ.

I (చైనా అరేబియా మనది. భారతదేశం మనది. మేము ముస్లిలం. మనది ఈ దేశం. ప్రపంచమంతా మనదే.)

II (నీ బలం ఏకేశ్వర వాదం. ఇస్లాం నీ దేశం. నీవు మహమ్మదీయుడవు )

III (తెల్లవాని తెలివితేటల మిరుమిట్లు నన్ను అంధుణ్ణి చేయలేకపోయినవి. మదీనా మృత్తిక నా కళ్లలో అంజనమై ఉన్నది కనుక.)

IV (నీవు ముస్లిం దేశానికి ఉనికివి. నీవు ఆకర్షణకూ, కాంతికిరణాలకూ కేంద్రానివి.)

ఇలాంటి కవితలను ఆధారం చేసుకుని ఇఖ్బాల్ కవిత్వం ఇస్లాం మతం చుట్టూ, తిరిగిందని కొందరు విమర్శకులు అభిప్రాయపడ్డారు. ఆయన దేశభక్తి

---

18. డాక్టర్ మజీద్ బేదార్ : ఇఖ్బాల్‌కా తసవ్వురె వత్నియత్ - (ఇఖ్బాల్ జాతీయతా దృక్పథం) - జబాన్‌ఒఆదబ్, జనవరి-మార్చ్ 84 పుట 93.

భావాన్ని ఇస్లాం మతం కప్పేసిందని కూడా అన్నారు. కాని ఎక్కడ కూడా ఇఖ్బాల్ ఇస్లాం పట్ల విశ్వాసాన్ని, ఇస్లాం ధర్మనిర్వహణను దేశభక్తికి అతీతంగా ఉంచలేదన్న అంశం గమనార్హం. "హై అగర్ ఖౌమియతెఇస్లాం పాబందెముఖాం-హింద్‌హీ బున్యాద్‌హై ఇస్కీ- నఫారస్ హై న షాం" "ఇస్లాం జాతీయతకు ఒక ప్రాంత నియతి అంటూ ఉంటే భారతదేశమే దానికి పునాది-ఈరాన్ కాని సిరియా కాని కాజాలవు." ఈ విషయంలో అతి వివాదాస్పదమైన ఒక విషయాన్ని ప్రస్తావించడం అవసరం. జాతీయతకూ, దేశీయతకూ మధ్య ఇఖ్బాల్‌కూ మౌలానా హుసేన్ అహమద్ మద్నీకి మధ్య జరిగిన చర్చ అది. 1938 జనవరి తొలి రోజుల్లో మౌలానా ఢిల్లీలో ఒక బహిరంగసభలో ఉపన్యసిస్తూ "ప్రస్తుత కాలంలో జాతుల నిర్మాణం దేశాలవల్ల జరుగుతుంది. మతాలవల్ల కాదు" అన్నారు. మౌలానా ఉపన్యాసాన్ని పత్రికలో చదివి ఇఖ్బాల్ కలం కదిలిందిలా:

"అజం హునుజ్ న దానద్ రమోజ్ దీఁవర్న-
జదేవ్‌బంద్ హుసేన్ అహమద్ ఈఁచబూఅల్ బజీస్త్"

(అరేబ్బియేతర దేశాలకే ఇంకా ఇస్లాం సంగతి తెలియదు. దేవ్‌బంద్ హుసేన్‌కు ఎలా తెలుస్తుంది?)

"సరోదబర్ సరెమింబర్‌కె 'మిల్లత్ అజ్‌వతన్' అస్త్-
చె బేఖబర్‌జె ముఖామెమహమ్మద్ ఉమర్ బీ స్త్"

(ధర్మ వేదికపై నిలిచి జాతి దేశంవల్లనే ఏర్పడుతుందన్నారు. మహమ్మదు స్థానము అరబ్బీ భాషకు ఆయనకు తెలియనట్లుంది.)

"బముస్తఫా బరసాఁఖవేష్ రాహె దీహమాఓస్త్-
అగర్ బె ఒనర్ సైదీ తమాంబోలహీ స్త్"

(కరుణాళువు అయిన ప్రవక్తను అర్థం చేసుకోండి ఆయననుంచే మతం. ఆయన్ను చేరుకోకపోతే అనర్థం తప్ప మరేమీ మిగలదు)

ఈ కవితలు వివిధ పత్రికల్లో ప్రచురితమైనవి. ఎంతో వివాదం చెల రేగింది. పత్రికల్లో వ్యాసాలు వచ్చాయి కరపత్రాలు వెలుపడ్డాయి. ఈ విషయంపై పత్రికల్లో చర్చలు ప్రారంభమయ్యాయి. మౌలానా మదనీ, ఇఖ్బాల్‌గారలకు విశ్వాసపాత్రుడైన ఒక మిత్రుడుండేవాడు. ఆయన ఈ అపోహను తొలగించ డానికి అవిశ్రాంతంగా కృషి చేశాడు. తనకు తానుగా ఏర్పరచుకొన్న సిద్ధాంతా నికి అనుగుణంగానే ఇఖ్బాల్ ఎప్పుడూ ప్రవర్తించేవాడు. "మేరీ జబానే కలంసే కిసీకా దిల్ న దుఖె" (నా కలం భాషతో ఎవ్వరి మనస్సుకూ బాధ కలగకూడదు) కాని ఈ కవితల్లో తీక్ష్ణమైన లోతైన ధ్వని ఉంది. చెప్పే తీరులో అసాధారణమైన ఎత్తిపొడుపు ఉంది ఈ పద్ధతి ఆయన కవిత్వంలో సాధారణంగా కనిపించదు వ్యక్తిగతమైన అధిక్షేపం ఈ ఒక్క సందర్భంలోనే ఆయన కలం నుంచి వెలు వడింది. మౌలానా మద్నివంటి ప్రసిద్ధ ధర్మవేత్త, ధర్మ ప్రచారకుడు, ప్రఖ్యాత నాయకుడు భౌగోళికమైన జాతీయతను సమర్థిస్తున్నారని ఇఖ్బాల్ ఆక్షేపం. ఇలాంటి జాతీయత భౌతిక వాదాన్ని, పాశ్చాత్యుల ఆలోచనా పద్ధతినీ తెలియ జేస్తున్నది. మొత్తానికి తాల్యూత్‌గారి ప్రయత్నాల ఫలితంగా చివరకు మద్నిగారు ఈ విధంగా తన భావాన్ని స్పష్టపరచారు. ఆయన అన్న వాక్యం ఒక సంఘ టనకు సంబంధించిందే కాని, సలహా కాదు.

"ప్రస్తుత కాలంలో జాతులు దేశాలవల్ల ఏర్పడతాయి. ఇది ఈ కాలంలో ప్రచలితమౌతున్న దృక్పథాల సంగతి. మనస్తత్వాల సంగతి. మీరు ఇలా చేయ వలసి ఉంటుందన్న సంగతి చెప్పటం కాదు. నా అభిప్రాయం కూడా అదికాదు."

మార్చి 28, 1938 లో ఇఖ్బాల్ లాహోర్ నుంచి వెలువడే 'అహసాస్' అని దిన పత్రికలో ఒక వ్యాసాన్ని ప్రచురించాడు. మౌలానాగారి ఉపన్యాసాన్ని ఉటంకిస్తూ ఇట్లన్నారు:

"భారతదేశంలోని ముస్లింలకు నూతన జాతీయతాదృక్పథాన్ని అవలం బించమని తాము చెప్పలేదని" మౌలానా స్పష్టం చేశారు. కనుక వారిని ఆక్షేపించే హక్కు నాకేమాత్రం లేదని ప్రకటించవలసిన అవసరం ఉందని అనుకుంటున్నాను.

మానవుని ఆధ్యాత్మిక వ్యక్తిత్వం వికసించేదారిలో ఆటంకం ఏర్పడుతుంది.

"హవస్ నే కర్దియాహై టుక్ డేటుక్ డే నోయ్ ఇన్సాఁకో.
అఖూత్ కాఐయాఁ హోజా, మొహబ్బత్ కీ జబాఁహోజా" (అతిలౌల్యం మానవజాతిని ముక్కలు ముక్కలు చేసింది. చెలిమినే పలుకు. ప్రేమనే పలుకు).

తన పుష్కలమైన భావ సంపదతో, సునిశితమైన మేధతో, వినాశకరమైన జాతీయతను విఫలంచేసే శక్తి ఇఖ్బాల్‌కు ఉంది. వివేకవంతమైన, నిర్మాణాత్మక మైన సిద్ధాంతాలను ఆయనెప్పుడూ అంగీకరించేవారు. వివిధ జాతుల మధ్య, వర్గాల మధ్య, స్నేహాన్ని గట్టిపరచాలని ఆయన ఆకాంక్ష".

ఈ సందర్భంగా ఇఖ్బాల్ సమకాలికులు మహాకవి రవీంద్రుడు కూడా పరిమితమైన జాతీయ దృక్పథానికి వ్యతిరేకులు అనే అంశం గమనించాలి "మానవేతిహాసానికి గమ్యం అంతర్జాతీయతా కాదు, జాతీయతా కాదు. భారతదేశం ఒకవైపు వైరుధ్యాలున్న సాంఘిక సూత్రాలను నిర్మించి మరోవైపు ఆధ్యాత్మికంగా ఏకేశ్వరత్వాన్ని ఒప్పుకొని తన పని తాను చేసుకుంటూ పోతున్నది. చాలా కఠోరంగా భారతదేశం జాతుల మధ్య విభేదాల గోడలుకట్టి, ఈ వర్గీకరణంతో ఉత్పన్నమవుతున్న న్యూనతాభావాన్ని సంరక్షించుకుంటూ ఘోరమైన పొరపాట్లు చేసింది. భారతదేశం తన పిల్లల మనస్సుకు పక్షపాతాన్ని అలవరచి వాళ్ళ జీవితాన్ని నరకం చేసింది. తాను నిర్మించుకున్న సాంఘిక బంధాల్లో ఇమిడిపోవాలనే ఇలా చేసింది.

శతాబ్దాల నుంచి ఇలాంటి ప్రయోగాలు జరుగుతున్నవి. పరిస్థితులతో సరిపెట్టుకుపోయే పద్ధతులు కొనసాగుతున్నవి రకరకాల అభిరుచులూ, అవసరాలూ ఉన్న అతిథులను సంతృప్తిపరచే ఆతిథేయుని కర్తవ్యం లాంటిది ఇది. దీనివల్ల అంతులేని పేచీలెన్నో పుట్టుకొచ్చినవి వాటిని పరిష్కరించుకోవడానికి కేవలం తెలివితేటలేకాదు, సానుభూతి, సర్వమానవ సౌభ్రాత్రంపట్ల నమ్మకం అవసరం. ఉపనిషత్తుల కాలంనుంచి నేటిదాకా ఆధ్యాత్మిక తత్వవేత్త వర్గం ఒకటి

ఈ ఉదారాశయం కోసమే కృషి చేస్తూ వస్తున్నది. మానవుల్లోని విభేదాలన్నీ జ్ఞాన చైతన్యంతో సమసిపోతాయని ఈ వర్గం నమ్మింది''.

## అంతర్జాతీయ జాతీయత:-

సర్వజాతుల మధ్య సమైక్య భావం, శాంతి సద్భావాలూ మానవతకూ ప్రాముఖ్యం ఉన్న అంతర్జాతీయ వ్యవస్థ ఇఖ్బాల్ కోరుకునేవాడు. ఆ వ్యవస్థలో ప్రేమకే, సమత్వానికే, ప్రాముఖ్యం ఉండాలనీ, అదే అంతర్జాతీయ జాతీయత అని అనడం ఆయన హృదయం. ఈ క్రింది కవితల్లో ఆయన ఈ భావాలనే ప్రకటించారు.

"కొత్తనగరాలను నిర్మిద్దాం. పాతనగరాలు నాకేమీనచ్చవు. భాగవతునికి తూర్పులేదు, పడమరలేదు. నా ఇల్లు ఢిల్లీకాదు. సఫాహాకాదు. సమర్‌ఖండ్‌కాదు. రావి, నైల్, పురాత్ నదుల్లో ఎంతకాలం ఉంటావు? నీ నావలు సముద్రంలో తిరుగాడవలసినవి కదా! రోంతో సిరియాతో సమర్‌ఖండ్‌తో సంబంధం లేనివాడు తూర్పు-పడమరల బంధాలు లేనివాడు. నీ వింకా దారిలోనే ఉన్నావు. ఉన్నచోటే పడి ఉండకు. ఈజిప్టుకు వెళ్ళు. ఈరాన్‌కు వెళ్ళు. సిరియాకు వెళ్ళు. హిందూదేశస్థునిగా ఖురాసాన్ దేశస్థునిగా అఫ్ఘాన్ దేశస్థునిగా తూరాన్ దేశస్థునిగా ఎంతకాలం కొనసాగుతావు? ఈ తీరాలను వదులు ఎగిరిపో! బంధాలను తెంచుకొని ఎగిరిపో!"

చరమదశలో ఇఖ్బాల్ దేశభక్తిభావం :- జాతీయతపట్ల నమ్మకాన్ని ఆయన వదులుకున్నా తన దేశంపట్ల ఆయనకున్న ప్రేమలో ఎప్పుడూ లోపం రాలేదు. చివరిరోజుల్లో ఆయన కవితల్లో ప్రగాఢ దేశభక్తి తళతళలాడుతూ కనిపిస్తుంది. ఆయన విశిష్టకావ్యం 'జావేద్‌నామా' ప్రసిద్ధకవి డాంటే రచనను పోలిఉంది. తొలిసారి అది 1932 లో పారసీభాషలో వెలువడింది. ఇందులో దేశభక్తి భావం చాలా అందంగా ప్రస్ఫుటమైంది

ఈ కావ్యంలో ఆయన తన పరమగురువు సూఫీకవి రోమితో[20] ఆకాశంలో సంచరిస్తాడు. అక్కడ స్వర్గంలో ఆయనకు ప్రపథమంగా విశ్వామిత్రుడు కలుస్తాడు. విశ్వామిత్రుడు మహర్షి. ఆయన్ను ఇఖ్బాల్ జహాఁదోస్త్ (విశ్వానికి మిత్రుడు) అని కీర్తిస్తాడు. (విశ్వామిత్ర శబ్దానికి ఉర్దూ అర్థం ఇది.) కనౌజ్ రాజ్యానికి విశ్వామిత్రుడు సేనాధిపతిగా ఉండేవాడట. కాని పరమసాధువు. తాత్త్వికుడు. విద్యాపోషకుడు. తన పాండిత్యం వల్ల ప్రఖ్యాతిరాలేదు విజ్ఞానం, జ్ఞానం, ధ్యానం, తపస్సువల్ల ఆయన రాజర్షిగా బ్రహ్మర్షిగా మన్నన పొందాడు ఆయన శ్రీరామునికి గురువు కూడా.[21] మరోకథనం ప్రకారం విశ్వామిత్రుడు ఒక ప్రసిద్ధ భారతీయ విద్వాంసుడు. క్షత్రియ వంశంలోపుట్టి గొప్పతపస్సుచేసి బ్రహ్మత్వాన్ని పొంది సప్తర్షులలో ఒకడైనాడు.

---

20. మౌలానా జలాలుద్దీన్ రోమి (604-672) ప్రసిద్ధ ఫారసీకవి. ఆయన మస్నవి విశ్వవిఖ్యాతిని పొందింది. మస్నవీనిగూర్చి - మస్నవీ మౌల్వీ మాన్వీ- హస్త్ ఖురాన్ దర్ జబానె పహల్వీ. (మౌలానారోమి మస్నవి ఫారసీలో వెలసిన కురాన్) ఇఖ్బాల్ రోమిని తన ఆధ్యాత్మికగురువుగా భావించేవాడు.

"హంఖూగరే మహసూస్హైఁ సాహెల్కే ఖరీదార్
ఎక్ బహరెపుల్ ఆషోబ్-పురాఇస్రార్ హైరోమి.
మైభీహుఁ ఇసీ ఖాఫిలాషౌఖ్ మె ఇఖ్బాల్
జిస్ ఖాఫిలేషౌఖ్కా సాలార్ హైరోమి."

(నేను తీరాన ఉన్నాను. ఆయన ఒక సాగరం ఒక రహస్యం.
ఆయన అభిమానుల బృందంలో ఉన్నాను. అభిమానులకు ఆయన సేనాని.
ఇఖ్బాల్ సమాధికూడా రోమీ సమాధిపక్కనే నిర్మించారు.)

21. A clasical dictonary of Hindu mythology- J. Dowson p. 364.

జగన్నాథ్ ఆజాద్ తన Iqbal: Mind and Art అన్న పుస్తకంలో 'జహాఁదోస్త్' పరమశివుడే అన్నాడు నా దృష్టిలో ఇఖ్బాల్ 'జహాఁదోస్త్' ('ఆరిఫ్ హిందీ,' 'పీర్ హిందీ') (భారతీయ పండితుడు, భారతీయ మహా పురుషుడు) గా విశ్వామిత్రుణ్ణి కీర్తించినప్పుడు అయన విశ్వానికి మిత్రుడే కాని శివుడు కాజాలడు. శివుడు భగవంతుడు. ఇఖ్బాల్ విశ్వామిత్రుని కేవలం పండితుడు అనలేదు. అతడు పాండిత్యానికే మూలం. ద్రష్ట

ఆరిఫ్ హిందీ (విశ్వామిత్రుని) తో ఇఖ్బాల్ సమావేశం ఈ కవితల్లో వర్ణితం.

"మంచోకొరాఁ దస్త్ బర్దోషె రఫీఖ్-పానెహాదం అంద్రాన్ గారె అమీఖ్"

(నేను అంధునివలె మీ భుజాలపై చేయివేసి లోతైనగుహలో కాలు మోపాను)

మాహ్రా అజ్ జుల్మతష్ దిల్ దాగ్‌దాగ్

అందర్ వఖుర్షీద్ ముహతాజ్ చిరాగ్.

(ఆ గుహ అంధకారబంధురం. ఆ గుహ తిమిరంముందు ఆ చంద్రుని కళంకం చిన్నదే. సూర్యుడు కూడా దీపం లేకుండా ఆ గుహలోకి పోలేడు)

వహం వౌషక్ బర్‌మన్ షబ్‌ఖూఁ రేఖ్తంద్

అఖల్ వ హౌషమ్‌రా బదార్‌అవు యఖ్తంద్.

(ఇక్కడ గుడ్డినమ్మకం అనుమానం నాపై దాడి చేసినవి స్వాహాద్వారం వద్ద నా జ్ఞానం నన్ను వెనుకకు లాగింది.)

రాహెర ఫితం రహజనాన్ అందర్‌మకీఁ

దిల్‌ఫీ అజ్‌లజ్జతె సదఖ్‌వయఖీన్

(నేను దారిలో నడుస్తున్నాను. దారి దోపిడీగాళ్ళు పొంచిఉన్నారు. నా మనస్సులో అప్పుడు పరమార్థం, ఆత్మవిశ్వాసం లేనేలేవు)

తాంగారాజల్వే హౌషిద్ బేహిజాబ్

సుబహ్‌రోషన్ బేతులూయె అఫ్తాబ్.

(హఠాత్తుగా నా కనులముందు కాంతులు తెరలు తొలగించుకున్నవి- సూర్యోదయం కాకుండానే ఉదయకాంతులు చిమ్మినట్టు.)

వాదియె హర్‌సంగె ఓ జినార్ బంద్
దేవ్‌సారాజ్ నఖ్లహాయ్ సర్ బులంద్.

(ఆ లోయలోని ప్రతి శిలకు యజ్ఞోపవీతం ఉంది ఎత్తైన వృక్షాలు నిలిచి ఉన్నవి).

అజ్ సరిష్తె ఆబ్‌వఖాక్ అస్త్ ఈఁ ముఖామ్
య ఖయాలమ్ నక్ష్‌బంద వ దర్‌ముఃఖామ్.

(ఈ ప్రదేశం పాంచభౌతికమైనదేనా? లేక స్వప్నావస్థలో నా భావమే ఇలా రూపుదాల్చిందా?)

దర్‌హవాయ్ ఓచూమె ఔఖ్‌సరూర్
సాయఅజ్‌తజ్జీల్ ఖాకష్ బనె నూర్

(ఈ ప్రదేశంలోని వాయువుల్లో మదిరవంటి మత్తుంది. ఇక్కడి మట్టిని స్పృశించి నీడకూడా వెలుతురైంది )

నేజమినిష్ రాన్‌పహరె లాజువర్ద్
నేకనారష్ అజ్‌షఫ్‌ఖహఘర్ద్‌నజర్ద్

(ఇక్కడి నేలపై నల్లని నింగిలేదు దీని తీరాల్లో హరిదరుణ క్షితిజంలేదు.)

నూర్‌దర్‌బందె జలామ్ అంజానబూద్
పూదెగర్దె సుబహోషామ్ అంజానబూద్

(అక్కడి వెలుతురు చీకటి చెరలో లేదు. అక్కడి ఉదయాస్తమయాల్లో నైల్యం లేనేలేదు.)

జేరెనఖ్లె ఆరిఫ్ హిందీ నస్రావు
దీదహబా అజ్ సుర్మా అష్‌రోషన్ పవాద్.

(చెట్టుకింద ఒక భారతీయ విద్వాంసుడు కూర్చొని ఉన్నాడు. ఆయన కన్నులు అంజనంతో మెరసిపోతున్నవి)

సోయెబర్ సుర్‌బస్తవ అర్మాన్ ఖదన్
గర్దెబమారె సుఫేదే హల్ఘజన్.

(అతని జడలు ముడివడి ఉన్నవి. అతని నగ్నశరీరానికి ఒక పాము చుట్టుకొని ఉంది)

అద్మె అజ్ అమ్‌వగిల్ బాలాతరే
ఆలమ్ అజ్ దీరె ఖయాలష్ పైకరే.

(అతడు మనిషేకాని పాంచ భౌతిక ప్రపంచానికి అతీతుడు. ఆ ప్రపంచ స్వరూపం అతని ఆలోచనలకే ఆకృతి.)

వఖ్త్ జారా గర్దిష్ అయామ్‌నే॥
కారె ఓబా చర్ఖె నీలిఫామ్‌నే.

(కాల పరిభ్రమణంతో అతనికి సంబంధం లేదు. నీలాకాశంతోనూ అతనికి అవసరం లేదు )

ఇక్కడ ఒక విషయం చెప్పవలసి ఉంది. విశ్వామిత్రుడు ఋషికాని బ్రాహ్మణేతరుడు. తపస్సువల్ల అంటే త్రికరణశుద్ధిగా పరిశ్రమించి ఆ పదవిని ఆయన సంపాదించారు. తపస్సులో ఆయన అప్పుడప్పుడు దేశకాలాలకు కూడా అతీతుడై పోయేవాడని ప్రతీతి. ఆయనకు నలువైపుల మంచుపొరలు పేరుకుపోయేవి దూరం నుంచి పాముల్లాగా కనిపించేవి

ఈ కవిత 'జహాఁ దోస్త్'లో, తాను ఒక దేవదూతతో కలసి మాటలాడి నట్టు ఆ దేవదూత ప్రాచ్యదిశ మేల్కొన్నదని తనతో చెప్పినట్టున్నది.

ఖర్వజూద్ వొ ఖర్‌అదం పేచీద అస్త్
మగ్రిఖ్ ఈఁ అస్రార్ కం దీదయ్ అస్త్.

(వాడు అస్తినాస్తి విచికిత్సలో ఇరుక్కున్నాడు. తూర్పు-పడమర భేదాలను అంతగా గుర్తించనేలేదు.)

కారెమా అఫ్లాకియాఁ జుజ్ దైద్‌నీస్త్
జానం అజ్ ఫర్దాయ్ ఓ నౌమీద్ నీస్త్.

(కాని స్వర్గంలో ఉన్న మేము కేవలం చూడగలమే కాని మరేమీ చేయలేము. భవిష్యత్తు మాకు నిరాశావహంగా లేదు )

దోషె దేదం బర్ఫ్‌రాజె ఖష్మరూద్
న అస్మాఁ అఫ్రష్తయ్ ఆమద్ ఫరోద్.

(నిన్న నేను కష్మరూద్ (చంద్రమండలంలోని ఊహా పర్వతం) శిఖరం మీద ఒక దేవదూతను ఆకాశం నుంచి దిగుతుండగా చూశాను.)

అజ్ నిగాహెష్ జోఖె దీదారె చకైద్
ఆజ్ ఖస్వే ఖాక్దానెమానదీద్.

(అతని చూపుల్లో దిదృక్ష స్పష్టంగా ఉంది. మృణ్మయమైన పృథ్వి పైపే అతడు నడుస్తున్నాడు.)

గుఫ్తమష్ అజ్ మహర్ మారాజె మపూష్
తోచబీని అందర్ ఆఁ ఖాకె ఖమూష్

(రహస్య మెరిగినవాళ్లతో దాచడం దేనికి అన్నాను. చెప్పు ఈ నీరవ మృణ్మయ ఖండంలో నీకేం కనిపిస్తున్నది )

అజ్ జమాలె జోహరాబర్గా ఖ్తి
దిల్ బచాహె బాబ్లె అందా ఖ్తి

(నీవు జోహరా నక్షత్ర సౌందర్యానికి లొంగిపోయావా? లేక బాబల్ మాయానగరాన్ని పొందాలని మనసు పారేసుకున్నావా? (జోహరా- ఇస్లాం మతం ప్రకారంగా మూడవ ఆకాశంలోని అతి సుందరమైన నక్షత్రం. బాబల్- ఇరాక్ దేశంలోని ఒక ప్రాచీన నగరం. మాయలకూ, గారడీలకు ప్రసిద్ధి.)

గుఫ్తె హంగామె తులూ ఖావర్ అస్త్
అఫ్తాబె తాజా ఔరాదరబద్ అస్త్.

(ఇది తూర్పు మేల్కొనే సమయం. ఒక కొత్త సూర్యుడు దాని ఒడిలో ఉన్నాడని ఆయన అన్నాడు.)

లాల్హా అజ్ సంగెరహ అయద్‌బరూ౦
యూసుఫానె ఓజ్‌చ ఆయద్‌బరూ౦.

(అతడు నడిచే దారిలోని శిలల-నుంచి మణులు పుట్టుకొస్తాయి. యూసుఫ్‌లు ఎందరో పుట్టుకొస్తారు. యూసుఫ్ - ఇస్లామీ ఐతిహ్యంలో యూసఫ్ అనే రూపసి ప్రసక్తి ఉంది.)

రస్తఖైజే దిర్‌కీనారష్ దీదయ్ అదం
లర్జ అందర్ కోహ్‌సార్‌ష్ దీదఅయ్.

(నేను ఆ దేశం కౌగిలిలో ఒక ప్రళయాన్ని, అక్కడి పర్వత పంక్తుల్లో సంచలనాన్ని చూశాను.)

రఖ్తెబందో అజ్ ముఖామె అజరీ
నాఫూద్‌ఖూగర్ నతర్కె బుత్‌గరీ.

(అతడు శిల్పాలశాల (తూర్పు)ను త్యజిస్తున్నాడు. శిల్పాలు చెక్కే అల వాటు మానివేయాలని.)

అయ్‌ఖుష్ ఆంఖౌ మెకె జాన్‌వా తపైద్
అజ్‌గులె ఖుద్‌ఖువేష్ రాబాజ్ ఆఫ్రీద్.

(చైతన్యం ఉన్న జాతి ధన్యం- తన మట్టినుంచి తిరిగి జన్మించాలన్న స్పృహ ఉన్న జాతి ధన్యం.)

అర్షియా౦ రాసులహె ఈదా౦సా అతే
చూ౦షోఁతెబేదార్ చష్మెమిత్తె.

(ఒక జాతి సోమరితనాన్ని వదిలి కండ్లు తెరచిన షుడియ స్వర్గంలో ఉండే వాళ్ళకు పర్వదినం.)

ఈ మాటల్లో ఇఖ్బాల్ తన దేశాన్ని స్వతంత్రదేశంగా చూడాలన్న ఆకాంక్షను చాలా సున్నితంగా ప్రకటించాడు.

ఈ కవితలో ఆయన భారతాత్మ సుందర రూపాన్ని చిత్రించాడు. కాని భారతీయ హృదయం అనుభవిస్తున్న ప్రగాఢ దుఃఖం ఆయనను ఎంతో సతమత పరచింది.

బాదినేఁ ఖూబీ నస్‌బీష్ తోఖ్‌వబంద్
ఐర్‌లబ్‌ఁ నాలెహాయ్ దరద్‌మంద్.

(ఇన్ని గుణాలున్నా ఆ జాతి అదృష్టంలో దాస్య శృంఖలాలే ఉన్నవి. పెదవులపై ఆర్తనాదాలే ఉన్నవి.)

భారతాత్మ ఫాలంమీద భగవత్కళాకాంతు లున్నవి. ఉడిగిపోని సౌందర్యం ఉండి కూడా భరత జాతికి దాస్యశృంఖలాలు పెదవులపై శోకగీతాలు. భారతీయులు అనుభవిస్తున్న కష్టాలకు ఇఖ్బాల్ హృదయం తల్లడిల్లినట్టు స్పష్టంగా కనిపిస్తున్నది. తన దేశ ప్రజలకు దేశగౌరవంపట్ల ఆసక్తి లేదని ఆయనెంతో కుమిలిపోయాడు.

షమెజాఁ అఫ్సర్దయ్‌దర్ ఫానూసె హింద్
హిందియాఁ బేగాన అజ్‌నామోసె హింద్.

(భారత దేశం అనే గాజు బుడ్డిలో ప్రాణదీపం బిక్కుబిక్కుమంటున్నది భారతీయులు తమ దేశగౌరవంపట్ల తూష్ణీంభావం వహిస్తున్నారు.)

మర్దకె నామహరిం అజ్ అస్రారె ఖువీష్
జఖ్మయ్ ఖుద్ కం జింద్ ఐర్తార్ ఖువీష్.

(తన జీవిత రహస్యాన్ని మనిషి తెలుసుకోలేడు. మనిషి తన వీణాతంత్రిని తానే ఎప్పుడు మ్రోగిస్తాడో)

ఖర్ జమానె ర క్తమి బందొానజర్
అజ్ తిషే అఫ్సర్ద మీసోజద్ జిగర్.

(అతని చూపులు గతానికే అతుక్కుపోయినవి. అతనిలో అణగారిన అగ్ని వల్ల నా మనస్సు పొగులుతున్నది.)

బంద్హా ఖర్ దస్తొపాయె మన్ అజ్ వ స్త్
నాలయ్ హాయ్ నార్సెమన్అ అజ్ వ స్త్.

(నా కాళ్లకూ చేతులకూ బంధాలు ఇందుకే. నా ఆర్త గీతాలు కూడ ఇందుకే)

ఖవేష్తన్ రా అజ్ ఖూది పర్దాఖ
అజ్ రుసూమెకొహనా జిన్దాం సాఖ్త.

(తానంటే ఎవరో తనకే తెలియదు. పైగా పాత పద్ధతులనే పట్టుకు పాకులాడుతున్నాడు.)

అద్మియత్ అజ్ వజోదష్ దర్ద్ మంద్
అ స్రెనౌఅజ్ పాక్వానా పాకష్న జంద్.

(మానవాళి అంతా అతనికోసం శోకిస్తున్నది. కాలం కూడా అతని మంచి చెడ్డలకు శోకిస్తున్నది.)

కె షబ్ హిందూస్తాం ఆయద్ బరోజ్
మర్ద్ జాఫర్ వొజిన్దాహనూజ్.

(భారతదేశ ప్రదోషం ప్రభాతంగా ఎలా మారుతుంది? జాఫరైతే మరణించాడు. కాని అతని ఆత్మ ఇంకా బ్రతికే ఉంది. బెంగాలులో రాజ్యవిస్తరణకు బ్రిటిషువారికి తోడ్పడిన దేశద్రోహి జాఫర్.)

తాజ్ ఖెద్రై ఎక్ బదన్ వామీరహద్
ఆషియాం అందర్ తనె దీగర్ నహద్.

(అది ఒక శరీరం చెర నుంచి విముక్తమౌతుంది. మరో శరీరాన్ని ఆశ్రయిస్తుంది.)

గాహ్ ఆవురా బా కలీసా సాజ్ బాజ్
గష్ పేషె దేరియాఁ అందర్ నయాజ్.

(ఒకప్పుడు చర్చితో చర్చిస్తుంది. ఒకప్పుడు దేశీయులకు మోకరిలుతుంది)

దీనెవో ఆయిన్ వొసౌదాగరి అస్త్
అంత్రీ అందర్ లిబా సె హైదరీ అస్త్

(అతనికి మతం వ్యాపారం. మహాత్మునిగా చెలామణి అవుతున్న వేషగాడు)

తో జహానెరంగ్ వ బూ గర్దిఓ దిగర్
రస్మె వొ ఆయిన్‌వొ గర్ద్ ఒదిగర్

(ప్రపంచం రంగు మారినప్పుడు, వాసన మారినప్పుడు అతని పద్ధతులు కూడా మారిపోతాయి.)

జాఫర్ అందర్ హర్ బదన్ మిల్లత్ కుష్ అస్త్
ఈఁ ముసల్మానెకొహన్ మిల్లతో కుష్ అస్త్

(జాఫర్ ఏ రూపంలో ఉన్నా జాతి హంతకుడైన అతడు నిన్నటి ముస్లిమే)

ఖంద్ ఖందాఁ అస్త్‌వొబాకస్ యార్ నీస్త్
మార్ అగర్ ఖందాఁ షోద్‌జుజ్ మార్ నీస్త్

(పైకి నవ్వుతాడు. కాని అతడు ఎవ్వరికీ మిత్రుడుకాడు. పాము నవ్వినా అది పామే).

అజ్ వఫారిష్ వహదతే ఖౌమెదోనీం
మిల్లతే ఓ అజ్‌వజూద్ ఓలియం

(అతని భేదభావంతో జాతి సమైక్యత ముక్కచెక్కలైంది. అతని జాతి అతని ఉనికివల్ల దురదృష్టాన్ని తెచ్చుకుంది.)

మిల్లతే రాహెర్ కుజాగారత్‌గరే అస్త్
అస్లెవొ అ అజ్ సాదిఖె యా జాఫరేఅస్త్

(జాతి ద్రోహుల వంశావళితో జాఫర్ సాదిక్‌ల బాంధవ్యం తప్పకుండా ఉంటుంది.)

అలామన్ అజ్ రూహె జాఫర్ అలామాఁ
అలామాన్ అజ్ జాఫరానె ఈఁజమాఁ

(ఆ జాఫర్ నుంచి దేవుడు వునలను రక్షించాలె. ఈ కాలంనాటి జాఫర్‌ల నుంచి కూడా రక్షించాలె.)

తన జాతికి ద్రోహం చెయ్యడం అతిఘోరమైన పాపమని ఇఖ్బాల్ విశ్వాసం. ఈ పాపం చేసిన వాళ్లకు శనిగ్రహంలోని నరకంలో అట్టడుగున ఉన్న అతి నింద్యమైన స్థలమే తగినస్థలమని, తన 'జావేద్ నామా' కావ్యంలో ఉద్ఘోషించాడు. భారతాత్మ సంగతి ఇది. ఆధునిక భారతేతిహాసంలో ఇద్దరు ద్రోహులు అంటే వంగదేశంలో మీర్ జాఫర్, దక్షిణా పథంలో మీర్ సాదిక్ - వీరిద్దరినీ ఇఖ్బాల్ గర్హిస్తున్నాడు. సిరాజుద్దౌలాకు వంగదేశంలో ద్రోహంతలపెట్టి క్లైవ్‌తో చేతులు కలిపాడు మీర్ జాఫర్. దక్షిణా పథంలో విశ్వాసఘాతుకుడై సాదిక్ టిప్పుసుల్తాన్‌ను మోసం చేశాడు. మీర్ జాఫర్, మీర్ సాదిక్ మానవాళికే కాదు, దేశానికే సిగ్గుచేటు. ఇదేమాట ఫారసీలో ఇఖ్బాల్—

"జాఫర్ అజ్ బెంగాల్ సాదిక్ అజ్ దకన్
నంగె ఆదం, నంగె దీన్‌నంగె వతన్" అన్నాడు.

ఈ దేశద్రోహులను నిరసిస్తూ ఇఖ్బాల్ పలికిన పలుకులకంటె కఠినమైన పలుకులు లేవేమో! ఇఖ్బాల్ కావ్యంలో టిప్పుసుల్తాన్ కావేరినదిని ఉద్దేశించి అన్న మాటల్లో ఆయన దేశప్రేమ పొంగులు వారింది. ఉర్దూ, ఫారసీ కవులలో ఏ కవి కూడా కావేరీ నదిపైన కవిత చెప్పలేదన్న సంగతి ఇక్కడ ప్రస్తావించక తప్పదు.*

---

* - చూ. అనుబంధము 14

1. "ఓ కావేరీ! కొంచెం మెల్లగా ప్రవహించు. పారుతూ పారుతూ నీవు అలసి పోయావు.''

2. "నీవు కొండల్లోనే ఎప్పుడూ ఉంటావు. నీ కనురెప్పలతో నీదారిని నీవే నిర్మించుకున్నావు."

3. "నీవు నాకు ఓ ఫరాత్ (మధ్యఆసియాలో ప్రవహించే నది) కంటె నాకు ఇష్టురాలవు. మరి నీ నీరు దక్షిణాపథానికి అమృతమే!"

4. "అమ్మా! నీ తీరాన వెలిసిన ఆ నగరమిప్పుడెక్కడుంది? మత్తెక్కించే నీ సౌందర్య కాంతులవల్ల, నీ స్వాదుజలాలవల్ల మహిమను సంతరించుకున్న ఆనగరమేది?"

5. "నీవు పాతబడిపోయావు. కాని నీ యౌవనం అలాగే ఉంది. నీ శిలాసాలు నీ జలాలు అన్నీ అలాగే ఉన్నాయి.''

6. "నీ తరంగాలు మౌక్తిక బీజాలనే తప్ప ఇంకేమీ ఉత్పత్తి చేయలేదు. నీ కురులను ఇంకా విరియబోస్తూనే ఉన్నావు".

7. "కావేరీ! నీ [illegible] ఎవరి సందేశమో నీకు [illegible]

8. [illegible] ఆ [illegible] ప్రదక్షిణాలు చేస్తున్నా [illegible]

[illegible]

13. "జీవితం విప్లవం రెండూ కలసి నడుస్తాయి. ఎందుకంటే, అవి ఒక ప్రపంచాన్ని అన్వేషిస్తున్నవి".

14. "ప్రతి వస్తువు ఉనికి జననమరణాలకు అర్థంచెబుతుంది. పైగా వాంఛ్న ఆకాంక్ష కూడా శూన్యం నుంచే కలుగుతుంది".

15. "దారులు కూడా బాటసారుల్లా ప్రయాణం చేస్తున్నాయి. అజ్ఞాత ప్రయాణాలు సాగుతున్నప్పుడే అవి నిలిచినట్టు కనిపిస్తాయి".

16. "సార్థవాహులూ, వాహనాలూ, ఎడారులూ, ఒయాసిస్సులూ అన్నీ ప్రయాణ బాధను అనుభవిస్తున్నవి".

17. "పువ్వు తోటలో ఒక్క క్షణానికే అతిథి. దాని వర్ణవాసనల పరీక్షలు కూడా ఒక్క క్షణానికే".

18. "వసంతంలో శోకం కూడా ఉంది. గీతం కూడా ఉంది. పాశీయం ఉంది. మొగ్గలు కూడా దాని ఒడిలో ఉన్నవి. కుసుమశవం కూడా వసంతం భుజాలపైనే ఉంది".

19. "లాలా కుసుమంతో నేనన్నాను 'మరింత జ్వలించు' అని. అది అన్నది. 'నా రహస్యం నీకింకా తెలియదు' అని. (లాలా-ఒక ఎర్రని పువ్వు)"

20. "పుల్లాపృథకతతోనే ఉనికికి రూపం ఏర్పడుతుంది. జీవితానికి కోరికకంటే మరో శిక్ష ఏది?"

21. "మిత్ర తాథవస్థారి దారిలో అడుగిడుతున్నావు. వద్దు. శూన్యంలోనుంచి [illegible] వా? వద్దు".

22. [illegible]

23. [illegible]

24. [illegible]

25. [illegible]

26. "విలయం తథ్యంకనుక నేను భగవంతునితో దీర్ఘాయుష్షును కావాలని వరమడుగలేదు".

27. "జీవిత విధానం అంటే, మతం అంటే ఏమి? నూరేళ్ల గొర్రెలా బ్రతకడం కంటే పులిలా ఒక్క క్షణం బ్రతకడం మంచిది".

28. "జీవితాన్ని నడిపేవి స్వీకారభావం, స్వాతంత్ర్య భావం. మరి మరణం అదొక మాయాజాలం".

29. "సత్యం పులి, మరణం జింక, మనిషి చేసే వందలాది మజిలీలలో మృత్యువు కూడా ఒకటి".

30. "గద్ద పావురాన్ని పట్టుకున్నట్టే పూర్ణపురుషుడు మృత్యువు వైపు నడుస్తాడు."

31. "బానిస ప్రతిక్షణం మృత్యుభయంతో చచ్చిపోతూ ఉంటాడు. మృత్యు భయం వాడి బ్రతుకును విఫలం చేస్తుంది."

32. "స్వతంత్రుని వైభవమే వైభవం. మృత్యువు అతనికి కొత్త జీవితాన్ని ప్రసాదిస్తుంది."

33. "వాడు తనను గురించి ఆలోచిస్తాడు. మృత్యువు గురించి కాదు. స్వేచ్ఛా ప్రియులకు మృత్యువు ఒక క్షణం పాటిదే."

34. "నిన్ను సమాధిలోకి తీసుకుపోయే మృత్యువును దాటేసుకునిపో. ఆ మరణం పశువులకూ, మృగాలకే."

అమరవీరుడు టిప్పు సుల్తాన్ రాజధాని శ్రీరంగపట్టణం పరేడు మైదానంలో కావేరి తీరాన 1797 లో 15 మే నాడు ఫ్రెంచి విప్లవపు ప్రకటన వినిపించబడింది. ఇది అద్భుతమైన విషయం. ఉత్సాహభరితమైన విషయం. అప్పుడందరూ దేశ స్వాతంత్ర్యం కోసం ప్రాణాలను అర్పిస్తామని ప్రమాణాలు చేశారు. అందరూ ముక్త కంఠంతో "మేము దేశాన్ని విడిపిస్తాము లేదా మా ప్రాణాలనే అర్పిస్తామన్నారు". ఫ్రెంచి విప్లవాంకురం భారత భూమిలో పెరిగి ఫలించలేదు కాని దాని లక్షణాలు స్వాతంత్ర్యం, ఏకత్వం, సమత్వం, మన సుదీర్ఘ స్వాతంత్ర్యోద్యమ పథాలలో కాంతులు విరజిమ్ముతూనే వచ్చినవి.

జూన్ 1985 లో మన ప్రియతమ యువప్రధానామాత్యులు శ్రీ రాజీవ్ గాంధీ ఫ్రాన్సు దేశ యాత్రా సందర్భంగా తమకు ఫ్రెంచ్ ప్రధాని లారియస్ ఫాబియస్ ఇచ్చిన విందులో ఈ ప్రసిద్ధమైన, చారిత్రక సంఘటనను పేర్కొన్నారు. స్వదేశీయులు ద్రోహం చేసి ఉండకపోతే ఫ్రాన్సులో వచ్చిన మహా విప్లవం ఈ దేశంలో కూడా 250 ఏళ్లకు పూర్వమే వచ్చి ఉండేది. ఇక్బాల్ "పస్ చెబాయద్ కర్దాయె అఖ్వామె షర్ఖ్" అనే తన దీర్ఘ కావ్యం (అది ఆయన నిర్యాణానికి రెండేండ్ల పూర్వం 1936 లో ముద్రించబడింది) లో "అష్కె-చంద్ బర్ ఎఫ్తెరాక్ హిందియాం" అన్న శీర్షికలో ఉన్న కవితలో ఇలా అన్నారు.*

1. "ఓ హిమాలయమా! (భారత దేశమా) ఓ భారతీయ ముస్లింలారా! ఓ గంగానదీమతల్లీ! (హిందువులు) మీరెంతకాలం ఈ విధంగా కళాకాంతులు లేకుండా బ్రతుకుల నీడుస్తారు?"
2. "పెద్దలలో, వృద్ధులలో వివేకం, భవిష్యద్దర్శనం లేదు. యువకులకు ప్రేమంటే ఏమిటో తెలియదు."
3. "తూర్పు పడమరలు స్వతంత్రములు. మరి మనము ఇతరులకు దాసులం. మన సంపదను ఇతరులు అనుభవిస్తున్నారు".
4. "ఇతరుల కోరికలకు అనుగుణంగా బ్రతకడం దుస్వప్నమేకాదు, శాశ్వత మరణం కూడా".
5. "ఇది విధిప్రేరితమైన మృత్యువు కాదు, ఈ మృత్యుబీజం ప్రాణాల లోతుల్లోంచి పుట్టుకొస్తుంది".
6. "ఈ శవానికి స్నానం అనావశ్యకం. ఈ చాపుకు మిత్రులుకాని బంధువులుకాని రారు."
7. "ఈ చావువల్ల ఎవరికీ దుఃఖంలేదు. బానిసల నరకం సుదూర ఆకాశంలో ఉండదు. ఈ లోకమే వాళ్లకు నరకమవుతుంది."

---

* మూలమును చూడుము అనుబంధము 15.

8. "ప్రళయకాలంలో ఈ జాతిసను వెదకటంవల్ల లాభంలేదు. వీడికి ప్రతి రోజూ ప్రళయమే."

9. "ఇక్కడ విత్తునాటినవాడే పంటలు కోసుకుంటాడు. ఇలాంటి దాసుణ్ణి భగవంతుని ముందుకు తీసుకుపోవలసిన అవసరం ఏముంది?"

10. "ఏ జాతికి స్వాతంత్ర్య స్ఫూర్తి ఉండదో, కాలం ఆ జాతి నామరూపాలను పుడమి పుటల్లోంచి తుడిచేస్తుంది."

11. "సింహాసనాలనూ, కిరీటాలనూ నమ్మటం మోసం. కోమలమైన గాజు కూడా రాయికంటె కఠినంగా కనిపిస్తుంది. ఇదికూడా గారడీయే."

12. "తేటతెల్లంగా ఉన్న ఇంద్రజాలప్రభావంవల్ల అధర్మంలో అధర్మం లేకుండా పోయింది. ధర్మంలో ధర్మం లేకుండా పోయింది."

13. "హిందూముస్లింలు ఇరువురూ తమ లక్షణాలకు అతీతులయ్యారు."

14. "భారతీయులు పరస్పరం కలహించుకుంటూ వైరుధ్యాల సమాధుల్లోని పీనుగులను పైకి లాగుతున్నారు. పశ్చిమదేశాల శ్వేతజాతి ధర్మాధర్మాల వివాదాన్ని పరిష్కరించే దాకా వచ్చిందిపరిస్థితి. భారతదేశవాసులు నిజమైన స్వాతంత్ర్యానికీ, సామ్రాజ్యవాదులు ఇచ్చిన తమలోతాము కలహించుకునే నేతిబీరకాయ స్వాతంత్ర్యానికి మధ్యఉన్న భేదాన్ని తెలుసుకునే తారతమ్యజ్ఞానాన్ని కోల్పోయారు విప్లవమా! ఓ విప్లవమా!"

మతకలహాలన్నింటికీ విప్లవంకంటే మరో పరిష్కార మార్గంలేదని ఇఖ్బాల్ భావం. అది రాజకీయ విప్లవం కావాలని, మేధావుల స్థాయిలో రావాలని ఆయన హృదయం.

ఆయన ఉరుదూ కవితల చివరి సంకలనం 'జర్బెకలీం'లో రెండు కవితలున్నాయి. 'గిలా' (ఫిర్యాదు), 'షువాబె ఉమ్మీద్' (ఆశాకిరణం)లో దేశప్రేమతో ఆయన హృదయం స్పందించినట్టు కనిపిస్తుంది. అంతర్జాతీయ స్థాయిలో భారతదేశం తన మహోన్నతభూమికను నిర్వహించాలని ఇఖ్బాల్ ఆకాంక్ష. కానీ స్వాతంత్ర్యం లేనిదే ఇది సాధ్యంకాదు. ఆయన తన కవిత 'గిలా'లో "భార

దేశం అదృష్టం ఇంతవరకు ఎవరికి తెలిసింది? పాపం! ఏ కిరీటంలో ప్రకాశిస్తున్న వజ్రమో! రైతునుచూస్తే వాడు ఒక గోరీనుంచి పైకిలేచిన పీనుగులా ఉన్నాడు. వాని శవాలంకరణం విశీర్ణమై ఇంకా నేలలో అట్టడుగునపడివుంది. ప్రాణం ఇతరులకు కుదువపెట్టిందే. శరీరంకూడా ఇతరులకు కుదువపెట్టిందే. అయ్యో! ఇల్లు మిగులలేదు. ఇంటివాడు మిగలలేదు. నీవు ఐరోపా దాస్యానికి ఒప్పుకున్నావు. ఐరోపాతో నాకేమి? నీతోనే నా ఫిర్యాదు.''

రెండవ కవిత 'షువాయెఉమ్మీద్'. ఇందులో ముఖ్యమైన వస్తువు భారత దేశమే! భౌగోళికంగా భారతదేశం అవిభాజ్యమని ఇఖ్బాల్ అప్పట్లో అనుకునేవాడు. ఇదేవిధంగా జీవితానికి సంబంధించిన కొన్ని మౌలికమైన విలువలుకూడా.*

1. ("సూర్యుడు తన కిరణాలకు ఈ సందేశాన్ని ఇచ్చాడు. ప్రపంచం ఒక విచిత్రమైన వస్తువు. ఒకప్పుడు ఉదయం, మరొకప్పుడు అస్తమయం. చాలాకాలం నుంచి నీవు పిచ్చిగా తిరుగాడుతున్నావు. కాలం ఇలాగే గడిచిపోతుంది")

2. క్షితిజంలో, ప్రతి కోణంలో, ఉబుకుతున్నవి కిరణాలు. వీడిపోయిన సూర్యుణ్ణి హత్తుకుంటున్నాయి. పడమరలో వెలుగు లేదు. అంతా హోరు. తెల్లవాని యంత్రాల పొగతో నల్లబడినవాడు. తూర్పులో మహోజ్జ్వదృశ్యాని కేమీ లోటులేదు. మమ్మల్ని నీ వెలుగుగుండెల్లో దాచుకో. కాంతి మంతుడవైన ఓ సూర్యుడా! మమ్మల్ని కావనకు.)

3. (అప్సరసమాపుల్లాంటి ఒక తీక్ష్ణకిరణం పాదరసం కాంతిని మించుతున్నది. కూర్పులోని ప్రతికణం భాస్వంతం కానంతవరకు తనకు వీడ్కోలు ఇవ్వవద్దన్నది. పీడకలనుంచి సశక్తులైన పురుషులు తేరుకొని మేల్కొనేంత వరకు నేను భారతతిమిరశిరాలను వదలను. తూర్పు ఆకాంక్షలకు ఈ గడ్డ కేంద్రం. ఇక్బాల్ అశ్రువులతో ఈభూమి పంటలు పండిస్తుంది. ఈ

---

* చూడు-అనుబంధము 16.

భూమివల్లే చంద్రుడు, నక్షత్రాలు మెరుస్తున్నాయి. దేవాలయ ద్వారంపై బ్రాహ్మణుడు నిద్రిస్తాడు. మసీదు గూడుక్రింద తన దురదృష్టానికి దుఃఖిస్తాడు ముస్లిం. తూర్పుతో విసుగెత్తకు. పడమరను తప్పు పట్టకు. కాలం సూచిస్తున్నది ప్రతిరాత్రిని ఉదయం చేసుకొమ్మని.) ఎక్బాల్ దేశభక్తికి ఇంతకంటె చక్కని తార్కాణం ఇంకా ఏం కావాలి? నిజానికి తన చరమ దశలో ఆయనకు భారతదేశంపట్ల ఆసక్తి మరీ ఎక్కువగా ఉండేది. ఆయన చివరి కవితా సంకలనం 'అర్మగానె హజ్జాజ్'లోకూడా దేశ ప్రేమ, దేశం స్వతంత్రమైతే చూద్దామన్న కోరిక ఆ కవితలో కనిపిస్తుంది. అందులోని ఈ కవిత.*

(భారతీయదాసులకు చిమ్మచీకట్లేకాని ఉదయాలు లేవు. ఈ భరతభూమి సూర్యుడు రాడేమి!) ఇది ఇఖ్బాల్ హృదయంలో చెలరేగుతున్న అశాంతికి అద్దం పడుతున్నది. తన మరణానికి ఐదువారాలకుముందే మార్చి 1, 1938 లో ఇఖ్బాల్ మౌలానా హుసేన్ మద్నీతో జాతీయతా సమస్యనుగూర్చి చర్చిస్తున్న సందర్భంలో తనను భారతీయునిగా ప్రకటించుకుని జాతీయతను గూర్చి తన భావాలను ఇలా తెలియజేశాడు:

(వేల లక్షల సంవత్సరాలనుంచి జాతులకు దేశాలతో, మరి దేశాలకు జాతులతో సంబంధం ఉండేది. మనమంతా భారతీయులుగానే గుర్తింపబడుతున్న ఈ ప్రపంచ భాగంలో మనమంతా నివసిస్తున్నాము. ఇదేవిధంగా చైనీయులు, అరబ్బులు, జపానీయులు, ఈరానీయులు అందరూ తమతమ దేశాల వల్లనే గుర్తింపబడుతున్నారు. మాతృభూమి భావం కేవలం భౌగోళిక పరిభాష. ఇది ఇస్లాముకు విరుద్ధమైందికాదు. వివరించి చెప్పాలంటే, ప్రతివ్యక్తి సహజంగానే తన మాతృభూమిని ప్రేమిస్తాడు. జన్మభూమికోసం తన యావచ్ఛక్తినీ ధారపోయడానికి సంసిద్ధుడౌతాడు.)

---

* చూ. అనుబంధం - 17

# భారతీయ తత్త్వశాస్త్ర ప్రభావం

## భారతీయ తత్త్వం-ఇరాన్‌లో ఆధిభౌతికసిద్ధాంత వికాసం

ఇఖ్బాల్ భారతీయ సాహిత్యంలో లోవిశిష్ట వ్యక్తిత్వం ఉన్న కవి. ఆయన కేవలం ఒక మహాకవే కాదు, ఒక మహాతాత్త్వికుడు కూడా. పాశ్చాత్య తత్త్వశాస్త్రజ్ఞుల రచనలను ఆయన తాత్త్వికునిగా అధ్యయనం చేశాడు. అదే విధంగా ముస్లిం తాత్త్వికుల భావాలనుకూడా జీర్ణం చేసుకున్నాడు, విశేషం ఏమిటంటే ఆయన భారతదేశంలోని భక్తుల, తాత్త్వికుల భావాలతో ఎక్కువగా ప్రభావితుడైనవాడు. "అబ్దుల్ కరీం అల్జేలీ"గారి "న్జ్రియయ్ తోహీద్ ముత్లఖ్" (ఏకేశ్వర తత్త్వ దృక్పథం) అన్న గ్రంథంలో ఇట్లా అన్నాడు: "మేము తాత్త్విక చైతన్యంలో హిందూమత ఆధిక్యాన్ని ఒప్పుకుంటాము.... ఇస్లాం ఆవిర్భావం తరువాత అరబ్బుల చరిత్ర విజయ పరంపరల వైభవంతో ప్రకాశించింది. ఇస్లాం మతం వీళ్ళను ఒక విశిష్ట జీవిత విధానాన్ని అవలంబించేటట్టు చేసింది. తత్త్వ శాస్త్రం, మరితర విద్యా విషయకమైన క్షేత్రాలల్లో మౌన విజయాలను సాధించే అవకాశమే వీళ్ళకు లేకుండాపోయింది. ఆ కారణం చేతనే కపిలుడు శంకరాచార్యులవంటి మహావ్యక్తులు వీళ్ళల్లో పుట్టలేదు. ఇలాంటి మహావ్యక్తులను లోకానికి అందించలేకపోయారు."

అబ్దుల్ కరీం అల్జేలీ (జననం 1365-66 మధ్యకాలం, మరణం 1408-1417 మధ్యకాలం) బగ్దాద్‌వాసి హజ్రత్ షేక్ అబ్దుల్ ఖాదర్ జీలానీ కూతురు సంతానం ఈయన. అందుకోసం అల్జేలీ అయినారు. అల్జేలి భారతదేశంలోకూడా పర్యటించాడు. తన గురువుతో కొంతకాలం యమన్‌లో కూడా ఉన్నాడు. ఆయన వ్రాసిన 20 గ్రంథాలు ఇప్పటికీ ఉన్నవి. ఇంకో ఇరవై దొరక్కుండాపోయినవి.

అల్జేలీ ఆశయాలకు షేక్ అక్బర్ మొహియొద్దీన్ బిన్ అరబీ సందేశాలు ఆధారం. ఈ ఇద్దరి భావాలను మధ్య కొన్ని విభేదాలు కనిపిస్తాయి. దృక్పథాలతో

పై రుద్ధ్యం కారణంగా ఈ విభేదాలున్నాయని అల్జేలీ వ్రాసినాడు. ఈ దృక్పథంలో ప్రధానభావం ఏకేశ్వరవాదం, అంటే ఉన్నదంతా ఆ సత్య స్వరూపుని రూపమే. అతడు అనంత శక్తిమంతుడు. అయినా ఆ నిరుపమానుడూ, అవిభాజ్యుడు ఆత్మ నుంచి ఎన్నడూ విడిపోడు. అల్జేలీ ప్రపంచాన్ని మంచుతో పోల్చాడు. గుప్త సత్యంగా ఉన్న భగవంతుణ్ణి నీళ్లతో పోల్చాడు. ఏ నీరువల్ల మంచు రూపొందిందో ఆ మంచు తిరిగి నీరైపోతుంది. అందుకోసం సూఫీ దృష్టిలో సత్య స్వరూపుడైన భగవంతుని ప్రకాశాన్ని పొందడానికి ఎవని హృదయ కవాటాలు తెరచుకున్నాయో వాడే భక్తుడు.

ఈ వివరణలో అంతా భగవంతుడేనన్న భావం లేదు. భగవంతుడు ఈ విధంగా నీరు మంచురూపం దాల్చినట్టు ప్రపంచంగా రూపొందడు. అతని దర్శనం జ్ఞాన దర్శనం. ఏ ఉపమానంతోనూ ఈ అంశాన్ని వివరించడానికి వీలులేదు. అల్జేలి గ్రంథం 'అల్ ఇన్సానుల్ కామిల్' (పూర్ణపురుషుడు) ఇది మరాకష్‌నుంచి జావా వరకు ఆధ్యాత్మిక చింతనను ప్రభావితం చేసింది. పాశ్చాత్యుల అధిభౌతిక సిద్ధాంతం మొత్తం తత్త్వచింతనకు సరియైన రూపమని చెప్పవచ్చు. అల్జేలి ఈ పుస్తకంలో భగవత్సాక్షాత్కారం, జ్ఞానార్జనలో దశలు వివిధ మతాల రూపంలో భగవత్ స్వరూపం మానవుని ఆధ్యాత్మిక, మానసిక శక్తులు, సృష్టివికాస దశలు, మరణం తరువాత జీవితాన్ని గుర్తించిన చర్చలున్నవి. ఇఖ్బాల్ తత్త్వశాస్త్రవేత్త. అందుకోసమే ఆయన భారతీయ తత్త్వాన్ని కూడా విపులంగా అధ్యయనం చేశాడు. విశేషించి ఆయన ఈరాన్‌లో తత్త్వశాస్త్ర, అధిభౌతిక శాస్త్ర వికాసం అన్న విషయంపై సిద్ధాంతవ్యాసం రాస్తున్న సందర్భంలో భారతీయ తత్త్వశాస్త్ర సూక్ష్మాంశాలను పరిశీలించే అవకాశం దొరికింది. ఈ విషయం వేదాంతం, ఉపనిషత్తులు చక్కగా తెలియందే సమగ్రంగా బోధపడదు. ఈ అంశం ఆయన సిద్ధాంత వ్యాసాన్ని అధ్యయనంచేస్తే స్పష్టం అవుతుంది. ప్రసిద్ధ రోమన్ విద్వాంసుడు మానీతో చర్చిస్తూ ఇఖ్బాల్ ఇలా [illegible] తత్త్వవేత్త కపిలుడు సృష్టికి కారణాలైన మూడు గుణాల [illegible] ప్రతిపాదించాడు. [illegible]

సంబంధంతో ప్రకృతి ఆవిర్భవిస్తుంది. ఈ త్రిగుణాల పాళ్ళల్లో ఏ మాత్రం వ్యత్యాసం కలిగినా ప్రకృతిలో కలవరం బయలుదేరుతుంది". ఈ విషయాన్నే మరింత వివరిస్తూ ఇఖ్బాల్ ఎన్నివిధాలుగానో ప్రకృతి కనిపిస్తుంది. ఈ వైవిధ్య సమస్యకు పరిష్కారాలు అనేకం ఉన్నవి. వేదాంతులు 'మాయ' అనే రహస్యమయమైన ప్రతిపాదన చేసి దీన్ని పరిష్కరించగలిగారు. Leibnz అనే విద్వాంసుడు కొంతకాలం తరువాత "కనపడని దాన్ని గుర్తించటం" అన్న సిద్ధాంతంతో స్పష్టపరచాడు.

ఇంకా అబ్దుల్ కరీం అల్జేలి ప్రతిపాదించిన పరమాత్మశక్తి లేక కైవల్య తత్త్వం భగవంతుని నామగుణాలు అన్న అంశాలపై చర్చిస్తూ ఇఖ్బాల్ ఇలా అంటారు: "ఇప్పుడు గుణ స్వరూపాలను గూర్చి పరిశీలించవలసి ఉంది. అతి మనోజ్ఞమైన ఈ సమస్యపై ఈయన వెలిబుచ్చిన భావాలు చాలా ముఖ్యమైనవి. ఎందుకంటే మౌలికంగా హిందూతత్త్వం ఇక్కడే విడిపోయింది. ఆయన గుణాన్ని, వస్తువుల స్వరూపాన్ని తెలిపే సాధనమంటాడు. మరొకచోట ఆయన సత్వస్వరూపుడైన భగవంతుని గుణాలలోని ఆధిక్యత కేవలం మనకు కనిపించే వస్తువులకే పరిమితం. ఎందుకంటే, ఇక్కడ ప్రతిగుణం సత్యానికి ఇతరమై పోయింది. అది అవసరమే. ఈ వేర్పాటుతనం మనకు కనిపించే వస్తువుల వలయంలో ఉన్న కలయికవల్ల జరిగింది. కాని ఈ వ్యత్యాసం కనిపించని వస్తువుల విషయంలో నిజం కాదు. ఎందుకంటే ఇక్కడ కలయిక ఉండనే ఉండదు.

మాయా సిద్ధాంత వాదులతో ఆయన ఏకీభవించని అంశం గమనించ తగ్గది. భౌతిక ప్రపంచం ఉనికి యథార్థం అని ఆయన నమ్మకం. ఈ కని పిస్తున్నదంతా కేవలం బాహిరమైన ఆవరణమేనని, అది కూడా ఇంద్రియమించు యథార్థమైనదని ఆయన భావం. భౌతిక ప్రపంచాన్ని అర్థం చేసుకోవడానికి మానవుని బుద్ధి సృష్టించుకున్న యథార్థమే గుణాలతో ప్రకృతి కారణమని ఆయన అభిప్రాయం.

వేదాంతులు, మరికొందరు సూఫీలు ఈ ప్రపంచం ఒక స్వప్నం కాదనీ, చైతన్యావస్థలో కంటున్న స్వప్నమనీ అంటారు.

తూ చష్మెబస్తీవ గుఫ్తీకె ఈఁ జహాఁఖాఒబ్ అస్త్
కషాయె చష్మ్ కె ఈఁఖాబ్ ఖాబ్‌ఖాబ్‌బే దార్ అస్త్

(నీవు కళ్లు మూసుకున్నావు. ఇది స్వప్నమంటున్నావు. కళ్లు తెరువు. ఇది స్వప్నంలోనే చైతన్యం) ఇది నిజానికి హజరత్ అలీ తాత్త్వికాలోచనను సూచిస్తున్నది. హజరత్ అరబ్బీలో అన్న మాటల భావం "జనం స్వప్నావస్థలో ఉన్నారు. మరణించినప్పుడే మేల్కొంటారు." ప్రకృతికి ఏమీ కారణం లేదనీ, ఇది 'మాయ' అనీ. ఇది రాముని లీల నమ్ముతున్న ప్రకృతి సిద్ధాంతాన్ని ఆయన ఒప్పుకోలేదు.

తేరీ నిగాహ్ మె హై మోజజాత్‌కి దునియా
మెరీ నిగాహ్ మె హై హాదెసాత్‌కీ దునియా. —(జర్బెకలీం)

(నీ దృష్టిలో అద్భుత ప్రపంచం ఉంది. నా దృష్టిలో వాస్తవాల ప్రపంచం ఉంది). ఏకేశ్వరత్వాన్ని స్పష్టపరుస్తూ ఇఖ్బాల్ అంటాడు: *"ఆత్మతత్త్వం, ఏకేశ్వరత్వాన్ని పోలి ఉంది. కాని పేర్లు, గుణాలూ, ఒక దానికంటే ఒకటి విశిష్టంగానూ, కొన్ని సందర్భాల్లో పరస్పర విరుద్ధంగానూ ఉన్నవి. ఉదాహరణకు, భగవంతుడు దయామయుడే కాడు, పగ సాధించే వాడు కూడా. ఇది పరస్పర విరుద్ధమైన విషయం. ఈ అంశాన్నే ఆయన ఒక చోట స్పష్టం చేశాడు. ఇక్కడ ఆ స్పష్టీకరణకు ప్రాముఖ్యం ఉంది. నిజానికి వేదాంత తత్త్వం, బ్రహ్మ తత్త్వంతో సమానంగా కనిపిస్తుంది. సృష్టికర్త లేక వేదాంతంలోని ప్రజాపతి ఈ బ్రహ్మనికి మూడవ దశ. అక్కడే సగుణ బ్రహ్మనూ, నిర్గుణ బ్రహ్మనూ

*ఈరాన్ మె ఫల్సఫయ్ మా బదుతబయ్యాత్" పుట 125 (ఇరాన్ అధి భౌతిక సిద్ధాంత తత్త్వ వికాసం.)

ఒప్పుకున్నాడనిపిస్తుంది. శంకరుడూ, బాదరాయణుడూ[1] సృష్టిని గురించి చేసిన ఆలోచన కేవలం స్వతంత్రమైనది కాదు. స్వతంత్రమైన స్థితిలో అసత్తు దృశ్యమానమైనప్పుడు పరిమితమై ఉంటుంది. సత్తు (పదార్థం) ఈ సగుణ బ్రహ్మ విషయంలో ఆయన ఆలోచనకు రామానుజాచార్యుల[2] తాత్త్విక చింతనకు పోలిక ఉంది. ఆయన జీవాత్మ ఉన్నదన్న సత్యాన్ని ఒప్పుకుంటారు. అయితే శంకరుని ఆలోచనకు భిన్నం. భగవంతుడూ, భగవదారాధనా భగవద్దర్శనం తరువాత కూడా కొనసాగడం అవసరం.

అజ్లేలీ సిద్ధాంతాన్ని వ్యాఖ్యానిస్తూ ఇఖ్బాల్ పూర్ణతత్త్వం వైపు పయనిస్తూ మానవుని మూడు వికాస దశలను పేర్కొన్నాడు. మొదటి దశ జ్ఞానం. అజ్లేలీ జ్ఞానాన్ని గూర్చి ఇలా అన్నాడు: "భగవత్ప్రభావితుడైన వ్యక్తి భగవంతునిలో లీనమౌతాడు." ఇఖ్బాల్ ఈ మాటను వివరిస్తూ లీనమైపోవడం అన్నా మరణించడం అన్నా ఒక్కటే అని భ్రమించి తికమకపడకూడదంటాడు.

అజ్లేలీ "వ్యక్తి బ్రతికి ఉంటాడు. రాట్నంలాగా కదలుతూనే ఉంటాడు. కపిలుడు, ప్రకృతితో సమన్వయం పొందిన తరువాత వ్యక్తి కదలుతూనే ఉంటాడన్నాడు. ఆ స్థితికి చేరుకున్నప్పుడు వ్యక్తి 'మన్ తూ షుదం తౌ మన్ షుదీ''(ఇక మనల్ని ఎవరూ విడదీయలేరు) అని ముక్తకంఠంతో ప్రకటిస్తాడు." సూఫీ తత్త్వాన్ని గూర్చి కూడా తన ఉపన్యాసంలో ఇఖ్బాల్ ఇలా అన్నాడు: "కొందరు సూఫీలు (నక్ష్ బందియావంటి వాళ్ళు) భారతీయ వేదాంతుల రహస్యం

---

1. క్రీ. పూ. 500-200 మధ్యకాలంవాడు. బ్రహ్మ (వేదాంత, శారీరక) సూత్ర రచన చేశాడు. వేదాంత తత్త్వంపై ప్రముఖ గ్రంథం ఇది. శంకరాచార్యుడు దీనికి వ్యాఖ్య వ్రాశారు. బాదరాయణుడూ, మహాభారత వ్యాసుడూ ఒక్కరేనని ప్రతీతి.

2. క్రీ. శ. 1011-1137, శంకరాద్వైతాన్ని విమర్శించి, శ్రీ[illegible] అనే గ్రంథాన్ని రచించాడు.

వేచి స్థితిని పొందడానికి కొన్ని పద్ధతులు అవలంబించారు. లేదా అరువుగా[1] తీసు కున్నారు. "హిందువుల 'కుండలిని' తత్వాన్ని అనుసరించాలని వాళ్ళు బోధించారు. మానవ శరీరంలో వివిధ కాంతి కేంద్రాలున్నవన్నది కుండలిని తత్త్వం. ఆశక్తులను జ్ఞాన మార్గంలో సూఫీ ఉద్బుద్ధం చేసి భగవద్రహస్యాన్ని కనుగొనాలి."

ఈ విధంగా సూఫీల లయ తత్త్వం కూడా బౌద్ధుల నిర్వాణ తత్త్వంతో ప్రభావితమైందని ఇఖ్బాల్ భావించాడు. సూఫీ తత్త్వంపై బౌద్ధ తత్త్వ ప్రభావం ఉన్నదన్న సిద్ధాంతం తప్పు అనీ పరిశీలనవల్ల అది తేలిందని ప్రొఫెసర్ షమర్ అభిప్రాయం. కాని ఇప్పుడీ అభిప్రాయం రద్దయింది. బౌద్ధుల ప్రభావం తరువాతి కాలంలో విశేషంగా ఉన్నదని ఒప్పుకోవచ్చు. మధ్యాసియాలో ముస్లిం జాతులకు బౌద్ధులతో ప్రగాఢ సంబంధాలు ఏర్పడినప్పుడు ఇలా జరిగిందని అనుకోవడానికి వీలుంది. వేదాంత ప్రభావాన్ని గురించి ఒక ప్రశ్న తలెత్తవచ్చు. హజ్రత్ బాయజీద్ బస్తామి గురువు ఉస్తాద్ అబూ అలీ అల్సింధీ[2] అది భౌతిక సిద్ధాంతాన్ని ప్రతిపాదించినప్పుడు బిస్తామీ ఆలోచనలపై కూడా తన ప్రభావాన్ని వేసి ఉండవచ్చు.

---

1 Lassen ను అనుసరిస్తూ Weber "11వ శతాబ్దం తొలిదశలో అల్బేరూని పతంజలి యోగశాస్త్రాన్ని అరబ్బీలోకి అనువదించాడు. కాని అనువాదాలు సంస్కృత పాఠాలకు అనుగుణంగా లేవు. హిందూస్తానీ అరబీకీ తారీక్ పుట. 239.

2. అరబ్బీ భాష తెలియని ఒక సూఫీ. బాయజీద్ ఆయనకు నమాజుకు అవసరమైన కొన్ని ఆయాత్ (మంత్రాలవంటివి) నేర్పినందుకు బదులుగా బాయజీదుకు ఆయన 'వహదత్ షుహూద్'తో పరిచయం కలిగించాడు. బాయజీద్ ఆయనవల్ల భారతీయ భావాల ప్రభావాలకు లోనుకాలేదని అను కోవడానికి వీలులేదు.

బిస్తామి స్థితప్రజ్ఞుడు. క్రమం తప్పని తపశ్చర్యతో భగవంతుణ్ణి నిరాకరించే బంధాలను ఎదుర్కొనవచ్చుననీ, మోక్షాన్ని పొందవచ్చునని ఆయన సందేశం. ప్రపంచం, సన్యాసం, ఆరాధన, కర్మలు, తలపులు చివరకు అన్ని పరిస్థితులు భగవంతునితో తెగతెంపులు చేయించే ధోరణులేనని ఆయన సందేశం. పాము తన కుబుసాన్ని వదిలినట్లు- మనిషి తన నశ్వరత్వాన్ని వదిలితే ద్వంద్వాతీతుడౌతాడు. భక్తులు ఏ భావాలను ఏపగించుకుంటారో వాటికి అతీతుడౌతాడు. ఉదాహరణకు "నేను పవిత్రుణ్ణి, నా వైభవం ఎంత ఉన్నతం? నాకు నీ యాజ్ఞ కంటే నీకు నా ఆజ్ఞ శిరోధార్యం" వంటి భావాలు జ్ఞానాన్వేషణలో ఆయన ఎవరినీ లక్ష్యపెట్టలేదు. ఆయన ఈ ఆలోచనలే విమర్శలకు కారణమైనవి. ఆయన తనను ప్రవక్త అనుకుంటున్నాడని అన్నారు. ఆధ్యాత్మిక చింతన సందర్భంగా భగవంతుడు ఆయనను కరుణించాడు, ఆయనకు జ్ఞానాన్ని ప్రసాదించాడు. కాని ఆయన ప్రజలమధ్యకు రావడానికి అంగీకరించలేదు. శాశ్వతతత్వ బాహువులతో కైవల్యానికి చేరుకోవాలని ఆయన ఉద్యమించి స్వర్గాన్ని దర్శించాడు. ఈ దర్శనం వల్ల ఆయన కనిపించినదంతా మోసమని, ఇదంతా తానేననే సత్యాన్ని కనుగొన్నాడు." (దాయిరయ్ మారిఫ్ ఇస్లామియా సంపుటం 1. పుట. 933.)

సూఫీ తత్వానికి సంబంధించిన సాధారణమైన అభిప్రాయం ఒకటుంది. "వాటి అసలు కేంద్రం ఇంద్రియ నిగ్రహం. మనస్సుకూ ఆత్మకూ కలయిక- ఇదే సృష్టికి కారణం. భగవద్దర్శనానికి సాధనం."[1] ఇక్బాల్ చాలా అర్థవంతంగా ఇలా అన్నాడు: "వేదాంత పరిభాష ప్రకారం అతీంద్రియ జ్ఞానం వ్యక్తిదృష్టిలో తనకంటె భిన్నమైన వ్యక్తిత్వం కనపడదు. ఈ దర్శనం ద్వారా అతడు చూస్తున్నదంతా అతని హృదయంనుంచి జనించే యాథార్థ్యమే! సూఫీ తత్త్వంలో మరో అంశం మోక్షదృక్పథం. సామీ సిద్ధాంతం ప్రకారం "ముక్తి మనిషికి స్వేచ్ఛవల్లనే లభిస్తుంది. సర్వదుఃఖాలకూ కారణం ప్రపంచంలో మనం వ్యవహరించే పద్ధతిలోనే ఉందని భారతీయ వేదాంతులు బోధిం

1. తులానామే వల్స్ ఖైమాబుద్దు త్త ఇక్బాల్ కా ... [illegible]

చారు. మన ఆలోచనలను మార్చుకొమ్మని వారు బోధిస్తారు. జ్ఞానమే మానవ ప్రకృతి అని, కర్మకాదని స్పష్టం."[1]

ఇబ్నెసీనా, మరికొందరు సూఫీ తత్త్వవేత్తలు ఒప్పుకున్న శాశ్వతత్త్వం, యధార్థతత్త్వం హిందువుల నుంచి, బౌద్ధులనుంచి ఉద్భవించిందని ఎక్బాల్ తలపోత.

"ఈరాన్‌లోని బాకూలో ఉన్న బౌద్ధ విహారాలను సందర్శించడానికి హిందూ యాత్రికులు వెళ్లినప్పుడు ఈ దృక్పథానికి ప్రాచుర్యం కలిగి ఉండ వచ్చును."[2]

ఇఖ్బాల్ భారతీయ తత్త్వశాస్త్రాన్ని ఎంత గాఢంగా గంభీరంగా అధ్యయనం చేశాడో ఈ ఉద్ధరణలు తెలుపగలుగుతున్నవి. ఈ భారతీయ తత్త్వజ్ఞానం ఆయన వ్యక్తిత్వాన్నీ, ఆయన కార్యకలాపాలనూ, విరక్తజీవితాన్ని ఎంతో ప్రభావితం చేసింది. **Anna Marie Schimel** తన **Gabriels Wing** లో ఇలా అన్నారు: "తాత్త్వికునిగా భారతీయ ప్రాచీన సాహిత్యంతో పరిచయం కలిగి ఉండటం ఆయనకు అనివార్యం అయింది. విశేషించి ఆయన పలుమార్లు పేర్కొన్న ఉపనిషత్తుల గూర్చి **Max Muller** వ్రాసిన గ్రంథం **Vedanatha Philosophy** (వేదాంతతత్త్వం) ఆయన సొంత గ్రంథాలయంలో ఉండేది. ఆయన తన

1. ఇరాన్ మే మాబదుత్త బియ్యాత్‌కా ఇర్తెకా, పుట. 82, 83, [illegible]
2. బౌద్ధమత వికాసాన్ని గూర్చి Geiger [illegible] తూర్పు ఈరాన్‌లో బౌద్ధమతం చాలా [illegible] యులు [illegible] బౌద్ధ భిక్షువు [illegible] ఉండేవారు. [illegible] క్రీ.పూ. [illegible] బౌద్ధ [illegible] పుట. [illegible]

యౌవనంలో ఏకేశ్వర వాదానికి ఆకర్షితులయ్యారు. ఆయన వేదాంతంలో సమున్నతమైన జ్ఞానాన్ని ప్రశంసించారు. ఉపనిషత్ సూత్రాల తళుకులు ఆయన కవితల్లో కనిపిస్తాయని ఎవరైనా ఊహించవచ్చు. ఉదాహరణకు "ఎండిపోయిన బావిలో కప్ప"[1] ఆత్మతత్త్వం ఈయన ప్రతిపాదించిన వ్యక్తిత్వం ఈయన ప్రతిపాదించిన వ్యక్తిత్వాన్ని ఎంతో ప్రభావితం చేసింది. సమత్వసిద్ధాంతాన్ని ఆయన వ్యతిరేకించిన మాట నిజమే అయినా వ్యక్తితత్త్వాన్ని గురించి ఆయన భావాలను మనం కాదనలేము."

ఉపనిషత్తుల్లో ప్రతిపాదించబడిన స్వేచ్ఛ, ఆత్మనిత్యత్వం, భారతీయుల [illegible] ఇక్బాల్‌ను ఎంతో ప్రభావితుణ్ణి చేసినవి. మృత్యువును గురించికూడా ఇక్బాల్ ప్రకటించిన భావాలు భారతీయ దృక్పథంనుంచి పుట్టినవే. మానవాత్మ అనశ్వరమని ఆయన నమ్మకం.*

1. "మృత్యువంటే జీవనపునర్నవం. స్వప్న యవనికల్లో జాగృతి సందేశం."

2. "మృత్యువును అర్థం చేసుకోవటంలోనే జీవితమంతా కడచిపోతుంది. ఇదే జీవితసంధ్య. ఇదే శాశ్వత జీవనప్రభాతం."

3. "నిన్ను నీవు తెలుసుకుంటే, నిన్ను నీవే ఆవరించుకుంటే నిన్ను మృత్యువు కూడా చంపలేదేమో!"

---

1. దర్ గిలోదారి నవాహాఖాబ్ వౌనక్జ్
చండ్ అందర్ గుల్ బనాలి మిస్లెచౌగర్
"నీగళంలో సుమధురస్వరాలెన్నో ఉన్నవి. మురదలో కప్పలాగా ఎందాకా బెకబెకలాడుతుంటావు?"

* చూడు అనుబంధము - 17.

4. "స్వేచ్ఛా పురుషుని వైభవమే సరికొత్తది. మృత్యువు కూడా అతనికి నవ జీవితాన్ని అందించింది".

వేదాల ప్రభావం :- తాను కవితారచన ప్రారంభించినప్పుడు వేదాలలోని ఒక మంత్రాన్ని కూడా ఉర్దూ పద్యంగా ఇక్బాలు మలచినాడు. కాని అది ఏ కవితా సంకలనంలోనూ చేరకపోవడం విచారకరం. ఇక్బాల్ జీవిత చరిత్ర 'రోజ్‌గార్ ఫకీర్'లో లభిస్తుంది అది.

అధర్వణ వేదంలోని ఒక మంత్రం దీనికి ఆధారం.[1]

అభయం మిత్రాదభయమిత్రాద్
అభయం జ్ఞాతాదభయం పరోక్షాద్
అభయం నక్తమభయం దివానః
సర్వా ఆశా భం మిత్రం భవన్తు. (19, 15.6)

(మనకు మిత్రులతో కాని శత్రువులతో కాని భయం ఉండకూడదు. బంధువులకు కూడా భయపడకూడదు. ఒకరికి లొంగి ఉండకూడదు. మనకు దినంలో భయం ఉండకూడదు. రాత్రికూడా భయం ఉండకూడదు. అందరూ మిత్రులైతే ఎంత బాగుండేది).[2]

**ఉపనిషత్తుల ప్రభావం :- Anna Marie Sehimmel** ఇలా వ్రాస్తారు: "ఏకేశ్వరవాదం వైపు ఆకృష్టుడైన ఒక యువ తాత్త్వికుడు 1907 లో తన సిద్ధాంత వ్యాసాన్ని రచించడం సహజం.

"ఈ ఆలోచన (సూఫీతత్త్వం) సాగుతూ సాగుతూ అంచులు ముట్టింది. ఉపనిషత్తుల భాషలో "అహం బ్రహ్మాస్మి" దాకా పోయింది. ఇదే భావం "గుల్షనె రాజె జదీద్" (నూత్నరహస్యోద్యానం) అనే కవితలో ఉన్నది. అయితే వ్యతిరేక

1. మూలమునకు చూడు అనుబంధము - 18.
2. చూడు అనుబంధము - 18.

దృక్పథంతో ఉంది. ఇందులో మన్సూర్[1]నూ భారత దేశంలో శుద్ధ అద్వైత సిద్ధాంతాన్ని ప్రచారం చేసిన శంకరాచార్యులను ఒకే వరుసలో నిలబెట్టాడు.

(శంకరాచార్యుల భావాలను మన్సూర్ భావాలను అనుసరించి అంతగా మాట్లాడకండి.మీ వ్యక్తిత్వాన్నే సాధనంగా చేసుకుని పరమాత్మణ్ణి వెదకండి) [2]

ఇఖ్బాల్ కవితలోని విప్లవాత్మకమైన వ్యక్తిత్వ సిద్ధాంతాన్ని ఉదాహరిస్తూ ప్రొఫెసర్ **Sehimmel** ఈ అంశాన్ని ఇలా స్పష్టపరిచారు: "ఒక పూర్ణవలయం వ్యక్తిత్వ స్వరూపాన్ని ధరిస్తుంది. వివిధ ప్రపంచాలూ వివిధ వ్యక్తిత్వాలూ పుట్టుకొస్తాయి. అవి చిన్న చిన్న ప్రపంచాలను సృష్టించుకుంటాయి."

'ఇస్రారెఖూది', 'జబూర్ అజం' అనే కవితలో ఇఖ్బాల్ -

(ఈ జీవిత ప్రతిమ కూడా వ్యక్తిత్వ జీవిత లక్షణాలలోనిదే. నీకు కనిపించేదంతా వ్యక్తిత్వ రహస్యమే.)

పైకర్ హస్తిజ్ ఆసారె ఖుదీ అస్త్
హర్ చమిబీనిజ ఇస్రార్ ఖుదీ అస్త్

(వ్యక్తిత్వమే తనకంటే భిన్నమైన ప్రతిమని చెక్కుతుంది. జీవిత లక్ష్యంలో మాధుర్యం అతిశయించాలెకదా!)

సాజద్ ఆజ్ ఖుద్ పైకరె అగ్యార్ రా,
తాఫిజాయద్ లజ్జత్ పైకార్ రా.

(ఈ ప్రపంచ మంటే ఏమి? నా భావం ప్రతిమా మందిరమే. దీని కాంతి నా జాగృత నేత్రానికి వశీభూతమై యున్నది).

ఈఁ జహాచీస్త్ సనమ్ఖాన ఇస్రార్ పన్లిస్త్
జల్వ ఓ గర్వీదా చేదార్ మన్ అస్త్.
"హస్తివనీస్తి అజ్ దీదన్ పనాదీదన్ మన్
చజమానచ మకాన్ షూఖియె అఫ్కార్ మన్ అస్త్"

---

1. మన్సూర్ హిల్లాజ్ క్రీ.శ. 857-922. భగవద్వ్యక్తి ఉన్మత్త స్థితికి చేరుకున్న మాత్రి 'అనల్ హక్' (నేను దేవుణ్ణి) అన్నాడు. అందుకు అతణ్ణి కొరతవేసి చంపారు.
2. [illegible] - 20.

(అస్తి, నాస్తి అన్న నా ప్రకృతిని చూడటమో లేక చూడకపోవటమో ! ఈ కాలం, ఈ దేశం నా భావాలనీడలే)

ఇవేకాక 'బాలెజబ్రీల్' జబూర్ అజంలోని ఈ క్రింది కవితలను ఉదాహరిస్తూ Sheimmil ఇక్బాల్ కవితలకు పునాది ఉపనిషత్తుల ప్రభావమే అని స్పష్టీకరించారు.

(వ్యక్తిత్వం (అహం) అంటే ఏమి ? జీవిత రహస్యం వ్యక్తిత్వం (అహం) అంటే ఏమి ? సర్వసృష్టిజాగరణం)

ఖుదీ క్యాహై రాజెదరూనె హయాత్
ఖుదీ క్యాహై బేదారీకాయనాత్

(ప్రపంచం మన కాంతి తప్ప మరేమీకాదు. ఎందుకంటే, మనం లేకుంటే వెలుతురెక్కడిది? ధ్వని ఎక్కడిది ?) వ్యక్తిత్వం రహస్యాలను గురించి చెప్పిన ఈ కవిత కూడా పేర్కొనదగిందే.

జహాంగైర్ అజ్ తజల్లీహయెమానీస్త్
కెబేమా జల్వ్యెనూర్‌వసదానీస్త్

(రాత్రి వ్యక్తిత్వాని (అహాని)కి నిద్ర. మరి దినం దీనికి జాగృతి.)

షబ్‌జ ఖాబష్ రోజ్ అజ్ బేదారిష్
షోలయె ఖుద్‌దర్ షరర్‌తఖీసకర్ద్

(వ్యక్తిత్వం (అహం) తానే-తన జ్వాలలను మిణుగురులుగా వింగడించింది)

కౌషీతకి ఉపనిషత్తులో ఆత్మకున్న సంప్రదాయసిద్ధమైన నిర్వచనాన్ని ఈ కవిత జ్ఞప్తికి తెస్తున్నది.

యథాగ్నేర్జ్వలతః విస్ఫులింగాయా విప్రతిష్ఠేరన్నేవ మేవై[illegible]
ప్రాణాయథాయతనం విప్రతిష్ఠన్తే ప్రాణేభ్యో దేవా [illegible]

(కౌషీత[illegible] - 3.3)

1. The Twenty Eight upanishads, [illegible] by Swami Dwarika das Sasthry, Prachya [illegible]i Prakasam, Voranani P.No. 386. 1965.

(మండుతున్న అగ్నినుంచి మిణుగురులు వెడలి నలువైపులా వ్యాపించినట్లే అహం ఆత్మనుంచి జీవిత లక్షణాలు వెలువడుతాయి. ఆ లక్షణాలనుంచి అనుభూతులు వెలువడుతాయి. ఆ అనుభూతులనుంచే లోకాలు వెలువడుతాయి.)

ఇదే విధంగా ఇఖ్బాల్ పయాంమష్రిక్ (ప్రాక్సందేశం) అనే కవితలో మిణుగురుపురుగులను ఉదాహరించాడు.

"ఖుద్ అఫ్రోజమ్ చిరాగెరాహె ఖరీషమ్"
(నా దారి దీపాన్ని నేనే వెలిగించుకుంటాను)

భారతీయుల ఆత్మ తత్వానికి అతి దూరంగా ఇఖ్బాల్ వ్యక్తిత్వ (అహం) తత్త్వం లేదని స్పష్టమవుతున్నది. బృహదారణ్యకోపనిషత్తులోని భావానికి ఆయన భావాలు చాలా దగ్గరగా ఉన్నవి.

అస్తమిత ఆదిత్యే యాజ్ఞవల్క్యే చంద్రమస్యస్తమితే శాంతేఽగ్నౌ శాంతాయాం వాచి కింజ్యోతి దేవాయం పురుష ఇత్యాత్మై వాస్య జ్యోతిర్భవతీ
త్యాత్మనైవాయం జ్యోతిషాఽఽస్తే పల్యయతే కర్మకురుతే విపల్యేతీతి. 4-3.6.

(ఓ యాజ్ఞ్యవల్క్యుడా! సూర్యుడు అస్తమించాడు. చంద్రుడు కూడా అస్తమించాడు. అగ్ని ఆరిపోయింది. శబ్దాలు కూడా తోడు వీడిపోయినవి. ఎవరికైనా ఇప్పుడు వెలుగు ఎక్కడిది? ఆత్మనే నిజానికి అతనికి వెలుగు. అతడన్నాడు- నిజానికి ఆ మనిషి కూర్చునప్పుడు ఆత్మ వెలుగై కదులుతుంది. ఆ మనిషి పనిచేసి పెట్టి తిరిగి వస్తుంది).

మొత్తానికి Sheimnel భారతీయ తాత్త్వికులతో ఇఖ్బాల్ ఏ విధంగా ప్రభావితుడయ్యాడు, భారతీయ తత్త్వాన్ని తన రచనల్లో ఏ విధంగా ధ్వనింపజేశాడు అనే విషయాన్ని స్పష్టం చేశారు.

1. అపేత గ్రంథం పుట. 214

**బౌద్ధమతం** :- ఇఖ్బాల్ గౌతమబుద్ధుణ్ణి ప్రవక్తగా పరిగణించి అన్ని మతాల ప్రముఖులపట్ల భక్తిభావాన్ని ప్రకటించాడు. గౌతమబుద్ధుని సందేశం మానవత్వపు పునాదులపై ఆధారపడి ఉందని ఆయన అభిప్రాయం. మానవులకు సమవేదన సందేశాన్ని బౌద్ధమతం అందిస్తుంది. 'జావేద్ నామా' లో 'జిందారూద్' (ఇఖ్బాల్)కు తవాసిన్‌లోయలో గౌతమబుద్ధుని దర్శనం అవుతుంది. వైశాలీ నగరానికి చెందిన రాజనర్తకి ఆమ్రపాళికి బుద్ధుడు ఉపదేశాన్నిచ్చిన సంగతిని ఇక్కడ ప్రస్తావించాడు. *

1. (మక్కిన మదిర నిజంకాదు. యువప్రియుడు లేనేలేడు. నిజంగా కన్నులున్నవానికి స్వర్గంనుంచి దిగివచ్చిన అప్సరసకూడా ఏమీకాదు).

2. (ఎవరిని నీవు పాలితుడనీ, దాసుడనీ అనుకుంటున్నావో వాడూ పోతాడు. ఈ కొండలూ, ఈ ఎడారులా, ఈ మైదానాలూ, ఈ సముద్రాలూ, ఈ చెలియలికట్టలూ అన్నీ వట్టివే.)

3. (పాశ్చాత్యుల తెలివితేటలు ప్రాచ్యుల తత్త్వజ్ఞానం అన్నీ గుడిలోనే ఉన్నవి. ఆ గుడిలోని ప్రతిమలను పూజిస్తే వచ్చేదేమి?)

4. (నీవే ఆలోచించుకో. ఈ అడవిలో భయపడుతూ నడవకు. ఎందుకంటే- ఉనికి నీవే. ఈ రెండూ వట్టివి.)

5. (నా కనురెప్పలతో చెక్కిన దారిలో, గమ్యం పొందుల సంఘం వట్టివే.)

ఈ కవితల్లోని రెండవ భాగంలో గౌతమబుద్ధుని జీవన్మరణాలూ క్షమా శిక్షలూ, సత్ప్రవర్తన, సద్భావం, ఇఖ్బాల్ లేఖినినుండి అందంగా బయల్వెడలినవి.

6. (నీకు భగవంతుడు ప్రసాదించిన స్వర్గం తుచ్ఛమైనది. అయితే ఆ స్వర్గం నీ సత్కార్యాచరణ రూపంలో లభిస్తే అది వేరే విషయం.)

* [illegible] అనువాదం [illegible]

7. (నీకు ఆత్మశాంతి కావాలా? అయితే నీ తోటివారి దుఃఖంలో పాలుపంచుకో)

8. (మత్తిలిన కండ్లు, అపాంగ వీక్షణాలూ. మధురగీతం అన్నీ బాగున్నాయి కాని ఇంతకంటె మంచిది మరొకటి ఉన్నది.)

9. (బాహిరంగా కనిపించే అందం ఒకప్పుడుంటుంది. ఒకప్పుడుండదు. అంతస్సౌందర్యం, సత్ప్రవర్తనం, సత్సంకల్పమే సర్వస్వం.)

ఈ కవిత ఆమ్రపాళి ప్రియుని భావాలను తెలుపుతున్నది. అది ఇది:

"నల్లగా నిగనిగలాడుతూ వంకరలు తిరిగిన కురులు నావి. కాని ఈ వార్ధక్యంలో నారతోనో, తోలుతోనో చేసిన వస్త్రంలాగా మారిపోయినవి. సత్పురుషునిమాట ఎప్పుడూ అబద్ధంకాదు.

వనవాటికల్లో ప్రసరిస్తున్న కోకిలరవంలా ఉండేది నా ధ్వని. కాని వార్ధక్యంలో అది అణగారిపోయి బొంగురువోయింది. సత్పురుషునిమాట ఎప్పుడూ అబద్ధంకాదు.

ఒకప్పుడు మెరుస్తున్న సూర్యునిలా నా శరీరం ధగధగ లాడేది. కాని ఈ వార్ధక్యంలో శరీరంపై అన్నీ ముడుతలు పడ్డాయి. సత్పుషునిమాట ఎప్పుడూ అబద్ధంకాదు."

(మహమ్మద్ హాష్మి ఉర్దూ అనువాదానికి అనుసరణం)

గౌతమబుద్ధుని మాటలు విని నర్తకి మారిపోతుంది. సన్యసిస్తుంది.

10. (కలవరపడుతున్న ఈ హృదయానికి వెనుకముందాడే అవకాశాన్ని కల్పించకు. నీ కురుల్లో మరిన్ని చిక్కులు పడనీ.)

11. (నీ వల్ల నా హృదయంలో విద్యుత్కాంతులు వెలిగినవి. నేను చంద్రుణ్ణి, సూర్యుణ్ణికూడా ప్రతీక్షా సంక్లేశానికి గురిచేశాను.)

15. (ఫర్‌హాద్ కొండను తొలిచేయడంలో ఆశ్చర్యం ఏముంది? ఈ కొండల న్నిటినీ ప్రణయమే తన భుజాగ్రాలపై మోస్తున్నది.) (ఫర్‌హాద్-ప్రియు రాలిని వివాహమాడడానికి కొండను తొలచవలసి ఉంటుందనే షరతును పూర్తిచేసిన ఆదర్శప్రియుడు. మధ్య ఆసియాలో ఇతని ప్రణయకథ ఒక ఐతిహ్యం.)

## గాయత్రి :

ఇక్బాల్ జీవిత చరిత్ర రచించిన అబ్దుల్ మజీద్ సాలిక్ కథనం ప్రకారం ఇక్బాల్ సంస్కృతం చదువుకున్నాడు. అత్యాఫైజీకూడా ఈ అంశాన్ని బలపరి చాడు. ఇక్బాల్ తొలికవితల్లో 'గాయత్రి' అనే రచన ఒకటి. గాయత్రీ మంత్రం హిందువులకు చాలా పవిత్రమైనది.

"ఓం భూర్భువ స్వః తత్సవిత్రువరేణ్యం భర్గోదేవస్యధీమహి
ధీయోయోనః ప్రచోదయాత్"

(ఓ మహాజ్యోతీ! ఓ శక్తిమంతమైన సూర్యదేవతా! రా! నిన్ను మేము ఆరాధిస్తాముర ! నీ జ్యోతిని మాకుప్రసాదించు.)
అయ్‌నూర్ అజలీ-అయ్ రక్షంద ఆఫ్తాబ్! ఆ; హమ్ తేరీ ఇబాదత్ కరే!

ఉపనిషత్తులో ఈ ఉపోద్ఘాతంతో ఉన్న నా పద్యాలు బాగానే ఉన్నవి. అయినా పద్యాన్ని గాయత్రీ మంత్రం అనడానికి వీలులేదు.*

(ఓ సూర్యుడా! నీవే ప్రపంచానికి ఆత్మవు. అస్తిత్వం నీవే. అనస్తిత్వం నీవే. నీనుంచే సృష్టి వాటిక పచ్చగా ఉన్నది. పంచభూతాల వ్యాపారం నీవల్లే కొనసాగుతున్నది. ప్రతి వస్తువులో జీవం నీవల్లే ఉంది. ప్రతి వస్తువుకు నీ కాంతి అవసరం. ఆపాదమస్తకం నీవే జీవితానివి. నీవే మనస్సువు. నీవే ఆత్మవు. నీవే చైతన్యానివి. ఓ సూర్యుడా, మాకు జ్ఞానకాంతులను ప్రసాదించు. మా కన్నులను నీవే వెలుగులతో నింపు. ప్రతి జీవిలో నీవే. కొండల్లోని ఉదయం. ప్రతి వస్తువు జీవితానికి నీవే సంరక్షకుడవు. వెలుగులకంతా అధిపతి. నీకు ఆది లేదు. అంతం లేదు. నీకు బంధం లేదు. అద్యంతాలలో నీవే కాంతివి.)

## భగవద్గీత - కర్మతత్త్వం :

భగవద్గీత ప్రతిపాదించిన కర్మయోగ సిద్ధాంతం ఇఖ్బాల్‌ను ఎంతో ప్రేరేపించింది. భగవద్గీతలో ఆత్మను నిత్యం అన్నారు. జీవితధ్యేయమన్నారు. కర్మను రక్షణకూ, శిక్షణకూ అహితమైన ఉత్తమ జీవితధ్యేయమన్నారు. ఫలాన్ని ఆశించకుండా, కర్మను ఆచరించడమే భగవద్గీత ప్రధాన బోధ. ఈ కర్మఫల త్యాగం వల్లనే ఆత్మకు ఆనందం కలుగుతుంది. పరమాత్మ సాయుజ్యం కలుగుతుంది. తన కవిత 'అస్రారె ఖుది' (వ్యక్తిత్వ రహస్యం)కి ఉపోద్ఘాత వ్రాస్తూ ఇఖ్బాల్ గీతాబోధను ప్రేరేపించిన పరిస్థితిని కొంత తెలియజేశాడు. శ్రీకృష్ణుణ్ణి ఎల్లకాలం గౌరవంతో, ప్రేమతో లోకం స్మరిస్తుంది. ఈ మహా మానవుడు అతి మనోహరమైన పద్ధతిలో తన దేశీయ, జాతీయ, తాత్త్విక సంప్రదాయాలకు వ్యాఖ్యానం చేశాడు. కర్మఫలత్యాగమంటే కర్మాచరణాన్ని పూర్తిగా వదిలిపెట్టడంకాదని ఆయన నిరూపించాడు. ఎందుకంటే, కర్మ ప్రకృతి సహజం. అది జీవితానికి కొత్త చైతన్యాన్ని కలిగిస్తుంది. నిజానికి కర్మఫల త్యాగమంటే

కర్మవల్ల కలిగే ఫలితాంతో సంబంధాన్ని వదులుకోవడం. ఇఖ్బాల్ కర్మతత్త్వ సిద్ధాంతాన్ని మంచడంలో భగవద్గీతకు ప్రముఖపాత్ర ఉందని తెలుస్తున్నది. అయితే ఈ సిద్ధాంతానికి ఇస్లామీబోధలే మూలకారణాలు. కర్మ సందేశాన్ని గూర్చి ఆయనవి ప్రసిద్ధమైన కవితలు చాలా ఉన్నవి.

(కర్మవల్లనే జీవితం. కర్మవల్లనే స్వర్గం. కర్మవల్లనే నరకం. నీవు నిజంగా జీవమున్న వాడివైతే నీ జగత్తును నువ్వు సృష్టించుకో. నీవు మానవ శ్రేష్ఠుడవు గదా! ప్రగాఢ విశ్వాసం, నిరంతర పరిశ్రమ ప్రేమ ప్రపంచ విజయానికి కారణం అవుతాయి. ఎవడు నిష్కామకర్ముడో వాడు చేసుకున్న పుణ్యం వేరే. ప్రపంచంలోనే వర్ణాలతో, వాసనలతో తృప్తిపడకు. వనాలనేకం ఉన్నాయి. ఆశ్రయాలనేకం ఉన్నాయి. నీవు గరుడపక్షివి. ఉడ్డీనమే నీ పని. నీ ముందున్న ఆకాశాలు అనేకం. సచ్చరిత్రవల్ల అదృష్ట రహస్యాలు బయల్పడతాయి. ఇదే అదృష్టంలోని రహస్యం.[1]

**విశ్వామిత్రుడు:-** భారతీయ తత్త్వశాస్త్రాన్ని గురించి 'జావేద్‌నామా'లో ప్రసక్తి ఉంది. విశేషించి విశ్వామిత్రుడూ రూమీలమధ్య జరిగిన సంభాషణ ఉంది. ఈ సంభాషణలో హిందూ ముస్లిం తాత్త్విక, పారమార్థిక దృక్పథాల పరిజ్ఞానం ఉంది. జహాందోస్త్ (విశ్వామిత్రుడు) జిందారూద్ (ఇఖ్బాల్) విద్వత్తు స్థాయిని ఇలా ప్రశ్నిస్తాడు-[2]

1. ("జ్ఞానానికి మరణమేది?" నేనన్నాను. "ఆలోచన మానివేయడం." అతనడిగాడు-మనస్సు చావటమంటే ఏమిటి? నేనన్నాను. "కథనం మాని వేయటం."
2. శరీరం అంటే ఏమిటి? "ఇది మృణ్మయం".
"మరి ప్రాణం?" "ఇది భగవల్లీల" అన్నాను.)

3. ("ఎవడు మానవుడు?" "అది ఒక రహస్యం" అన్నాను.
మరి ప్రపంచమంటే? "అది ఇక్కడే మనముందే ఉంది".

4. ఈ విద్యలూ కళలు? "కేవలం పొరలు" అన్నాను.
దీనికి దృష్టాంతం "స్నేహదృష్టి" అన్నాను.)

5. "సామాన్యుల మతం ఏది?" "విన్నదాన్ని విశ్వసించడం" అన్నాను.
మరి జ్ఞానుల మతం? "పరిపూర్ణ విశ్వాసం" అన్నాను.

(నా సంభాషణవల్ల ఆయన ఆత్మకెంతో ప్రీతి కలిగింది. మనోజ్ఞమైన అంశాలెన్నో నాతో చెప్పాడు.) విశ్వామిత్రుడు ఇఖ్బాల్‌కు తొమ్మిది తాత్త్వికాంశాలను విశదపరచాడు. అవి ఇవి-

1. ("సత్యానికి ఈ లోకం అచ్ఛాదన కాదు. నీటిపైని గీత మునిగేవానికి అడ్డం కాదు)

2. (మరో ప్రపంచంలో జన్మించడం మంచిది. నూత్న యౌవనం లభిస్తుంది.)

3. (సత్యం మృత్యువుతో ఆవరించబడింది. అదే నిజమైన జీవితం. జీవికి మృత్యువు తరువాత ఈ ప్రపంచాన్ని గూర్చిన జ్ఞానం ఏమీ ఉండదు.)
(మనం రెక్కలు లేని పక్షులవంటి వాళ్లం. కాని మృత్యువు విషయంలో దేవునికంటే ముందుకే సాగిపోయినాము.

4. (కాలమంటే ఏమిటి? విషం కలిపిన తేనె. కరుణావిలమైనది కొంత. బాధా కలితమైనది కొంత)

10. (జీవిత కర్మాగార రహస్యం అతనికి బాగా తెలుసు. అతడు జంషీదు ప్రభువేమో! అతని కవితల్లో జంషీదు పాన పాత్రికలోవలె లోకమంతా కనిపిస్తుంది.) (జంషీదు ఒక ప్రసిద్ధ రాజన్యుడు. అతని వద్ద ఉన్న ఒక విశిష్ట మధు పాత్రికలో మధువు పోసి ఇచ్చ వచ్చిన దృశ్యం చూసుకోగలిగే వాడట. ఈరాన్‌లో ఐతిహ్యం)

11. (ముందే మేము అతని కవితాకళను గౌరవిస్తూ నిలిచి ఉన్నాము. తరువాత ఆతనితో సమావేశం. ఇక్కడ 'జిందారూద్') (ఇక్బాల్, భర్తృహరితో కావ్య హేతువును గూర్చి అడుగుతాడు.)

12. (మనోహరమైన అంశాలను నీవు కవితాబద్ధం చేశావు. నీవల్ల ప్రాచ్య ఖండం రహస్య వేదికగా రూపొందింది.)

13. (కవితలో శోకం ఎలా ప్రవేశిస్తుంది? మీ హృదయం నుంచా? లేక దైవం నుంచా?)

14. (కవి ఎక్కడుంటాడో ప్రపంచానికి తెలియదు. అతడు తన ధ్వని యవనికల్లో దాగి ఉంటాడు.)

15. (ఎవనిది శోకతప్త హృదయమో వానికి దేవునిముందు కూడా శాంతి లభించదు.)

16. (మా ప్రాణానికి ప్రయత్నం వల్ల హాయి లభిస్తుంది. మరి కవిత్వాకాంక్ష; స్థానం దుఃఖం వల్ల లభిస్తుంది.)

17. (నీవెప్పుడూ కవిత్వం మత్తులో మునిగి తేలుతూ ఉంటావు. నీకు ఈ స్థానం లభిస్తే?)

20. (ఈ చిల్లర దేవుళ్ళంతా రాళ్ళ ప్రతిమలే. ఈ భర్తృహరి వీటికి అతీతుడు.)

21. (కర్మపట్ల ఆసక్తిలేని ఆరాధన వ్యర్థం, నిరర్థకం. మంచిగాని, చెడ్డగాని, జీవితమంతా కర్మమయంగా ఉండాలె.)

22. (ఎవరూ ఎరుగని విషయం నీతో చెబుతాను. దీన్ని తన మనస్సుపై వ్రాసుకున్నవాడు ధన్యుడు.)

23. (నీవుచూస్తున్న ఈ ప్రపంచం భగవంతుని నీడకాదు. రాజ్యంనీది. దీనిపై వడికిందంతా నీది.)

24. (కర్మను గౌరవించు. స్వర్గనరకాలన్నీ ఈ కర్మకు ఫలితాలే).

భర్తృహరి ఈ క్రింది శ్లోకం ప్రొ॥ షిమ్మెల్ అభిప్రాయం ప్రకారం **Bothlink Edition**లో 3367వ పద్యానికి సాహిత్యానువాదం. ఆ శ్లోకం ఇది:

"నమస్యామీ దేవాన్నను హతవిధేస్త్యేపి వశగా
విధిర్వంద్యః సోఽపి ప్రతినీయతకర్మైకఫలదః
ఫలం కర్మా యత్తం యది కిమమరైః కించ విధినా
నమస్తత్ కర్మభ్యో విధిరపిన యేభ్యః ప్రభవతి" 19

(మనం దేవతలను పూజిస్తాము. కాని వాళ్లుకూడా బ్రహ్మకు అధీనులే. ఆ బ్రహ్మనుకూడా ఎందుకు పూజించాలె? అతడు ప్రతిజీవికి అదృష్టాన్నే కదా ప్రసాదించేది! మరి ఆ అదృష్టం కర్మాధీనం. రకరకాల దేవదేవతలకు దేవుడైన బ్రహ్మవల్లకూడా మనం పొందవలసిందేముంది? ఏ కర్మను బ్రహ్మకూడా కింద మీదులు చెయ్యలేడో ఆ కర్మకు నా నమస్కారం.)

ఇక్బాల్ తన ఉర్దూకవితా సంకలనం 'భాలెజ్బ్రీల్'లో ఒక కవిత కర్మపద్ధతిని గురించి వ్రాస్తూ భర్తృహరిని మనసులో నిలుపుకున్నాడు. ఈ కవిత భర్తృహరి శతకంలోని ఈ క్రింది శ్లోకానికి ప్రతిధ్వని.[2]

వ్యాలం బాలమృణాలతంతు భిరసౌరోమం సముజ్జృంభతే
ఛేత్తుం వజ్రమణిం శిరీషకు సుమప్రాంతేన సన్నహ్యతి।
మాధుర్యం మధుబిందునా రచయితుం క్షారాంబుధేరీహతే
మూర్ఖాన్యః ప్రతినేతుమిచ్ఛతి బలాత్సూక్తైః సుధాస్యందిభిః
నీతిశతకం శ్లోకం 5

(సామాన్యమైన మధురమైన పలుకులతో ఒక మూర్ఖుణ్ణి చక్కని మార్గం అవలంబించేటట్టు ఎవరైనా ప్రయత్నిస్తే అతని ప్రయత్నం నిష్ఫలమవుతుంది. తమ్మితూండ్ల కేసరాలతో మత్తేభాన్ని కట్టే ప్రయత్నం చేస్తే, లేక శిరీషకుసుమంతో వజ్రాన్ని కోయటానికి ప్రయత్నిస్తే, తేనెచుక్కలో సముద్రజలాన్ని మధురంగా మార్చడానికి ప్రయత్నం చేస్తే ఎలా ఉంటుందో ఇదీ అంతే.)

ఇక్బాల్ -

ఫూల్‌కి పత్తిసే కటసక్తాహై హీరేకాజిగర్
మర్దెనాదాఁ పర్ కలామె నర్మొనాజుక్ బె అసర్

(పూరేకుతో వజ్రహృదయాన్ని భేదించవచ్చు
మెత్తని మాటల వల్ల మూర్ఖుని మనస్సును మార్చలేము.)

## రామాయణాన్ని కవితా (ఉర్దూలో) బద్ధం చెయ్యాలన్న ఆకాంక్ష :

భారతీయతత్త్వం, దేవతాతత్త్వం, మతవిశ్వాసాలతో ఇక్బాల్‌కు చక్కని పరిచయం ఉండేది. వీర రసాత్మకమైన భారతీయ సాహిత్యంపట్ల ఆయనకు చాలా ఆసక్తి ఉండేది. ఒకప్పుడు ఆయన రామాయణానికి ఉర్దూవేషం వెయ్యాలను కున్నాడు. మహారాజా సర్ కిషన్‌ప్రసాద్‌కు వ్రాసిన ఒక లేఖలో, జహాంగీర్

**అవతారాల పట్ల, భక్తుల పట్ల ఆదరం** :- జాతీయసమైక్య భావం పెంపొందించడంకోసం వివిధ మతాల, సంప్రదాయాల నాయకులపట్ల, ధర్మాధికారులపట్ల గౌరవమర్యాదలు కలిగించవలసిన అగత్యం ఉంది. ఈ సందర్భంగా ఇక్బాల్ ఉర్దూ సాహిత్యంలో ఒక కొత్తసంప్రదాయాన్ని ప్రారంభించాడు. భారతదేశంలోని భక్తులనుగూర్చి, మతగురువులను గూర్చి కవితలను వెలయించాడు. రాముని గూర్చి ఆయన వ్రాసిన కవితలో రాముని శౌర్యాన్ని, పావిత్ర్యాన్ని మానవీయమర్యాదలను ప్రశంసించాడు.

(రాముడు భారతీయుల గర్వానికి చిహ్నం. ఈ దేశంలో వేన వేల జ్ఞానసంపన్నులు ఉదయించి విశ్వవిఖ్యాతులైనారు. రాముడు శూరుడు, సాహసికుడు, పవిత్రుడు, ప్రేమమూర్తి)*

ఇక్బాల్ కవితారచనలో మూడవ దశ ఇస్లామీ దశ. రామునిపై కవితలు ఈ దశలో వెలయించడం విశేషం. ఇదేవిధంగా ఆయన గురునానక్‌ను గూర్చి ఒక చిత్తాకర్షకమైన కవిత వ్రాశాడు. ఆయన ఏకేశ్వరారాధనను ప్రశంసించాడు. అదే కవితలో గౌతమబుద్ధునికి నివాళులర్పించాడు. బుద్ధుని స్వదేశీయులు బుద్ధుని బోధనలను పాటించలేదని వాపోయాడు. ఈ దేశంలో అస్పృశ్యుల స్థితి దయనీయంగా ఉందని, దుఃఖాన్ని కోపాన్ని వెలిబుచ్చాడు. వీళ్ళపట్ల సానుభూతి సమభావం లేకపోవడం శోచనీయమని బాధపడ్డాడు. ఒక కవితలోని భావం—

(జాతి బుద్ధుని బోధనలను లక్ష్యపెట్టలేదు. మౌక్తికం విలువను తెలుసుకోలేకపోయారు. అయ్యో! సత్యాన్ని పెడచెవిని పెట్టారు. చెట్టు తన ఫలాల తియ్యదనాన్ని ఎరుగనట్టు ప్రపంచానికి జీవిత రహస్యాలను తెలిపింది భారతదేశం. కాని కేవలం భావంలోనే తాత్త్వికత ఉంది. సత్య జ్యోతివెలుగులతో ఈ సమాజం

వెలుగకున్నది. వర్షం కురిసింది. కాని నేల సేద్యానికి సిద్ధంగా లేదు. బ్రాహ్మణుడు తన గుడిలో ప్రమత్తుడై పడిఉన్నాడు. బౌద్ధజ్యోతి ఇతర దేశాల్లో వెలుగులు చిమ్ముతున్నది. ఏకేశ్వరనాదం ఉద్భవించింది పంజాబునుంచి. భారతదేశాన్ని పూర్ణపురుషుడు మేల్కొలిపినాడు)*

ఒక విశిష్ట హిందూనాయకుడు స్వామిరామతీర్థ ఇఖ్బాల్‌కు సమకాలికుడు కూడా. స్వామి రామతీర్థ 22 అక్టోబరు 1873 లో గోజర్ నవాల (ఇప్పుడది పాకిస్తాన్‌లో ఉంది) జిల్లాలోని మురాలివాలా జిల్లాలో జన్మించాడు. ఆయన 1985 లో గణితశాస్త్రంలో ఎం. ఏ. పట్టా పొందారు. కొంతకాలం ఉద్యోగం చేసిన తర్వాత యౌవనంలోనే ఆయన సన్యాసాశ్రమం స్వీకరించాడు. 1906 లో దీపావళినాడు గంగలో స్నానం చేస్తూ బ్రహ్మలో లీనమైపోయాడు. అప్పుడు ఆయన వయస్సు 33 సంవత్సరాలు. ఈ సంఘటన ఇఖ్బాల్‌ను కలచివేసింది. ఒక అందమైన కవిత వెలువడింది-

(నీవు ఒక చైతన్యానికి బంధువుడవు. నీవు ముందు మౌక్తికానివి. ఇప్పుడు అలభ్యమౌక్తికమైనది. ప్రపంచరహస్యాలను ఎంత చిత్రంగా ఛేదించావు? నేనింకా ప్రాపంచిక బంధాల్లోనే ఉన్నాను.)**

## భారతదేశ ప్రసక్తి :

అవకాశం దొరికినప్పుడల్లా ఇఖ్బాల్ దేశాన్ని శ్లాఘించాడు. ముస్లిముల వైభవోపేతమైన భవిష్యత్ స్వప్నాలనుచూస్తూ....

1. (ధార్మికునికి మళ్లీ భగవదనుగ్రహం లభిస్తుంది.***
తుర్కుల వైభవం, భారతీయుల మేధ, అరబ్బుల వచోవైభవం తిరిగి రానున్నది.)

---

* చూడు అనుబంధము -28.

** చూడు అనుబంధము -29.

*** మూలమునకు చూడు అనుబంధము-30.

ఆయన ఐరోపాలో ఉన్నప్పుడు కూడా భారతదేశసౌందర్యాన్ని మరువ లేదు.

2. ఇఖ్బాల్! నేను ఐరోపాలో అంతా వెదికాను.
భారతదేశంలోని అమృతాంశఫలాలను కన్గొనలేకపోయాను.
తన కుమారుడు జావేదుకు ఉపదేశం చేస్తూ;

3. (ఆంగ్లేయుల ఖరీదైన గాజుపానపాత్రకు అర్రులు చాచకు,
భారతదేశంలోని మట్టితోనే పాన పాత్రను సృష్టించు).
మరొకచోట ఇలా అన్నాడు;

ప్రపంచంలో నలుగురు మహాపురుషులున్నారు. వాళ్ల మాయలో చిక్కుకున్న వ్యక్తి బయటపడిరావడం కష్టం. ఆ నలుగురు 1. మొహియొద్దీన్ ఇబ్నె అరబీ[1], 2. శంకరాచార్య 3. బేదిల్[2] 4. హేగల్[3].

1928 - 29 లో ఇఖ్బాల్ 'జదీదుల్హియాతె ఇస్లామియా' ను గూర్చి మద్రాసు, మైసూరు, హైదరాబాదులో ఆరు ప్రసంగాలు చేశాడు. తన తత్త్వాన్ని ఈ ప్రసంగాల్లో స్పష్టపరచడమే కాక ఇస్లాంను నూత్న వైజ్ఞానిక దృష్టితో

---

1. మొహియొద్దీన్ ఇబ్నె అరబీ (క్రీ. శ. 1165-1240) గొప్ప ముస్లిం సూఫీ. అందేస్ (స్పేన్)లో పుట్టారు. నూటికంటె ఎక్కువ రచనలు చేశారు. 'ఫిసూసుల్హుకుం' 'ఫుతూహాతె మకియా' ఇస్లాంతత్త్వం చెప్పే ముఖ్య గ్రంథాలు. మహేశ్వరవాదులు, ప్రచారకులు.
2. మిర్జా అబ్దులాఖదీర్ బేదిల్. (మృతి 1720 క్రీ. శ.) భారతదేశంలో గొప్ప ఫారసీ పండితుడు. కవి. ఆయన తాత్త్విక చింతన ప్రభావం గాలిబ్ పైన ఎక్కువ. కొంతవరకు ఇఖ్బాలుపై కూడా.
3. హేగల్: (Hegel) 1770-1831. ప్రసిద్ధ జర్మన్ తత్త్వవేత్త. గతి తార్కిక భౌతికవాదం (Dialetion) కారల్ మార్క్సును చాలా ప్రభావితుణ్ణి చేసింది. ఇఖ్బాల్ కవితలో ఈయన ప్రసక్తి వస్తుంది. హేగల్ తత్త్వ పద్ధతి వచనంలో వెలసిన వీరకావ్యం అని ఇఖ్బాల్ అన్నాడు. **Stray thought of Iqbal in S. A. Vahid's Thought and Reflection of Iqbal.**

పరిశీలించాడు. వ్యక్తిత్వంపై ఇంగ్లీషు తత్వవేత్త బ్రాడ్లే Appearance and Reality (సాక్షాత్కృతి-యాథార్థ్యంలోని) రెండు ప్రకరణాలను ఆయన ఒక విధంగా ఆధునిక ఉపనిషత్తులు అన్నాడు. జీవాత్మ అయథార్థమని నిరూపించ డానికి ప్రయత్నం జరిగింది. ప్రసంగంలోని అతి ముఖ్య భాగం "ఆధునిక కాలంలో ప్రచలితమౌతున్న ఆలోచనలను గమనించండి. బ్రాడ్లే మాత్రమే ఈ విషయంలో కొంత వ్యాఖ్యానం చేశాడు. వ్యక్తిత్వం నిజంగా సత్యంగాను. నైతిక జీవిత పరిధిలో నేని ఉనికిని ఒప్పుకుంటాడు. కాని తర్కంలో ఇది కేవలం విద్యా విషయికమైన ఊహ. ఇంతకంటే దీనికి ప్రాముఖ్యం లేదు. సత్తు, 'చిత్తు'లలో వ్యక్తిత్వం యొక్క ఉనికిని దర్శించాడు. ఈ రచనలోని రెండు ప్రకరణాలు ఒక విధంగా నేటి కాలపు ఉపనిషత్తులని భావించవలసి ఉంటుంది. జీవాత్మ లేదని చెప్పిన ప్రకరణా లివి. బ్రాడ్లే దృష్టిలో సత్యం అంటే అనుమానరాహిత్యం కాని అనుభూతులకు నిరంతర కేంద్రం. బ్రాడ్లే పరిశోధించి పరిశీలించాడు. స్థితి, చలనాలకు అతీత మైన సమన్వయ వైరుధ్యాలతో కూడుకున్నదీ జీవాత్మ. అందుకే వ్యక్తిత్వం అనేది మోసం. ఈ ప్రకరణంలో ఈ సిద్ధాంతాన్ని కూడా ప్రతిపాదించాడు. దీనిని అనుభూతి అనండి అహం అనండి ఆత్మ అనండి. ఆలోచనా సూత్రాల పరిధిలోనే చూడవలసి ఉంటుంది. కాని ఇది ఆలోచనల్లోని నిష్పత్తులపై ఆధారపడి ఉంటుంది. మరి నిష్పత్తులన్నప్పుడు భిన్నత్వం అనివార్యమౌతుంది. కాని నిష్ఠురమైన తర్కాన్ని ప్రయోగించినా వ్యక్తిత్వం ఉన్నదన్న సత్యం వికలత్వాన్ని కలిగిస్తుంది. ఏదో ఒక విధంగా అది ఒక సత్యం అన్న సంగతిని బ్రాడ్లేకూడా ఒప్పుకోవలసి వచ్చింది. అంటే కాదనరాని యాథార్థ్యం. కాని నిరంతరస్థితిలో వ్యక్తిత్వం నిశ్చయంగా ఒక వ్యర్థ జీవితతత్త్వం. కాని చాలా ప్రభావోపేతమైన, ఇంకా సంతుల నాత్మకమైన ఒక ఏకీభావం ప్రకృతి సహజమైనది. పరిపూర్ణమైన ఏకీభావం కోసం ఎలాంటి పరిస్థితులను అధిగమించిపోవాలో ఎవరికి తెలుసు? తన అనుభూతిలో ఉన్న స్వరూపం అలాగే ఉంటుంది. నిద్రావస్థలో శాంతిని అందిస్తుంది. ఒక సామూహ్య సంఘటన ఈ ఏకతను కిందుమీదులు చేయవచ్చు. తనను తాను అదుపులో ఉంచుకునే శక్తివల్ల ఇది జరుగకుండా పోవచ్చు కూడా. ఏ విధంగా ఈ అంశాన్ని పరిశీలించినా వ్యక్తిత్వానుభూతి అలాగే ఉంటుంది. ఈ అనుభూతి బ్రాడ్లే అంతటివాణ్ణి ఒప్పించగలిగింది.

# స్వాతంత్ర్యోద్యమం

## భారతీయుల దాస్యంపట్ల దుఃఖం - మానసిక ఆందోళన

తమ కవితల్లో ఇతర రచనల్లో భారతదేశం బ్రిటిష సామ్రాజ్యానికి దాస్యం చేస్తుండటంపట్ల తన దుఃఖాన్నీ, ఆందోళననూ ప్రకటించాడు. ఒక ప్రతీకాత్మక కవిత.[1]

(కడచిన కాలం జ్ఞాపకానికి వస్తున్నది. ఆ వసంతోద్యానాలూ, పక్షుల కలరవాలూ, ఇచ్చవచ్చినప్పుడు వచ్చిపోయే స్వాతంత్ర్యం ఇప్పుడేది ఆ గూళ్లల్లో? మంచు బిందువుల కన్నీరునుచూసి మొగ్గలు నవ్వినప్పుడు మనసుకు బాధ కలుగుతుంది. నా చెరలోనికి ఆ ధ్వనులు రానేరావు. నా చేతుల్లో ఉంటే, నాకు విముక్తి లభిస్తుంది. ఎంత దురదృష్టవంతుణ్ణి. ఇంటిపై బెంగ పెట్టుకున్నాను. పుట్టింట మిత్రులున్నారు. నేను చెరలో ఉన్నాను. ఈ చెర దుఃఖం ఎవరికి వినిపించను? ఈ చెరలో దుఃఖంతో చచ్చిపోతానేమో? చెరపట్టేవాడా! నన్ను వదులు. నాకు నోరులేదు. నా దీవనలందుకో. తోట విడిచినప్పటినుంచి ఇదే స్థితి. దుఃఖం మనస్సును తినేస్తున్నది. మనసు దుఃఖాన్ని తినేస్తున్నది.)

ఇఖ్బాల్ మనసులో తిరుగుబాటు రేగింది. రాజకీయ దాస్యంవల్ల భారతీయులు ఆలోచించే తీరులో కూడా పాశ్చాత్యులకు దాసులౌతున్నారు. ఆయన కవితలనేకం ఈ భావాలకు నిదర్శనాలుగా ఉన్నవి.[2]

(పనికిమాలినవాడు క్రమంగా పనికొస్తున్నాడు. దాస్యంలో జాతుల ఆత్మలే మారిపోయాయి. తనువు, ధనం, నీడ వస్తాయి పోతాయి. తెల్లవాని రాజ్యాన్ని,

---

1. [illegible] అనుబంధం - 31
2. చూ. [illegible] అనుబంధం - 32

నా మనస్సు ఒప్పుకోదు, ఒరుల పుండు ఉంగినప్పుడు నీ తనువేదీ? నీ మనసేదీ? దాసుల దృష్టిని నమ్మలేము. స్వతంత్రుల కన్ను మాత్రమే చూడగలుగుతుంది.)

## స్వదేశీ ఉద్యమంతో సహకారం

స్వదేశీ ఉద్యమాన్ని కూడా ఇఖ్బాల్ బలపరచాడు. 'జమానా'(కాన్పూర్) పత్రికలో 1906 సంచికలో కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంనుంచి వ్రాసిన లేఖలోని కొన్ని భాగాలు, వ్యాసరూపంలో ప్రచురితమైనవి. తన దేశంపట్ల ఆయనకు పట్ట రాని ప్రేమ, స్వదేశీయుల్లో ఐకమత్యాన్ని కలిగించాలన్న మహత్వాకాంక్ష, దేశం సుఖసంతోషాలతో ఉండాలన్న తపన అతిఉత్కటంగా ఉండేవని ఈ రచనల వల్ల స్పష్టమవుతున్నది. స్వదేశీ ఉద్యమం భారతదేశానికి అవసరం అని భావించే వాడు. "స్వదేశీ ఉద్యమం భారతదేశానికేకాదు, భారతదేశంలోవలె రాజకీయ, ఆర్థిక పరిస్థితులు ఏ దేశంలో ఉన్నా ఆ దేశానికి అది లాభప్రదం. ఆర్థిక పరిస్థితి బాగుపడనంతవరకు ఏ దేశం కూడా రాజకీయ సమస్యలను సాధించలేదు. మన దేశీయులెందరో "రాజకీయ స్వాతంత్ర్యం", "రాజకీయ స్వాతంత్ర్యం" అని అరుస్తున్నారు. రాజకీయ స్వాతంత్ర్యానికి కావలసిన లక్షణాల్లో మొదటి లక్షణం ఆర్థిక రంగంలో ముందుకు సాగడం అన్న అంశాన్ని ఎవరూ గుర్తించలేక పోతున్నారు. అదృష్టవశాత్తూ ఇప్పుడు దేశప్రజలు ఈ వైపుకు దృష్టిని మరల్చారు. రాజకీయ హక్కులను సాధించేందుకు కావలసిన రెండవ లక్షణం దేశప్రజలు అవసరాలు ఒకటి కావటం. అవసరాలు ఒక్కటి కాకపోతే ప్రకృతి శక్తులు వాళ్ళను ప్రపంచపుటల్లోంచి చెరిపేస్తాయి. ప్రకృతి ఒక ప్రత్యేక వ్యక్తినిగాని, ప్రత్యేక వర్గాన్నిగాని లక్ష్యపెట్టదు. జనం 'ఏకత; ఏకత' అని నినాదాలు చేస్తారేకాని నిత్య జీవితంలో తమ హృదయాలతో అనుగుణంగా ప్రవర్తించరు. మనకు మాటలతో పనిలేదు. దేశంకోసమైనా శక్తిని పుంజుకునే ప్రయత్నం చెయ్యాలి. మతం ప్రపంచానికి సామరస్యాన్ని అందించడానికి వచ్చింది. కలహం కోసం కాదు. నా దృష్టిలో, ఈ ఉద్యమం వల్లనే ముస్లిములకు అన్ని విధాలా లాభం కలుగుతుంది. సాధారణంగా ముస్లిముల వృత్తి వ్యాప

సాయం కనుక ఈ ఉద్యమంవల్ల ముస్లిములకు ఏమీ లాభంలేదని ఎవరో పెద్ద మనిషి పత్రికకు ఒక లేఖ వ్రాశాడు. పంజాబు విషయంలో ఈయన సెలవిచ్చింది నిజమేకావచ్చు. అయినా ముస్లింలు వ్యవసాయ వృత్తిలో ఉన్నారు కనుక స్వదేశీ-ఉద్యమంవల్ల వాళ్ళకు లాభం కలుగదన్న వాదం సహేతుకమైంది కాదు.........
........ఓర్పుతో, ధైర్యంతో వ్యవహరిస్తే ఈ ఉద్యమం తప్పక ఫలిస్తుంది. విదేశీ వస్తువులను ఉపయోగించకపోవడం పవిత్ర కర్తవ్యంగా భావించాలె. దీక్ష పూనాలె. ఉద్యమంవల్ల హిందూ ముస్లిముల అవసరాలు ఒక్కటై క్రమంగా వాళ్ల బలబడితే, భగవాన్! ఇంకా కావలసిందేముంది? భారతీయుల సుప్తసౌభాగ్యం మేలుకుంటుంది. నా ప్రాచీన దేశంపేరు ఉజ్జ్వలాక్షరాలతో గొప్పగొప్ప దేశాల సరసన చోటుచేసుకుంటుంది."[1]

ఈ లేఖ ఇంగ్లండునుంచి వచ్చింది. బెంగాలు విభజనకు అనుకూలంగానూ స్వదేశానికి ఉద్యమానికి ప్రతికూలంగానూ ఉన్న అప్పటి ముస్లిం నాయకత్వాన్ని ఇఖ్బాల్ లెక్కచేయలేదు.

### జామెమిల్లియా ఇస్లామియా అధ్యక్షపదవికి ప్రతిపాదన :

జామెమిల్లియా ఇస్లామియా స్థాపన సందర్భంగా అధ్యక్షపదవికి గాంధీజీ దృష్టి ఇఖ్బాల్‌పై ప్రసరించింది. గాంధీజీ ఇఖ్బాల్‌కు టెలిగ్రాం పంపారు. వచ్చి బాధ్యతను స్వీకరించవలసిందిగా ప్రార్థించారు. ఒక లేఖ కూడా వ్రాశారు. అందులో ఇఖ్బాల్ విద్వత్పూర్ణమైన నేతృత్వంవల్ల లాభంపొందే అవకాశం తమకు కల్పించమని కోరినారు.

"ముస్లిం నేషనల్ యూనివర్సిటీ (జామె మిల్లియా ఇస్లామియా) మిమ్మల్ని ఆహ్వానిస్తున్నది. మీరీ పదవిని చేపట్టాలె. మీ విద్వత్పూర్ణమైన నేతృత్వంలో ఇది అభివృద్ధి పొందగలుగుతుంది. హకీం అజ్మల్ ఖాన్ గాక అలీ సోదరులు కూడా మనఃపూర్వకంగా ఈ నియామకాన్ని హర్షిస్తున్నారు. మీరు ఈ పిలుపును అంగీకరించాలని నా కోరిక. పవచైతన్యానికి అనుగుణమైన మీ జీవితానికి

1. అన్వారె ఇఖ్బాల్ సంపాదకుడు: బషీర్ అహమ్మద్ డార్ - పుట. 25.

కావలసిన అన్ని అవసరాలను మీకేమీ కష్టం కలగకుండా పూర్తిచేస్తాము. దయచేసి ప్రత్యుత్తరాన్ని పండిత్ మోతీలాల్ నెహ్రూ ద్వారా అలహాబాద్ అడ్రసుకు పంపించండి."[1] ఈ కథ 1920 నవంబరు చివరిరోజుల్లో జరిగింది. ఇఖ్బాల్ ఈ ప్రతిపాదనకు అంగీకరించలేదు.

## గాంధీజీ గుణాలపై కవిత :

21 నవంబరు 1921 నాటి 'జమీందార్' దినపత్రికలో ఇఖ్బాల్ కవితను ప్రకటించాడు. అందులో మహాత్మా గాంధీని నిశ్చయాత్మకమైన మనీషిగా, సత్యసంధునిగా, స్వచ్ఛ పురుషునిగా వర్ణించాడు.*

ఇఖ్బాల్ జాతీయ సంఘటనలకు స్పందించిన కవి. రెండు సంఘటనలను ఇక్కడ చెప్పడం అవసరం కాదనుకుంటాను.

**జలియాన్ వాలాబాగ్ దురంతం :** జలియాన్ వాలాబాగ్‌లో జరిగిన హత్యాకాండకు ఇఖ్బాల్ చాలా బాధ పడ్డాడు. ఈ కవిత బహుశః ఆ దురంతానికి పొగిలి వ్రాసి ఉంటారు.[2]

(తోటలో విహరిస్తున్న ప్రతివానితో పవిత్ర మృత్తిక అంటున్నది కదా, లోకంలో అప్రమత్తుడవై ఉండకు, అమరవీరుల రక్తంతో అంకురార్పణ జరిగిందిక్కడ. అశ్రువు రాల్చలేక ఉండలేవు నీవిక్కడ.)

ఈ కవితలు ఏ సంకలనంలోనూ చేరలేదు.

---

1. Collected works of Mahathma Gandhi Vol 19 P. 34.
2. బాకియాత్ ఇఖ్బాల్ సంపాదకులు అబ్దుల్వాహెద్ మేని, అబ్దుల్లా ఖురేషీ పు. 238.

* మూలమునకు చూడు అనుబంధము-33.

** [illegible] 34.

**చౌరాచౌరి సంఘటన :** చౌరాచౌరీలో జరిగిన హింసాత్మక సంఘటన ఇక్బాల్ హృదయాన్ని కలచి వేసింది. ఆయన ఒక లేఖలో[1] "భారతదేశంలో మహాత్మా గాంధి అరెస్టు అయిన తరువాత శాంతి ఏర్పడినట్టుగానే కనిపిస్తున్నది. కాని ప్రజా హృదయాల్లో కలిగిన సంక్షోభం అత్యాశ్చర్యాన్ని కలిగిస్తున్నది. ఇంత కొద్ది కాలంలో ఇంత విప్లవం విజృంభించిన వైనం చరిత్రలో ఎన్నడూ లేదు. ఈ విప్లవంతో ప్రభావితుల మవుతున్న మేము దీని ఔన్నత్యాన్ని, ప్రాధాన్యాన్నీ అంతగా పట్టించుకోవడం లేదు. రానున్న తరాలు ఈ చరిత్రను చదివి ఆశ్చర్యచకితులౌతారు.

"కాని ఇప్పుడిది చూసి మేము ఆశ్చర్యంలో మునిగిపోతున్నాము. ఇప్పటి తరాలకు స్వాతంత్ర్యోద్యమ చరిత్ర, నిన్నటి తరాలు చేసిన అనుపమ త్యాగాలను అర్థం చేసుకునే పద్ధతిలో అందడం లేదు. జాతీయ సమైక్యం, దేశ సమగ్రత వంటి ఆశయాలను సాధించడానికి స్వాతంత్ర్యోద్యమ దీర్ఘ చరిత్ర నిర్మలంగానూ, నిర్దుష్టంగానూ ఇప్పటి తరాలకూ, రేపటి తరాలకూ అందడం కూడా ఒక జాతీయ అవసరం."

**ఆల్ ఇండియా ముస్లిం లీగ్ అధ్యక్షోపన్యాసం :** 29 డిసెంబర్ 1930లో అలహాబాదులో జరిగిన ఆల్ ఇండియా ముస్లింలీగ్ మహా సభలకు అధ్యక్షత వహిస్తూ ఇక్బాల్ "భారత దేశ రాజకీయ దాస్యం ఆసియా ఖండం అంతటికీ ఉపద్రవాన్ని తెచ్చిపెడుతున్నది. నేడు కూడా ప్రాచ్య ఖండపు ఆత్మను అణచివేసింది. భావ ప్రకటనా స్వాతంత్ర్యం లేకుండా చేసింది. ఒక మహోన్నతమైన, వైభవోపేతమైన సంస్కృతికి నిలయమైన భారతదేశం కోసం మన పూర్వ ప్రతినిధులతో ముడిపడి ఉన్న భారతదేశం కోసం, పాటుపడటం మన కర్తవ్యం" అన్నారు. **Saul Bellow** వ్రాసిన కథలోని పాత్ర అనుకొన్నట్టు అనుకున్నారు.

1. సర్ మహమ్మద్ ఇక్బాల్ - [illegible] పుట 154.

"I was never my own. I was only loaned my self."
(నేనెప్పుడూ నావాణ్ణి కాను. నాకు నేనే ఋణపడి ఉన్నాను.)

**పాశ్చాత్యుల దాస్యానికి నిరసన :** మేధావుల స్థాయిలో ఇక్బాల్ ఈ పరిస్థితులను ఎదుర్కోవడానికి రెండు మార్గాలను సూచించాడు. కఠినమైన, శక్తిమంతమైన పదాలతో పాశ్చాత్య విద్యా విధానాన్నీ, పాశ్చాత్య భాష విధానాన్నీ, పాశ్చాత్య సంస్కృతినీ.పాశ్చాత్య సంప్రదాయాలనూ నిరసించాలి. ఇక్కడ నేను ఈ అంశాన్ని విపులంగా వ్యాఖ్యానించదలచుకోలేదు. అయినా ఇక్బాల్ వ్రాసిన ఈ నాలుగు పంక్తులు ఈ అంశాన్ని చక్కగా వివరిస్తాయి.[1] (విద్యాలయంలోని యువకుడు సజీవంగానే కనిపిస్తాడు. కాని చచ్చుపీనుగు. పాశ్చాత్యులనుంచి మనస్సును అడిగి తెచ్చుకున్నాడు. మరేమీ అనుకోకు, కొంచెం పరీక్షించి చూడు. పడమటివాని దౌష్ట్యాన్ని, నైచ్యం పొందిన ఉన్నతినీ, పాశ్చాత్యుల ఉన్మాదానికి ఎన్ని తెలివితేటలున్నా దీని కవచం ఇంకా చిరుగనేలేదు. యూరప్ మధుశాల పద్ధతులే విచిత్రమైనవి. ముందు మత్తును కలిగిస్తారు. పిదప సారాయి నందిస్తారు.)

ప్రాచ్యజాతుల ప్రత్యేకించి భారతీయుల దాస్యం మీద ఇక్బాల్ ఆందోళన, బ్రిటిషు సామ్రాజ్యానికి విరుద్ధంగా తిరుగుబాటు, స్వదేశీ ఉద్యమం వంటి దేశభక్తి ప్రపూర్ణమైన భావాలు ఆయన ఫారసీ కవితల్లో కూడా ఉన్నవి. 1936 లో ప్రచురితమైన 'పస్చెబాయద్ కర్దాయె అఖ్వామెముష్రిఖ్'లో కూడా ఉన్నది. ఇందులో ఇంగ్లీషువాళ్ళు మానవత్వాన్ని ఏవిధంగా నాశనం చేశారో, బలహీన జాతులను ఏ విధంగా కబళించారో, తమ విద్యలతో, కళలతో మానవులను ఎలా వేటాడుతారో, వాణిజ్యాన్ని [2]రాజకీయ ప్రతారణంగా మార్చి ఏవిధంగా ప్రజల రక్తాన్ని పీలుస్తారో ఇక్బాల్ అభివర్ణించాడు.

---

1. చూ. మూలమునకు అనుబంధము - 35.
2. చూ. మూలమునకు అనుబంధము - 36.

1. (మానవత్వం, తెల్లవాళ్ల దౌర్జన్యానికి హాహాకారాలు చేస్తున్నది. జీవితాలు ఇంగ్లీషు వాళ్లతో పోరాటం నేర్చుకుంటున్నవి.)

2. (గొర్రెల, మేకల తోళ్లు తొడుక్కుని వీళ్లు అనుక్షణం మేకపిల్లలను వేటాడుతున్నారు.)

3. (మానవులకు కలుగుతున్న కష్టాలన్నీ వీళ్లవల్లనే. మానవత్వానికి దుఃఖం వీళ్లవల్లనే కలుగుతుంది.)

4. (పదార్థ విజ్ఞాన శాస్త్రం మన దేశానికేమో విజ్ఞానం, కాని ఇంగ్లండులో దాని ప్రభావం మరోవిధంగా ఉంది.)

5. (ఇంగ్లీషు వాళ్లు విద్యను ప్రపంచం అంతటా మోసపుచ్చారు. వాళ్ల సాహచర్యంతో దేవదూత కూడా దయ్యమైపోయాడు.)

6. (తెల్లవాళ్ల తెలివి ఖడ్గాన్ని ధరించి మానవాళిని హతమార్చే ప్రయత్నంలో నిమగ్నమై ఉన్నది.)

7. (ఐరోపా శాసనం ఏ సెపం లేకుండానే. ఏమాత్రం సంశయం లేకుండానే తోడేళ్ళకోసం బలిచేస్తున్నాది.)

8. (ప్రపంచంలో కొత్త సంప్రదాయం ప్రారంభం కావాలె. శవాలమీది గుడ్డలను కూడా దొంగలించే వాళ్ళనుంచి మంచి జరుగుతుందని ఎలా ఆశించాలె?)

ఇలా అంటూ ఇఖ్బాల్ మీ అభ్యుదయం మీ చేతుల్లోనే ఉందని ప్రబోధిస్తాడు. "ఐకమత్యాన్ని సాధించండి. స్వేచ్ఛా పతాకం క్రిందికి రండి. మన దేశంలో కళలు ఉన్నవి, మతాలూ ఉన్నవి. అందుకే మనదేశం అందేవైవానికి అభిమానమే. మీరు సంస్కృతికీ, మతానికీ సంరక్షకులు. లేవండి! మీ జాతి అదృష్టాన్ని మార్చండి. ఇంగ్లీషువాళ్లు కలిగించిన మత్తునుంచి తేలుకోండి."

9. (లాభనష్టాలు మీ చేతుల్లోనే ఉన్నవి. ప్రాచ్య ఖండ గౌరవం కూడా మీ చేతుల్లోనే ఉంది.)

10. (ఈ ప్రాచీన జాతులకు అవధులు కల్పించండి. స్వేచ్ఛా సత్యాల పతాకా లను ఎగురవేయండి.)

11. (కళలకూ, మతాలకూ జన్మభూమి ప్రాగ్భూమి. పవిత్ర ప్రాచ్య భూమిని చూసిన స్వర్గం కూడా అసూయ పడుతుంది.)

12. (మీరు మతానికీ, సంస్కృతికీ రక్షకులు. కాంతి హస్తాలను చూడండి. మూసా ప్రవక్తవలె అద్భుత మహిమతో ప్రదర్శించి సమాజాన్ని ప్రకాశ వంతం చెయ్యండి.)

13. (జాతుల కష్టాలు తొలగించండి - పాశ్చాత్తుల నిషా దించుకోండి.)

14. (ఆంగ్లేయుడు పాలకుడూ వ్యాపారి కూడా. వాడి నాలుకపై ధర్మం ఉంటుంది కాని మనస్సులో అధర్మం ఉంటుంది.)

15. (ప్రభుత్వానికి శక్తి ఉంటుందని మీకు తెలుసు కాని, మన తరంలో వ్యాపారమే ప్రభుత్వమైపోయింది.)

16. (అంగడికీ, కిరీటానికి, సింహాసనానికీ పొత్తు కుదిరింది. వ్యాపారంలో లాభాలు వస్తున్నాయి. ప్రభుత్వానికి కప్పం దొరుకుతున్నది.)

ఐరోపావాసులు చాలా తెలివి తేటలున్న వాళ్లనీ వంచకులనీ ఇక్బాల్ చెప్పుతూ, వాళ్లు మనదేశం నుంచి ముడివస్తువులు తీసుకుపోయి తమదేశం కర్మాగారాల్లో యంత్రాలతో అందమైన వస్తువులు తయారుచేసి మనదేశంలోనే అమ్ముతారు. దేశీయ వస్తువులనే మనం ఉపయోగించాలి. విదేశీ వస్తువులను కొనకూడదు. మన ఆర్థిక స్తోమత పెరగడానికి ఇది చాలా అవసరం. మహాత్మాగాంధి స్వదేశీ ఉద్యమాన్ని బలపరుస్తూ ఆసియా దేశాలకు భారతదేశానికి ఈ ఉద్యమం వల్లనే విముక్తి లభిస్తుందని చెప్పారు.

17 (పెద్ద కర్మాగారాల అవసరం లేకుండానే బ్రతుకు సాగించండి.)
18 (యంత్రాలతో వాళ్లు తయారు చేసిన ఉన్ని వస్త్రాల్ని కొనకండి)

19. (కొట్టకుండా తిట్టకుండా చంపివేయడమే వాళ్ల పద్ధతి. అంటే పెద్ద యంత్రాల చలనంలోనే మృత్యువు పొంచిఉంటుంది.)

20. (వాళ్ల తివాచీలకోసం మీ చాపలను వదలకండి. చదరంగంలో వాళ్ల పావు దొరుకుతున్న దానికి బదులుగా మీ పావును వదులుకోకండి.)

21. (వాళ్ల ముత్యాలలో మోసమున్నది. పగడాలలో దోషమున్నది. ఆ వ్యాపారుల కస్తూరి కుక్క గొడ్డులోనిది.)

22. (వాళ్లసరుకు అమ్ముకుంటున్నప్పుడు ఎలా నవ్వు ఒలకబోస్తారో; ఎంత మౌనంగా ఉంటారో! తాము తినుబండాలు అమ్మేవాళ్లా, మనం పిల్లలం అనుకునేటట్టు అమాయకుల్లా నటిస్తారు.)

23. (ఓ స్వేచ్ఛాప్రియుడా : నీ భూమిలో పండిందే అమ్ముకో, అదే కట్టుకో, అదే చూపుకో.)

24. (వాళ్లకు దూరాలోచన ఉంది. కనుక తమ మనసు బాగా తెలుసు. వాళ్లు తమ గొంగడిని తామే నేసుకుంటారు)

25. (ఈ నవశకంలో జరుగుతున్న విచిత్రాలు నీకు తెలియవు. ఐరోపావాళ్ల హస్తలాఘవం చూడు.)

26. (వీళ్లు నీ పట్టుతో తివాచీలు తయారు చేస్తారు. నీ ముందే (కొనకోవడానికి) తివాచీలు పరుస్తారు.)

చివరకు ఇక్బాల్ ప్రాచ్యజాతులను మేలుకొమ్మనీ, స్వేచ్ఛకోసం పోరాడమనీ హెచ్చరిస్తాడు.

27. (ఓ ఆసియా జాతీయులారా! చెప్పండి. ఇప్పుడేం చెయ్యాలో ప్రాచ్యుల జీవితాలు మళ్లీ వెలుగులు చిమ్మాలంటే ఏంచెయ్యాలో చెప్పండి.)

28. (ప్రాచ్యఖండం ఆత్మలో ఒక విప్లవం ఆవిర్భవించింది. అంటే రేయి గడిచింది, పొద్దుపొడిచింది.)

**వ్యక్తిత్వతత్త్వం.:—** భారతదేశంలో బ్రిటిష్ అధికారానికి విరుద్ధంగా ఆయన వ్యక్తంగానో అవ్యక్తంగానో ప్రతిపాదించిన సిద్ధాంతం వ్యక్తిత్వ సిద్ధాంతం, వ్యక్తిత్వతత్వం స్వదేశీయులకు ఆయన ప్రబోధించాడు. వైయక్తిక,

సామాజిక స్థాయితో తమ ఉనికిని నిరూపించుకొమ్మని, తమ శక్తులను మరింత అధికంగా ఉపయోగించుకొమ్మని హెచ్చరించాడు. గొప్ప పండితులు, విమర్శకులు, ఇక్బాల్ సాహిత్య అధ్యేతలు ఆయన వ్యక్తిత్వ తత్త్వానికి సముచిత వ్యాఖ్యానాలు చేశారు. నా అభిప్రాయం అంత విలువైనది కాకపోవచ్చు. కాని ఆ కాలంలో ఈ సిద్ధాంతం పరిస్థితుల ప్రభావంవల్ల ఉనికి వచ్చింది. ఆనాటి నైతిక, సాంస్కృతిక వాతావరణంలో రాజకీయ వ్యవస్థలో ఇక్బాల్ కన్ను తెరచాడు. పుట్టి పెరిగాడు. ఒక బానిస జాతికి ఆత్మ విశ్వాసం, ఆత్మ జ్ఞానం, ఆత్మ నిర్మాణం కంటే ఉచితమైన సందేశం మరేదైనా ఉండడానికి వీలులేదు. అదే విధంగా ఒక జాతిని నిర్మించాలనుకున్న వ్యక్తులకు, తమ ఉనికిని వ్యక్తం చేయాలనుకున్న వ్యక్తులకు ఆత్మగౌరవాన్ని గుర్తించి, పునర్నిర్మాణంలో నిమగ్నులైన వ్యక్తులకు ఇంతకంటె గొప్ప సందేశం, ఉత్తమమార్గంలేదు. నేను ఇక్బాల్ వ్యక్తిత్వతత్త్వాన్ని, ఒక అనుభూతి కవి రాజకీయ దాస్యంపట్ల చూపిన ప్రతిక్రియ అనుకుంటాను. ఒక సందర్భంలో ఆయన ఇలా అన్నారు: "అసమంజసమైన వాతావరణాన్ని మార్చాలనుకునేవాడు తనలోనే పరిపూర్ణ విప్లవాన్ని సృష్టించుకోవలసి ఉంటుంది. మనకు స్వాతంత్ర్యం, దృఢ విశ్వాసంలేనిదే ఇది సాధ్యంకాదు. నీ ఆశలు ఫలించాలంటే నీ వ్యక్తిత్వాన్ని నీలోనే కేంద్రీకరించుకో. ఈ విధంగా అసలైన మానవతా నవనీతాన్ని సిద్ధంచెయ్యి. జీవన జ్వాల అరువు తెచ్చుకునేదికాదు. అది ఆత్మలోనే వెలగాలి." తన కవితల్లో ఈ అంశాన్ని ఆయన సమధికంగా వ్యక్తపరచాడు.*

(భారతీయుని వ్యక్తిత్వం చచ్చింది. చెర చెలి అయ్యింది. గూడు ఊచింది. దాస్యం నుంచి విముక్తి వ్యక్తిత్వాన్ని పెంచుకోవడంవల్లనే పెరుగుతుందని విన్నాను. నీ మనస్తరంగం ఏమిటి? ఇది ఒక ఖడ్గం. వ్యక్తిత్వం ఏమి? జీవిత రహస్యం. వ్యక్తిత్వం ఏమి? సర్వ జీవజాగరణం. అంతులేని సముద్రం వ్యక్తిత్వం. వ్యక్తిత్వంలోనే ఉంది ప్రపంచం. ఓ సోమరీ! అన్వేషించు నీ నీరస జీవనం మరణం. ఈ వ్యక్తిత్వం నిర్మాణమే ప్రపంచం.)

* మూలమునకు చూడు అనుబంధము - 37

నిషేని *గూర్చి 1937 వేసవిలో నజీర్ నయాజీకి ఇంగ్లీషులో వ్రాయించిన సంస్మరణంలో ఇఖ్బాల్ వ్యక్తిత్వాన్ని ఇలా నిర్వచిస్తాడు: "నైతికంగా వ్యక్తిత్వం అంటే తనపై ఆధారపడడం, ఆత్మ గౌరవం, ఆత్మ విశ్వాసం, ఆత్మ రక్షణ, తన ఉనికిని గుర్తించాలన్న కోరిక. మృత్యువు ఎదిరిస్తూ జీవించడం సత్పరతుడై ఉండటం న్యాయాన్ని సాధించడానికి లేక కర్తవ్యాన్ని పాలించ డానికి ఇది అత్యావశ్యకం కావాలి." స్వదేశీయులకు ఆయన ఇచ్చిన సందేశం ఇదే. ఆ రోజుల్లో దేశంపై నిష్ఠురమైన సామ్రాజ్యాధికారం ఉన్నప్పుడు ఈ సందే శానికి ఎంతో విలువ ఉంది. రాజకీయరంగంలో గాంధీజీ సత్యాగ్రహం కూడా ఒక రకంగా జాతీయవ్యక్తిత్వ ప్రకటనమే. తాత్త్విక స్థాయిలో ఇఖ్బాల్ వ్యక్తి త్వాన్ని బలపరచడం సామ్రాజ్య శక్తులకు విరుద్ధంగా చేసిన ఒక విధమైన సత్యాగ్రహమే!

ఈ విషయంలో ఎంతో వివరించవలసిన అవసరం ఉంది. ఆ పని మరెప్పు డైనా చేస్తాను. ఇక్కడ నేను ఒక విషయాన్ని మాత్రం ఎత్తిచూపుతాను. నేటి పరిస్థితుల్లో వైయక్తిక, సాంఘికస్థాయిల్లో మన అభ్యుదయానికీ ఆత్మవిశ్వాసానికీ ఈ వ్యక్తిత్వతత్త్వం చాలా అవసరం. ఇఖ్బాల్ కాలంలో ఉన్న అవసరమే ఇప్పుడూ ఉంది. ఇది ఈ నాటి జాతీయ సమైక్యోద్యమాన్ని ప్రభావితంచేయగల ఒక ప్రధాన సాధనం.

## నవమానవ దృక్పథం :

ఈయన వ్యక్తిత్వ తత్త్వంలో నవమానవ ఆవిర్భావంపట్ల ప్రగాఢమైన విశ్వాసం కూడా దాగిఉంది. మానవ భవిష్యత్తుపై స్పష్టమైన నమ్మకం ఉన్న వాళ్లన్నారు ఆయన—

* నిషే - Nietzsche 1844-1900 ప్రసిద్ధ జర్మనీ తత్త్వవేత్త. ఆయన ప్రముఖ రచన Thus Spoke Zaratustra. ఇఖ్బాల్ బాగా అధ్య యనం చేసిన గ్రంథం.

1. (మానవుణ్ణి గౌరవించడమే మానవత్వం. అందుకే మానవుని స్థితిని తెలుసుకోవాలె. మానవాభ్యుదయంకోసమే నిరీక్షిస్తున్నాయి. ఈ పాలపెల్లి, ఈ పువ్వులు, ఈ నీలాకాశం. మనిషి పెచ్చదనమే లోకానికి పచ్చదనం. సూర్యుడూ, నక్షత్రాలూ తమాషా చూస్తున్నారు (సాక్షులు.) *

2. (మానవుడు ఆకాశానికంటె ఎత్తయినవాడు. మానవత్వాన్ని గౌరవించడమే నిజమైన సంస్కృతి.)

3. (నీకు నిజంగా కళ్లుంటే తెరచిచూడు. జీవితం ఒక నూత్న జగత్తును నిర్మించడానికి నడుంకట్టింది)

4. (నీ చదువుకూ, నీ స్నేహానికీ అంతంలేదు. జగద్వీణపై నీ కంటె మించిన రాగంలేదు. నీకు దివారాత్రాల కాంతులు లభించినవి. నీవు మట్టివో పాదరసానివో తెలియదు. మట్టినుంచి పుట్టావని విన్నాము. కాని సర్వకాంతులు నీ ఆధీనంలో ఉన్నవి. జీవితసారం నీ ధ్వనిలోనే ఉంది.)

**1938 నూత్న సంవత్సర సందేశం :-** తన మరణానికి కొద్దిమాసాల 1938లో ఆల్ ఇండియా రేడియో లాహోర్ కేంద్రంనుంచి నూత్న సంవత్సర సందేశం అందించాడు ఇక్బాల్. కొంత భాగాన్నిక్కడ ప్రస్తుతించడం అనవసరం కాదనుకుంటాను.

"సకల విద్యల్లోనూ, వైజ్ఞానిక రంగంలోనూ అనుపమానమైన విజయాలు సాధించినందుకు నేటి కాలం గర్వపడుతున్నది. ఈ గర్వం సహేతుకమైనదే. ఇందులో ఏమీ సందేహం లేదు. కాలం, దేశం పరిమితులు నశిస్తున్నాయి. మానవుడు ప్రకృతి రహస్యాలను కనుగొని దాని శక్తులను స్వాధీనపరచుకోవడంలో ఆశ్చర్యకరమైన విజయాలను సాధిస్తున్నాడు. కాని జ్ఞాపకం ఉంచుకోండి. మానవుడు ఈ భూమిలో కేవలం మానవుణ్ణి గౌరవించి మాత్రమే నిలువగలుగుతాడు

నెత్తురు త్రాగే క్రూరమృగాలకు మృగయాస్థలిగా మారిపోతుంది. అందుకే రండి. అధికారపదవుల్లో వున్న వ్యక్తులకు మానవత్వాన్ని ప్రసాదించాలని, మానవత్వాన్ని పరిరక్షించడానికి ఉద్యుక్తులను చేయాలని సర్వశక్తిమంతుడైన భగవంతుణ్ణి ప్రార్థిద్దాం.''

ఈ నిరంతర ఉద్యమాన్ని సాగిస్తూ ఉండాలని ఇఖ్బాల్ సందేశంలోని సారాంశం. నేటి సమాజంలో విప్లవాత్మకమైన మార్పులు రావాలనేకాదు, వ్యక్తులు తమ అభివృద్ధికోసం కృషిచేయాలనీ, ఒక కొత్త సమాజాన్ని నిర్మించాలని ఆయన హృదయం. భగవంతునితోపాటు ప్రకృతి నిర్మాణంలో మానవునికికూడా భాగస్వామ్యం ఉందన్న ఆయన నవమాన దృక్పథంలో, అణిగిమణిగి చింతాక్రాంతమై ఉన్న భారత జాతిలో ఒక క్రొత్త చైతన్యం తలెత్తాలని ఆయన ఆశయం. స్వాతంత్రోద్యమ నాయకత్వంవల్ల దేశంలో ఉత్సాహం పొంగు లెత్తింది. దుస్స్వప్నం నుంచి మేల్కొన్నది. ఇందులో సందేహం ఏమీలేదు. ఈ చారిత్రక భూమికలో ఇఖ్బాల్ సందేశంతో దృఢవిశ్వాసానికీ, నిరంతరోద్యమకత్వానికీ వ్యక్తిత్వానికీ ఒక విధమైన ప్రాముఖ్యం లభిస్తుంది. ఆనాటి అవసరం ఇప్పటికీ ఉంది. విశ్వాసం, వ్యక్తిత్వం, ఆత్మజ్ఞానం, మళ్ళ విజృంభించాలె. దేశంలో అన్నివర్గాల ప్రజల్లో సమైక్య భావం పెంపొంది దేశం ప్రగతి పథంలో ముందుకు సాగినప్పుడే అది సాధ్యమవుతుంది.

# వైయక్తిక జీవిత దర్పణంలో జాతీయ సమైక్యత

ఇక్బాల్ వ్యక్తిగత జీవితమే జాతీయ సమైక్యతకు ఒక చక్కని నిదర్శనం. ఆయన మిత్రుల, అభిమానుల అతివిస్తృత వలయంలో, దేశంలోని వివిధ ప్రాంతాలవాళ్లు ఉన్నారు. అప్పటి లాహోర్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి సర్ షాదీలాల్ బెంచిలో ఇక్బాల్ ప్రవేశాన్ని వ్యతిరేకించినప్పుడు బాధకలిగినా, తన అన్నను కొందరు మతోన్మాదులు ఒక చిన్న తప్పుడు కేసులో ఇరికించినా, అధికారంలో ఉన్న సిక్కు హిందూ ప్రముఖులతో ఇక్బాల్‌కు స్నేహ సంబంధాలుండేవి.

**మహారాజా సర్ కిషన్ ప్రసాద్ :-** మహారాజా కిషన్ ప్రసాద్‌తో ఆయనకు సత్సంబంధాలు ఉండేవి. పరస్పర ప్రేమ గౌరవాలకు వాళ్ళ స్నేహం ఆదర్శపాత్రం. కిషన్‌ప్రసాద్ కూతురుకోసం పంజాబులో ఒక సంబంధం చూసి పెడ్తానని ఒక లేఖలో వాగ్దానం కూడా చేశాడు.

**సర్ జోగిందర్ సింగ్ :-** జుల్ఫికార్ అలీఖాన్ మోటర్‌ను గూర్చి జోగేందర్‌సింగ్ యథాలాపంగా అన్న మాటను ఇక్బాల్ కవితాబద్ధం చేశాడు. మౌనంగానూ, నిరంతరంగానూ ఉద్యమించాలన్న దృక్పథాన్ని ఇలా వివరించాడు*

(జోగేందర్ సింగ్ విన్న ఎంత చక్కటి మాట అన్నాడు! జుల్ఫికార్ అలీఖాన్ మోటర్ మౌనం వహించిందని నేనన్నాను. ఈ మౌనానికి మోటరుతో సంబంధంలేదు. సమైక్య జీవనపథంలో ప్రతి అడుగులో మౌనం ఉంటుందని)

---

* [illegible]

**సర్దార్ అమ్రావ్ సింగ్ :-** అమ్రావ్‌సింగ్ ఇఖ్బాల్‌కు మంచి మిత్రుడు. 1932లో రౌండ్ టేబుల్ కాన్ఫరెన్సు నుంచి తిరిగివస్తూ పారిస్‌లో ఇఖ్బాల్ ఆయనింట్లో విడిదిచేశారు. అమ్రావ్‌సింగ్, ఎఖ్బాల్ గురించి వ్రాసిన మొదటి ఇంగ్లీషు పుస్తకంలో A voice from the East (నవాబ్ జుల్ఫికార్ అలీఖాన్ వ్రాసిందది.) ఉదాహరింపబడిన కవితలన్నింటినీ సర్దార్ అమ్రావ్ సింగ్ ఇంగ్లీషు లోకి అనువదించాడు. సర్దార్ అమ్రావ్‌సింగ్ మనకాలంలో ప్రసిద్ధి చెందిన చిత్ర కారిణి అమృతా షేర్‌గిల్ తండ్రి.

**బింబా దిలీప్ సింగ్ రాకుమారి :-** మహారాజా రంజీత్‌సింగ్ ప్రపౌత్రి బింబారాకుమారితో ఇఖ్బాల్‌కు సత్సంబంధాలు ఉండేవి. 1911 లో రాకుమారి బింబా దిలీప్‌సింగ్‌ని, ఇఖ్బాల్‌కు సర్ జోగేందర్ సింగ్ పరిచయం చేశాడు. బింబారాకుమారి ఇఖ్బాల్‌ను దర్శించాలని ఎంతగానో అనుకునేది. రాకుమారి భవనంలో ఈ పరిచయం జరిగింది. ఈ సందర్భంగా రాకుమారికోరికపై ఇఖ్బాల్ ఒక కవితకూడా వినిపించాడు. మిర్జా జలాలుద్దీన్ సర్ జోగిందర్‌సింగ్ కూడా అప్పుడు ఇఖ్బాల్‌తో ఉన్నారు.

బింబా రాకుమారితో ఇఖ్బాల్ మరో సమావేశాన్నిగూర్చి చెప్పడం అనుచితం కాదనుకుంటాను. జోగేందర్‌సింగ్ ఎక్కడికో వెళ్ళిపోయినారు. జలాలుద్దీన్‌తో కలసి ఇఖ్బాల్ రాకుమారి ఆహ్వానాన్ని అందుకుని ఆమెను కలుసుకోడానికి వెళ్ళాడు. అప్పుడు బింబా రాకుమారి అస్ట్రియన్ సఖి ఇఖ్బాల్‌ను చూడాలనే కోరికతో అక్కడే ఉంది. మరొక ఐరోపా మహిళకూడా అక్కడుంది. ఆ ఇద్దరు మహిళల్లో ఒకామె ఇఖ్బాల్‌కు ఒక పుష్పాన్ని సమర్పించింది. రెండవ ఆమె తన ఒడిలో ఒక అందమైన పిల్లిని హత్తుకుని ఉంది.

('పుష్పము సమర్పించినప్పుడు', 'ఒడిలో పిల్లి' అన్న రెండు కవితలు ఎఖ్బాల్ అప్పుడు వ్రాసినవే.)*

---

* మానవత చూడు అనుబంధము-40.

'ఒడిలో పిల్లిని చూసి'

(నీకు ప్రేమ ఎవరు నేర్పినారు. వినోదానికి సామాగ్రి ఒక చోట. దుఃఖ వీణ ఒకచోట. ముత్యం ఒకచోట. అశ్రువులు ఒక చోట. మంచు బిందువు ఒక చోట)

'పుష్పమును సమర్పించినపుడు'*

(ఆ మత్తిల్లిన ఒయ్యారం తోటలో అడుగిడినప్పుడు ప్రతిపువ్వు నాలుక నుంచి దీవన వెలువడుతుంది. నిన్ను కొమ్మనుంచి తెంపితే తోటలోని పువ్వులు తల్లడిల్లినవి. విరహ బాధను అనుభవించి సంయోగానికి చేరుకుంది. నీ జీవితంలోని విలక్షణత గమ్యాన్ని చేరుకుంది.)

అబ్దుల్ మజీద్ సాలిక్ కథనం ప్రకారం రాకుమారితో ఇఖ్బాల్ సమావేశం 1911లో జరిగింది. 'బాంగెదిరా'లో పువ్వును సమర్పించినప్పుడు, 1905-1908లో ముద్రితమైన రెండవ భాగంలో ఈ కవిత ఉంది. కాలంలో కొంత వ్యత్యాసం వుంది. కాని సంఘటనలు నిజమైనవే. పొరపాటున రెండవ భాగంలో పడినవేమో! కావచ్చు. రెండవ కవిత 'పిల్లిని చూసి' మూడవ భాగంలో ఉంది. మరి అక్కడే మొదటి కవితకూడా ఉండాలె.

**సరోజినీనాయుడు :-** సరోజినీ నాయుడుకు ఇఖ్బాల్ పట్ల భక్తి విశ్వాసాలు ఉండేవి. ఒకప్పుడు ఆమె 15 అక్టోబర్ 1926 నాడు బొంబాయినుంచి పండిత్ జవాహర్‌లాల్ నెహ్రూకు వ్రాసిన ఇంగ్లీషు లేఖలో తలవని తలంపుగా ఇఖ్బాల్ కవితల్లోని ఒక పంక్తిని ఉదాహరించింది.

"తొందరలో వ్రాసిన నా లేఖను మీరు చదువుకోగలరో లేదో అన్న భయం నాకుంది. నా మణికట్టులో నొప్పి ఉంది. ఇఖ్బాల్ మాటల్లో "నేను ఆపాద మస్తకం బాధను."

---

* చూడు అనుబంధము-41

**ముల్క్‌రాజా ఆనంద్ :** ప్రసిద్ధ ఇంగ్లీషు నవలా రచయిత డా. ముల్క్‌రాజ్ ఆనంద్ ఒక చిన్న సంగతి ప్రస్తావించాడు. కాని సాధారణంగా ఎవరికి తెలియని ఇక్బాల్ మనస్సంస్కారాన్ని తెలుపగలుగుతుందీ సంఘటన. 1922లో ముల్క్‌రాజ్ విద్యార్థి. కవి కావాలనుకుంటుండేవాడు. ఇక్బాల్‌ను దర్శించాడు ఒకనాడు. "నా స్నేహితురాలు యాసిమిన్, వదిన వెలుపల వేచివున్నా"రన్నాడు ఆనంద్. ఇది విని ఇక్బాల్ లేచివెళ్ళి వాళ్ళను లోపలికి తీసుకొనివచ్చాడు. కొంచెం ధైర్యం తెచ్చుకుని ఆనంద్ "నేను కొన్ని కవితలు, బాల్య ప్రేమగీతాలు తెచ్చాను" అంటూ తన స్నేహితురాలివైపు చూశాడు. ఇక్బాల్ ''ఆ బాల ఈ అందమైన అమ్మాయే అయితే మీ ఇద్దరికి శుభం కలగాలె.'' ఆనంద్ ''నేను హిందువును, ఆ అమ్మాయి ముస్లిం.'' ఇక్బాల్ ''ఇలాంటి కలయికను నేను హర్షిస్తాను'' అన్నాడు. కాని విధి ప్రేరణవల్ల ఒక రైల్వే గార్డుకు మూడో భార్య అయింది. (చివరకు వాడామెను చంపేశాడు.) అప్పుడు ఇక్బాల్, ఆనంద్‌కు లండన్ వెళ్ళి తత్త్వ శాస్త్రాన్ని అధ్యయనం చేయడానికి ప్రయాణ ఖర్చుల నిమిత్తం కొంత ద్రవ్యంకూడా అందజేశాడు. ఎంత ప్రేమపూరిత హృదయమో ఇక్బాల్‌ది! మతంతో కాని, వర్గంతో కాని, విశ్వాసంతో కాని సంబంధం లేని ప్రేమ ఆయనది.

ఆయన మిత్రులు అభిమానులు ఆయన విశాల హృదయాన్నీ, మానవతా స్నేహాన్నీ, సానుభూతినీ తెలిపే కథలు అనేకం చెబుతారు. రెండింటిని మాత్రం ఇక్కడ ఉట్టంకిస్తాను.

## ఇద్దరు అనాథ బాలురకు సహాయం :

అబ్దుల్ రషీద్ తారక్ కథనం: ఇక్బాల్ ఇంటివద్ద ఒక సినిమా ఉండేది. "సినిమా గోలవల్ల మీవంటి కవికీ, తాత్త్వికునికీ శాంతి భంగం కలుగదా?" అని ప్రశ్నించాను. ఇక్బాల్ "నాకు అలవాటైపోయింది." ఇల్లు మార్చమని సలహా ఇస్తే ఇలాయించి అన్నారు: "నిజానికి ఈ ఇంటికి వారసులు ఇద్దరు అనాథ బాలురు. వాళ్లకు నేను 130 రూపాయల కిరాయి ఇస్తున్నాను. నేను ఇల్లు వదిలితే ఆ అనాథులకేమీ దొరకదేమో!"

**డాక్టర్ హీరాలాల్ చోప్డా :**

రెండవ కథనం రావి జలాలుద్దీన్ అక్బర్‌ది. ఇది ప్రభుత్వ ఉపకార వేతనం సమస్య. దీని ప్రకారం ఎం.ఏ. (పారసీ)లో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణుడైన విద్యార్థిని ఉన్నత విద్యకోసం ఇంగ్లండుకు పంపించేవారు. 1929 లో ఎఖ్బాల్ (ఫారసీ)కి పరీక్షాధ్యక్షులు, పేపర్ సెట్టరు కూడా. అక్బర్ ఎం.ఏ. పరీక్షకు కూర్చున్నాడు. కాని అనుకున్నంత బాగా వ్రాయలేక పోయాడు. ఈయన కోసం సిఫారసు చేయడానికి ఎఖ్బాల్ వద్దకు హాఫిజ్ మహముద్ షెర్వానీ, సర్ అబ్దుల్ ఖాదర్ వచ్చారు. "అక్బరు శ్రేణి తప్పితే ఒక హిందువుకు ఉపకార వేతనం దక్కుతుంది" అన్నారు. ఇఖ్బాల్ "అభ్యర్థికి ఫారసీ బాగా వచ్చు. మంచి కవి కూడా. చురుకైన విద్యార్థి అనికూడా నాకు తెలుసు. కాని యోగ్యుడైన వానికే ఉపకారవేతనం లభించాలె" అన్నారు. ఆ సంవత్సరం కేవలం రెండు మార్కుల తేడాతో ఒక హిందూ విద్యార్థికి ఉపకార వేతనం దక్కింది. అతడే ప్రసిద్ధ ఫారసీ పండితుడు, సాహిత్యవేత్త, డాక్టర్ హీరాలాల్ చోప్డా. కలకత్తా విశ్వ విద్యాలయంలో ఫారసీ శాఖాధ్యక్షులయ్యారు. ఆయనే నాకీ సంగతి తెలియజేశాడు.

**వెలి :**

వివిధ వర్గాల వ్యక్తులతో సన్నిహితులతో మెలగడంవల్ల ఇఖ్బాల్‌ను కొందరు అపార్థం చేసుకున్నారు. 'సూర్యుడు' వంటి కవిత వ్రాయడంవల్ల, విశేషించి రాముణ్ణి 'ఇమాం' (ప్రవక్త) అనీ 'చిరాగె హిదాయత్' (ఉపదేశజ్యోతి) అనడంవల్ల కొందరు స్వమతాభిమానులతో ఇఖ్బాల్‌కు చిక్కులు వచ్చినవి. సహాయ నిరాకరణోద్యమం తరువాతి కాలం అది. 'శుద్ధి' 'సంఘటన్' 'తబ్లీఘ్' (ఇస్లాం మత ప్రచారం) చాలా ముమ్మరంగా సాగుతున్న రోజులవి. ఒక ముస్లిం పెద్ద మనిషి వేళాకోళం కోసం 'పీర్జాదా మహమ్మద్ సిద్దీఖ్' అనే పేరుతో లాహోర్‌లోని వజీర్ ఖాన్ మస్జిద్ ఖతీబు (ధర్మాధికారి) మౌలానా అబూసయ్యద్ దిల్దార్ అలీ షాకు లేఖ వ్రాశాడు. ఈయన ఆ రోజుల్లో ఇస్లాం ధర్మవేత్తగా ప్రసిద్ధుడు.

"ఏమంటారు ధర్మజ్ఞులు, మతాభిమానులు? ఒకడు తన కవితల్లో సూర్యునికి దైవ లక్షణాలు అంటకట్టాడు. కోరికలు తీర్చమని ప్రార్థిస్తున్నాడు. పరలోకాన్ని నమ్మడు. మూసా ప్రవక్తను మరో విధంగా చిత్రిస్తాడు. మతాధికారులను, ధర్మవేత్తలను అధిక్షేపిస్తాడు. హిందువుల మహాపురుషుణ్ణి అల్లా అవతారమంటారు. 'ఇమాం' 'చిరాగె హిదాయత్' అని శ్లాఘిస్తారు. వాళ్లల్లో ప్రవేశించి ఆనందానుభూతిని పొందుతాడు. ఇలాంటి మనిషి ముస్లిమా లేక కాఫరా? (ఇస్లాం ధర్మ విరోధి) ఇతనితో ఇచ్చిపుచ్చుకోవడాలూ, సాంఘిక సంబంధాలు తెంచేసి వెలివేయడం ఉచితమో, అనుచితమో సెలవివ్వండి." దీనికి ప్రత్యుత్తరంగా మౌలానా తక్షణమే బహిష్కరణాన్ని ప్రకటించాడు. ఇలాంటివాడు ముస్లింగా ఉండటానికి వీలులేదన్నాడు. "భగవంతుడు జ్ఞానస్వరూపుడు. అతనికి జనన మరణాలు లేవు. హిందువుల విశ్వాసం ప్రకారం అవతారమంటే దేవుడు మళ్లీ పుట్టడం. సూర్యుణ్ణి దేవుడనటం కేవలం ధర్మవిరుద్ధం. భగవంతుడు జన్మిస్తాడనడంకూడా అధర్మమే. మూసాను అలా అనడంకూడా అధర్మమే. ఇలాంటి అధర్మభావాలున్నకవి ప్రాయశ్చిత్తం చేసుకోకపోతే ముస్లిం మతంనుండి అతణ్ణి వెలివెయ్యాలి. లేకపోతే ఘోర పాపానికి గురి అవుతారు". ఈ మూర్ఖత్వపు వెర్రిని మౌలానా సయ్యద్ సులేమాన్ నద్వి వంటి ఇస్లాం ధర్మవేత్తలు మరితర ముస్లింపండితులు నిరసించారన్నది వేరేవిషయం. ఇఖ్బాల్‌వంటి మహమ్మద్ ప్రవక్త అనుయాయి వివేకవంతుడు, నీతిమంతుడు, సౌజన్యమూర్తి అయిన ముస్లిమేకాఫరైతే ఇక ముస్లిం ఎవడు? తన్నుగూర్చి ఒక కవితలో- "జాహెద్ ఔర్ రింద్" (ధార్మికుడు అధార్మికుడు)లో తన పొరుగున ఉన్న ఒక మౌల్వీని గురించి ప్రస్తావించాడు.

సున్తాహుఁకె కాఫిర్ నహీ హిందుకో సమఝూ
హైఐసా అఖీదా అసరె ఫల్సఫెదాని

(హిందువును కాఫర్ అనుకోడు అని విన్నాను. తాత్త్వికవివేచనా ప్రభావమిది) ఈ సంఘటనలను దృష్టిలో ఉంచుకుని బహుశః ఇఖ్బాల్-

"జాహిద్ తంగ్ నజర్‌నె ముఝెకాఫిర్ జానా
ఔర్ కాఫిర్ సమఝ్తా హైముసల్మాన్ హుఁమైఁ"

(సంకుచిత దృష్టితో నన్ను స్వమతస్థులు కాఫర్ అన్నారు. కాఫర్‌లు నన్ను ముస్లిం అన్నారు.)

**బ్రాహ్మణజాతిలో పుట్టినందుకు అభిమానం :-** ఈ సందర్భంగా ఈ విషయాన్ని స్పష్టపరచాలనుకుంటున్నాను. తాను బ్రాహ్మణజాతికి సంబంధించిన వాణ్ణనే అభిమానం ఆయనకుండేది. పరిశోధించి తనది సప్రూగోత్రం అన్నాడు. ఆయనకుమారుడు జావేద్ తన తండ్రి జీవితచరిత్ర 'జిందరూద్' (జీవన్నది)లో ఈ అంశాన్ని చక్కగా వివరించాడు. ఒక కథనం ప్రకారం సప్రూ- ఒక బ్రాహ్మణశాఖ. ఈజిప్టునుంచి భారతదేశానికి వచ్చిందట.[1] జావేదు పుస్తకంలోని కొంతభాగాన్ని ఇక్కడ ఉదాహరిస్తాను.

"ఖాజాహసన్‌నిజామి 'ఇక్బాల్‌తో నా సంబంధాలు' అన్న వ్యాసాన్ని 'అదబీ దున్యా' మే 1965 సంచికలో ప్రచురించాడు. ఇక్బాల్ ఉత్సవాల సందర్భంగా ఢిల్లీలో ఈజిప్టు రాయబారితో తన సమావేశాన్ని గూర్చి వ్రాశాడు. తన సమావేశంలో ఈజిప్టు రాయబారి కాశ్మీరు బ్రాహ్మణులు ఈజిప్టునుంచి వచ్చారని నిరూపించడానికి ప్రయత్నం చేశాడు. ఈజిప్టులో సూర్యుని ఆరాధించేవాళ్లలో ముఖ్యుడు 'హరిహర్' అనిపించుకునేవాడు. ప్రాచీన ఈజిప్టు భాషలో 'రా' అంటే సూర్యుడు. కురాన్ సూరయే యూసుఫ్‌కూడా అలిఫ్ లాంరాతో ప్రారంభమవుతుంది. మరోవిధంగా చెప్పాలంటే కురాన్‌లో భగవంతుడు 'రా' అనే శబ్దాన్ని ఉపయోగించాడు. ఈ విధంగా హిందూమతంలో రామునివ్యక్తిత్వానికి ఎంతో గౌరవం ఉంది.' ఈజిప్టు రాయబారి ఇంకా ఇలా అన్నాడు: ఆ ముఖ్యారాధకుడైన హరిహర్ ఖుక్ఫిఫిరోన్ కూతురును వివాహం చేసుకున్నాడు. అతని సంతానం 400 ఏళ్లవరకు ఈజిప్టును పరిపాలించింది. ఆ తరువాత ఒక విప్లవానికి ఫలితంగా మరో వంశం అధికారంలోకి వచ్చింది. హరిహరునికి వ్యతిరేకంగా ఉన్న

1. 'జిందారూద్' (ప్రథమ భాగం) హయాతె ఇక్బాల్ కాతష్కీలేదౌర్- జావేద్ ఇక్బాల్ పుట. 4.

మూసా ప్రవక్త, ఇంకా అతని యూదు అనుయాయులు ఈజిప్టునుండి వెళ్లి పోయారు. మూసా ప్రవక్త తన అనుయాయులతో పాలస్తైన్ వెళ్లిపోయాడు. హరిహర్ సంతానం అఫ్ఘనిస్తాన్ వైపుకు వెళ్లింది. అక్కడ హరి అనే నగరాన్ని నిర్మించారు. తరువాత అది 'హరాత్'గా ప్రసిద్ధి కెక్కింది. కొంతకాలం తరువాత వాళ్లు కాశ్మీరంవైపుకు వెళ్లారు. చివరకు భారతదేశంలో మైదానాల వైపుకు వచ్చి తమ పితరుల పేర్లతో ఒక కొత్త ఆరాధనా స్థలాన్ని నిర్మించి, దానికి 'హరిద్వార్' అని పేరు పెట్టారు. ఈ పరిశోధన ప్రకారం ఈ భూఖండంలోని కాశ్మీర బ్రాహ్మణులు జన్మతః ఈజిప్టువారు. ఇఖ్బాల్ కూడా ఒక కాశ్మీర బ్రాహ్మణుడు. అందుకే ఆయనకూడా ఈజిప్టువాడు. ఈ విధంగానే జవాహర్‌లాల్ నెహ్రూ. ఈ కొత్త అభిప్రాయానికి అనుగుణమైన చారిత్రక ఆధారం లేనందువల్ల వ్యాఖ్యానించడం సాధ్యంకాదు. మొత్తానికి ఇఖ్బాల్ కాశ్మీర బ్రాహ్మణుడు. ఆయన కవితలో (నన్ను చూడండి. ఎందుకంటే భారతదేశంలో బ్రాహ్మణుడై పుట్టికూడా రోందేశ రహస్యాలను ఎరిగి ఉన్నాడు.)

మరాబంగర్ కెదర్ హిందూస్తాన్ దీగర్ సమీబీని
బ్రహ్మన్ జాదయె రమ్జ అష్నాయె రూమ్‌ర తబ్రీజ్ అస్త్

(తాము ముస్లింలమని చెప్పుకుంటున్నవాళ్లు రాజకీయాల్లో తలదూర్చి మనసునూ మతాన్నీ పోగొట్టుకున్నారు. ఇప్పటివరకు ఈ బ్రాహ్మణులై పుట్టిన వారు తప్ప ఈ రహస్యం ఇంకెవ్వడూ చెప్పలేడు.)

మర్‌తమిర్జా బసియాసత్ దిల్‌వదీన్ బాఖ్తి అంస్
జుజ్‌బ్రహ్మన్ పస్రే మహ్రమె ఇస్రాడ్‌కుజాఅస్త్

# ఇఖ్బాల్ - పాకిస్తాన్

ఇఖ్బాల్ పాకిస్తాన్ సంస్థాపకులలో ఒకడు అన్న వివాదాన్ని గూర్చి చెప్పకపోతే ఇఖ్బాల్ పట్ల అన్యాయమే జరుగుతుంది. ఇటీవల ఇఖ్బాల్ వ్రాసిన కొన్ని ఉత్తరాలు బయటపడినవి. ఇండియన్ యూనియన్‌లో ఒక స్వతంత్ర రాష్ట్రం ఏర్పడాలని, అందులో పంజాబు, పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్రం, సింధ్, బిలోచిస్తాన్ ఉండాలని ఇఖ్బాల్ అభిప్రాయం అయినట్లు ఆ లేఖలు తెలుపుతున్నవి. 29 డిసంబరు 1930 లో అలహాబాదులో జరిగిన ముస్లింలీగ్ వార్షిక సభలో ఆయన ఇదే అభిప్రాయాన్ని వ్యక్తపరచాడు. ఆ కాలంలో **Edward Thompson** ఇఖ్బాల్ ఉపన్యాసాలను వ్యాఖ్యానిస్తూ **Observer** పత్రికలో ఇఖ్బాల్ అభిప్రాయాన్ని పాకిస్తాన్ సిద్ధాంతంగా పేర్కొని, ఈ సమస్యలో తికమకలు కల్పించాడు. తాంప్సన్‌కు ఇఖ్బాల్ ఇలా వ్రాశాడు: "మీరు నన్ను పాకిస్తాన్ సిద్ధాంతానికి అనుకూలుడుగా చిత్రించారు. కాని పాకిస్తాన్ నా లక్ష్యం కాదు. నేను నా అధ్యక్షోపన్యాసంలో చేసిన ప్రతిపాదన కేవలం ఒక ముస్లిం రాష్ట్రం ఏర్పడాలని. అంటే భారతదేశంలోని పశ్చిమోత్తర భాగంలో ముస్లిం ఆధిక్యత ఉన్న ప్రాంతాన్ని రాష్ట్రంగా ఏర్పరచాలని నా అభిప్రాయం. నా లక్ష్య ప్రకారం ఈ ప్రతిపాదన భారత ఫెడరేషన్‌లో ఏర్పడనున్న ముస్లిం రాష్ట్రం ఒక భాగం మాత్రమే. కాని పాకిస్తాన్ సిద్ధాంతంలో ముస్లిములకు నేరుగా ఇంగ్లండుతో సంబంధం ఉన్న ఒక ప్రత్యేక ఫెడరేషన్ ఏర్పడాలనేది పాకిస్తాన్ సిద్ధాంత లక్ష్యం. ఈ లక్ష్యం కేంబ్రిడ్జిలో పుట్టింది. రౌండుటేబుల్ కాన్ఫరెన్సులో పాల్గొన్న ముస్లిములు హిందువుల నామమాత్రపు జాతీయతకు ముస్లిం జాతిని బలి చేశారని ఈ సిద్ధాంత సృష్టికర్తల హృదయం". ఇక్కడ ఇఖ్బాల్ చౌధరీ రహమత్ అలీ 1935 లో వ్రాసిన **Pakistan the Fatherland of Pak Nation** అన్న గ్రంథాన్ని మనస్సులో పెట్టుకున్నారన్నది స్పష్టం. నిజానికి

ఇది కేవలం కల్పనపై ఆధారపడ్డ రాజకీయ కలహం. ఇందులో పాకిస్తాన్, బంగిస్తాన్, ఉస్మానిస్తాన్, సదీఖిస్తాన్, ఫారొకిస్తాన్, హైదరిస్తాన్, బిలోచిస్తాన్, సఫిస్తాన్, నసీరిస్తాన్ వగైరా వగైరా ఏర్పడాలన్నమాట వచ్చింది. భారతదేశం సమీపంలో ఉన్న సముద్రాలకు, ద్వీపాలకు కూడా కొత్త కొత్త పేర్లు పెట్టుకున్నారు. ఉస్మానియా సముద్రం, సఫియాసముద్రం, మేవేలా సాగరం, ప్రపంచ ద్వీపం, అమీన్ ద్వీపం వగైరా వగైరా. ఆ సమయంలో మహమ్మద్ అలీ జిన్నా, చౌదరీ అహమత్ అలీ పాకిస్తాన్ సిద్ధాంతాన్ని విమర్శించాడు. ఒక విధంగా అది Walt Disney Dreamland అనీ, హెచ్. జి. Wells కాబూన్ అన్నాడు.

ఈ అధ్యక్షోపన్యాసం ప్రథమ ప్రచురణ ఇఖ్బాల్ కుమారుడు డా. జావేద్ ఇఖ్బాల్ (పంజాబు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి - లాహోరు)కు కూడా పంపించారు. ఆయన కొంత వివరణం అడిగితే అది కూడా పంపించారు. ఆయన లేఖ, నా జవాబు ఈ వివాదాన్ని వివరించడానికి పనికివస్తాయి. కనుక ఈ రెండింటినీ ఇక్కడ పొందుపరుస్తాను.

హైకోర్టు - లాహోరు. డా. జావేద్ ఇఖ్బాల్
19-2-85 పంజాబు ప్రధాన న్యాయమూర్తి

ప్రియమైన సయ్యద్ ముజఫర్ హుసేన్‌బర్నీ గారికి,

మీరు మీ ప్రసంగం (ఇఖ్బాల్ - జాతీయ సమైక్యత) పాఠాన్ని పంపించినందుకు కృతజ్ఞుణ్ణి. నాకీ పాఠం హసన్‌ఖాన్‌గారి లేఖతో అందింది. ఈ కాగితాలను నాకు అలీ సర్దార్ జాఫర్‌గారు అందించారు. ఆయన నిన్న నన్ను కలుసుకోవడానికి వచ్చి చాలాసేపు ఉన్నారు. ఈ ప్రసంగపాఠం, దాని ఉర్దూ అనువాదం మహ్‌హోత్రాగారు నాకెంతకుముందే అందజేశారు. చాలా తృప్తితో మీ ప్రసంగ పాఠాన్ని చదివాను. 46 వ పుటలో మీరు, మహమ్మద్ అలీ జిన్నా కూడా రహమత్ అలీ పాకిస్తాన్ సిద్ధాంతాన్ని విమర్శించారని Walt Disney Dreamland అన్నారనీ, వేల్షన్ నైట్‌మేర్ అన్నారనీ తెలుపారు. రహమత్

అలీ పాకిస్తాన్ సిద్ధాంతం భారతదేశాన్ని ముక్కలుముక్కలుగా చేసే సిద్ధాంతం. ముస్లిం రాష్ట్రాలను విడదీసి ఒక ప్రత్యేక ఫెడరేషన్ ఏర్పాటు చెయ్యాలని కాదు. అందుకోసమే ఆయన పాకిస్తాన్ సిద్ధాంతాన్ని పలువురు ముస్లిం నాయకులు వ్యతిరేకించారు. వాళ్ళల్లో ఇఖ్బాల్ కూడా ఉన్నారు. కాని మీరు ఈ అంశాన్ని తెలుపలేదు. మహమ్మద్ అలీ జిన్నా రహమత్ అలి పాకిస్తాన్ సిద్ధాంతాన్ని **Walt Disney Dreamland** గా వెలేషన్ నైట్‌మేర్‌గా చిత్రించే సందర్భం తెలిపే పుస్తకాన్ని నాకు మీరు అందజేస్తే నాకు ఎంతో సంతోషం కలుగుతుంది. రహమత్ అలి పాకిస్తాన్ సిద్ధాంతాన్ని గూర్చి జిన్నా అన్నమాటలు ఇంతవరకు నా దృష్టికి రాలేదు.

మీరు క్షేమంగా ఉన్నారని నమ్ముతున్నాను. మీ ప్రత్యుత్తరం కోసం వేచిఉంటాను.

నమస్కారం
సౌజన్య పురస్సరంగా
మీ
సంతకం.
(జావేద్ ఇఖ్బాల్)

(ఇంగ్లీషు నుంచి అనువాదం)

25 మార్చి 1985

డాక్టర్ జావేద్ ఇఖ్బాల్ గారికి,

మీరు 19 ఫిబ్రవరి 85 వ రోజు వ్రాసిన ఉత్తరానికి కృతజ్ఞతలు. నా ప్రసంగపాఠం 'ఎఖ్బాల్-జాతీయ సమైక్యత' ను ప్రీతితో చదివారని తెలుసుకున్ని చాలా సంతోషించాను.

మహమ్మద్ ఆలీ జిన్నా, రహమత్ అలీ పాకిస్తాన్ సిద్ధాంతాన్ని విమర్శించిన సందర్భాన్ని గూర్చి మీరడిగిన ప్రశ్నకు సమాధానం. **Frank Mores** వ్రాసిన **Witmen Toam Era** లో 80 వ పుటను చూడవలసిందిగా కోరుతున్నాను. ఈ పుస్తకాన్ని **Vikas Publishing House** ప్రచురించింది. 1973 లో బ్రిటన్‌లో అచ్చు అయింది.

సందర్భం :- "నేను రహమత్ అలీ సంగతి ఎత్తినప్పుడల్లా జిన్నా కను బొమలు ఎగిరేసేవాడు. ఆయన రహమత్ అలీ పాకిస్తాన్ సిద్ధాంతాన్ని వెల్ఫేషన్ సైట్ మేర్ అనకపోయినా కనీసం Walt Disney Dreamland (మూర్ఖుల స్వర్గం) అనుకునేవాడు. ఇది తథ్యం. ఆయన కనుబొమలు ఎగుర వేయడం, ఒక నేర్పరి అయిన ఆటగాడు, ఒక పల్లెటూరి సైతును చూసినప్పుడు ప్రవర్తించినట్లు ఉంటుంది. తన ఒట్టువాళ్ళు లేకపోయినా ఆటను ప్రకటించే ఆటగాణ్ణి చూసినట్టుంటుంది. మీరు ఈ పుస్తకాన్ని సంపాదించడంలో కష్టం కలగవచ్చు. నేనీ పుస్తకంలోని 79, 80 పుటల్లోని అవసరమైన ఉద్ధరణలను ఈ లేఖతో జతపరచి పంపుతున్నాను. Frank Mores ఒక పత్రికా రచయిత అనీ, భారత విభజనకు పూర్వం ప్రథమశ్రేణికి చెందిన ఒక ఇంగ్లీషు దినపత్రికకు సంపాదకుడని మీకు తెలుసు. తన వృత్తిలో నిజాయితీ, బాధ్యతా నిర్వహణంతో సంభావితుడైన వ్యక్తిగా ఆయనకెంతో గౌరవం ఉండేది. అందుకే ఆయన కథనాలలోని యాథార్థ్యాన్ని శంకించడానికి వీలులేదు.

నేను మీ సూచనకు కృతజ్ఞుణ్ణి. నేనీ సందర్భాన్ని కూడా నా ప్రసంగ పాఠంతో జోడించి ఉంటే బాగుండేది. ఈ అవసరమైన సందర్భాలను మలి ప్రచురణలో చేరుస్తాను. త్వరలోనే అది వెలువడుతుంది.

మీరు సుఖసంతోషాలతో ఉన్నారని ఆశిస్తున్నాను.

శుభాకాంక్షలతో, సౌజన్యంతో
సంతకం

(ఇంగ్లీషునుంచి అనువాదం) (సయ్యద్ ముజఫర్ హుసేన్‌బర్నీ)

6 మార్చ్, 1934 నాడు కలకత్తాలోని రాగిబ్‌హసన్ పేర వ్రాసిన ఒక లేఖలో ఇఖ్బాల్ "ఈ లేఖతో Edward Thampson (ఇంగ్లండు ప్రసిద్ధ సాహిత్యవేత్త) నా పుస్తకంపై చేసిన సమీక్ష రెండు ప్రతులను జతపరచి పంపు తున్నాను. అనేకవిధాలా ఇది పఠనీయంగా ఉంది. మీరు మీ పత్రికలో ప్రచు

రించుకుంటారేమో! దయచేసి రెండవ ప్రతి 'Star of India' (Calcutta) కలకత్తాకు పంపించండి.

దయచేసి కొంచెం శ్రద్ధగా పరిశీలించండి. ఈ సమీక్షకుడు నా లక్ష్యాన్ని పాకిస్తాన్ సిద్ధాంతంతో ముడివేసి తికమక పెట్టాడు. నేను ఫెడరేషన్‌లో ఒక ముస్లిం రాష్ట్రం ఏర్పడాలనుకుంటున్నాను. మరి పాకిస్తాన్ సిద్ధాంతం పశ్చిమోత్తర భారతదేశంలోని ముస్లిం రాష్ట్రాల ప్రత్యేక ఫెడరేషన్. ఇంగ్లండుతో నేరుగా సంబంధం ఉండే ఫెడరేషన్. పరిచయ వాక్యాలలో ఈ అంశాన్ని వివరించడం మరవకండి. 'Star of India' సంపాదకునికికూడా ఈ అంశం గురించి చెప్పండి.

రాగిబ్ హసన్ ఆనాడు ఒక ప్రసిద్ధ వ్యక్తి. ఆల్ ఇండియా యూత్ ముస్లింలీగ్, ఆల్ ఇండియా జమీయతుల్ ఉలమాయె ఇస్లాం సంస్థాపకుడు. ఈ ఉత్తరాన్ని వెలికితీసి మొదటిసారిగా ఇఖ్బాల్ 'జహాఁ దీగర్' అన్న పుస్తకంలో ప్రచురించాడు. ఇటీవలనే అది పాకిస్తాన్‌లో వెలువడింది.

పండిత్ జవాహర్‌లాల్ నెహ్రూ కూడా ఇఖ్బాల్ పాకిస్తాన్ సిద్ధాంతానికి మూలపురుషుడనే అంశాన్ని ఖండించారు. తన Discovery of India లో ఇలా వ్రాశారు : "తొలి దశలో పాకిస్తాన్‌ను కోరిన వాళ్ళల్లో ఇఖ్బాల్ కూడా ఒకరు. కాని ఈ సిద్ధాంతంలో నిక్షిప్తమైన ప్రమాదాన్నీ, అనౌచిత్యాన్నీ ఆయన బాగా అవగాహన చేసుకున్నట్టు తోస్తుంది. ఒక గోష్ఠి సందర్భంగా ఇఖ్బాల్ ఆల్ ఇండియా ముస్లింలీగ్ సభకు అధ్యక్షత వహించిన సందర్భంగా అలా అన్నారేకాని, భారతదేశానికి ప్రత్యేకించి ముస్లిములకు దీనివల్ల నష్టమవుతుందని ఆయనకు తెలుసు. ఆయన తన అభిప్రాయాన్ని మార్చుకున్నారేమో! ఈ విషయంపై ఆయన అంతగా ఆలోచించలేదు. ఎందుకంటే, దీనికి అప్పట్లో అంత ప్రాముఖ్యంలేదు. ఆయన సంపూర్ణ జీవిత దృక్పథం పాకిస్తాన్ సిద్ధాంతానికి లేక భారత విభజన తరువాత కలిగే పరిణామాలకు సంబంధం లేదు. తన మరణం కంటే కొన్ని మాసాలక్రితం ఆయన మరణశయ్యపై ఉన్నప్పుడు నన్ను పిలిచారు.

నేను చాలా సంతోషంతో ఆయన ఆహ్వానాన్ని అంగీకరించాను. ఆయనతో చాలా సమస్యలపై సంభాషణ జరిగింది. అప్పుడు నాకు తోచింది. ఎన్ని విభేదాలున్నా అనేక భావాల్లో మాకు సాన్నిహిత్యముందని. ఈ సమస్యల్లో ఈయనతో కలిసి పనిచేయడం ఎంత సులభమో! ఆయన ఏదో జ్ఞాపకం చేసుకోవాలనుకున్నాడు. ఒక విషయం నుంచి మరొక విషయానికి పయనిస్తున్నాడు. నేను అంటున్నవి వింటున్నానే కాని నేను తక్కువగానే మాట్లాడాను. నేను ఆయననూ, ఆయన కవిత్వాన్నీ ప్రశంసించాను. నేనంటే ఆయనకెంతో ఇష్టమని తెలుసుకున్నప్పుడు నాకెంతో సంతోషం కలిగింది. నా గురించి ఆయనకు మంచి అభిప్రాయమేవుంది. నేను సెలవు తీసుకునేముందు ఆయన నాతో ఇలా అన్నారు : "మీకూ జిన్నాకు పోలిక ఎక్కడిది? అతడొక రాజకీయవేత్త. మీరు దేశభక్తులు."*

ఆల్ అహమద్ సరూర్ కథన ప్రకారం, ఇఖ్బాల్ 1937 లో పాక్ సిద్ధాంతాన్ని గూర్చి తనకున్న అభిప్రాయాన్ని మార్చుకున్నాడు. ఆయన మే 28, 1937 లో మహమ్మద్ అలీ జిన్నాకు ఒక లేఖ వ్రాశాడు. "ముస్లిం భారత దేశానికి, వాళ్ళ సమస్యల పరిష్కారానికి దేశాన్ని తిరిగి విభజించాలని. ముస్లింల ఆధిక్యత ఒకటి రెండు రాష్ట్రాలను ఏర్పాటు చేయాలి."

తరువాత మహమ్మద్ అలీ జిన్నా పేర 21 జూన్ 1937 లో మరొక లేఖలో ఒక అడుగు ముందుకు వేసి "ముస్లిం రాష్ట్రాలకు సంబంధించిన నా ప్రతిపాదనల వెలుగులో ఒక ప్రత్యేక ఫెడరేషనే ఏకైక పరిష్కారం. దాని ద్వారా మన భారతదేశాన్ని శాంతియుతంగా ఉంచగలము. ముస్లిమేతరుల ప్రాబల్యం నుంచి తప్పించగలము. పశ్చిమోత్తర భారతదేశం, బెంగాల్ ముస్లింలు ఒక జాతిగా ఎందుకు పరిగణింపబడకూడదు? భారత దేశానికి వెలుపల ఇతర జాతులున్నట్లే వీళ్ళకు కూడా స్వాతంత్ర్యం ఉంది."

ఆల్ అహమద్ సరూర్, ఇఖ్బాల్ మొదటి సారిగా ప్రత్యేక ఫెడరేషన్ కోసం ఈ లేఖలో ప్రస్తావించాడని అంటున్నారు. ఇఖ్బాల్ 'పాకిస్తాన్' అనే

---

* నాల్గవ ప్రచురణ - లండన్ 1956 పుట. 354-355.

శబ్దాన్ని ఉపయోగించకపోయినా, 1937 లో తన మరణానికంటే ఒక సంవత్సరం ముందే ఆయన రెండు ప్రత్యేక ముస్లిం రాష్ట్రాల ఏర్పాటుకు ప్రతిపాదన చేశాడు. ఒకటి పశ్చిమోత్తర భారతదేశంలో (2) తూర్పు భారతదేశంలో. థాంప్సన్ జ్ఞాపకశక్తి ఆయననే మోసం చేసిందేమో అంటాడు ఆల్ అహమద్ సరూర్.

ఇఖ్బాల్ లేఖల నుంచి సర్వర్‌గారు తీసిన అర్థం ఇఖ్బాల్ ఆలోచనా విధానానికి పూర్తిగా విరుద్ధమని నా అభిప్రాయం. ఇఖ్బాల్, చౌదరీ రహమత్ అలీ పాకిస్తాన్ సిద్ధాంతాన్ని సముచితం కాదనుకున్నారు. థాంప్సన్ అభిప్రాయాలను కూడా ఖండించాడు. ఇది మనం ఇంతవరకే తెలుసుకున్నాము. ఇక ఇప్పుడు ఆలోచించవలసిన విషయం. ఈ లేఖలో కూడా పశ్చిమోత్తర భారతదేశం, బెంగాల్ రాష్ట్రాలు స్వతంత్ర రాష్ట్రాలుగా ఉండాలనే కోరుతున్నారు. మరి భారత ఫెడరేషన్‌లో కలిసి ఉండాలనీ, "భారత దేశంలో ఇతర జాతులవలె" అన్న మాటలు ఉపయోగించకుండా ఉండేవారు. భారతదేశంలో ఇతర జాతులు ఏవి? ఇది ఇప్పుడు చూడవలసి ఉంది. జాతులు అంటే భారతదేశంలో సంస్థానాలు, రాష్ట్రాలూ అనుకుంటే ఇదే మాట ఇఖ్బాల్ హృదయంలో కూడా ఉండింది. స్వయంగా ఆల్ ఇండియా ముస్లింలీగ్ కూడా 1942 లో ఇఖ్బాల్ మరణం తరువాత రెండేళ్ళకు అధికారంగా, స్పష్టంగా పాకిస్తాన్ ఒక ప్రత్యేక రాజ్యంగా ఏర్పడాలని డిమాండ్ చేశారు. దీనితో ఇఖ్బాల్‌ను గూర్చిన అనుమానాలు పూర్తిగా సమసి పోవాలె. ఇది మాత్రం స్పష్టం. పాకిస్తాన్ ఇప్పుడు ఏ రూపంలో అవతరించిందో, ఆ రూపానికి ఇఖ్బాల్ పూర్తిగా వ్యతిరేకి.

# ఇఖ్బాల్ - హైదరాబాద్

ఢిల్లీ, లఖ్నోల పతనం తరువాత హైదరాబాద్ ఉరుదూ కవితకూ, సాహిత్యానికీ కేంద్రంగా రూపొందింది. మౌల్వీ చిరాగ్అలీ, మొహిసినుల్ముల్క్, విఖారుల్ముల్క్, మౌలానాహాలీ, మౌలానాషిబ్లీనేమానీ వంటి ప్రముఖులు ఉద్యోగాన్వేషణలో ఉన్నప్పుడు హైదరాబాదు వారిని ఆకర్షించింది. నవాబ్ మిర్జా దాగ్ దెహెల్వీ హైదరాబాదులోనే ఫసీహుల్ముల్క్ బిరుదు నందుకున్నాడు. అప్పటి నిజాంకు కవితా గురువైనాడు. తొలి దశలో ఇఖ్బాల్ కూడా దాగ్ దెహెల్వీతో కవితా సమాలోచనం చేశారు. ఒక రచయిత అన్నట్టు ఇఖ్బాల్ హైదరాబాద్ పరిజ్ఞాని; మరి హైదరాబాద్ ఇఖ్బాల్ పరిజ్ఞాని. ఇఖ్బాల్కు కూడా హైదరాబాదంటే అభిరుచి ఉండేది. ఆకర్షణ ఉండేది.

ఇఖ్బాల్ తొలిసారి 1910లో హైదరాబాదును దర్శించారు. ఆయన యూరోపా నుంచి తిరిగివచ్చి, మంచి ఉద్యోగంకోసం అన్వేషణ సాగిస్తున్న రోజులవి. హైదరాబాదులో కొందరు సాహిత్యపోషకులు, విద్యాసక్తులైన మహాశయులు మహారాజా కిషన్ప్రసాద్, సర్ అక్బర్ హైదరీ ప్రభృతులతో ఆయనకు పరోక్ష పరిచయం ఉండేది. ఇఖ్బాల్ మిత్రులు మౌలానా గులాం ఖాదర్ గిరామీ నిజాం అభిమాన కవి. ఆయన లేఖలవల్ల హైదరాబాద్లో కవులకు గౌరవ మర్యాదలు అమితంగా ఉన్నాయని ఇఖ్బాల్ తెలుసుకోగలిగారు. అందుకే ఇఖ్బాల్ హైదరాబాద్ సందర్శనం నిష్కారణం కానేకాదు.

అతియాఫైజీ తన గ్రంథం 'ఇఖ్బాల్' లో, ఇఖ్బాల్ హైదరాబాద్కు ప్రయాణమయ్యేముందు, తనకు ఆత్మీయుడూ, నిజాం ఆర్థికశాఖా కార్యదర్శి అయిన సర్ అక్బర్ హైదరీ కి ఒక పరిచయ పత్రం తననుంచి తీసుకుపోయారని వ్రాశారు. ఇఖ్బాల్ అతియాఫైజీ కి జనవరి 30, 1910 నాటి లేఖలో :

"అక్బర్ హైదరీని లేడీ హైదరీని కలుసుకోవడమే నా ప్రయాణోద్దేశం కాదు. వారిని మీరు ఎరుగరేమో! హైదరాబాదులో కలుసుకోకముందు వారిని తెలుసుకునే అదృష్టం నాకు లేకపోయింది. వారి సాన్నిధ్యం నాకెంతో హాయిని గూర్చింది."

ఏ పరిచయ పత్రం లేకుండానే ఆయన సర్ అక్బర్ హైదరీని కలుసుకున్నారన్న సంగతి ఈ లేఖ స్పష్టపరుస్తున్నది.

హైదరాబాద్‌లో బసచేసినప్పుడు అక్బర్ హైదరీ ఇఖ్బాల్‌ను ఎంతో ఆదరించాడు. హైదరాబాద్ ప్రముఖ కవులతో, రచయితలతో, సాహిత్యవేత్తలతో పరిచయం చేశాడు.కవుల్లో ముఖ్యంగా పేర్కొనదగినవారు 'నజమ్' తబాతబాయి. ఆయన వ్రాసిన భగవత్ప్రశంసా పరమైన ఖసీదా విని ఇఖ్బాల్ చాలా ప్రభావితులై అదే ఛందంలో మహారాజా కిషన్‌ప్రసాద్ వైభవాన్ని ఒక ప్రశంసా గీతం 'షక్రియా' (కృతజ్ఞత)గా వ్రాశారు. అది ముజల్లా ఉస్మానియా[1] మహారాజా నెంబర్‌లో ముద్రితమైంది. సయ్యద్ అబ్దుల్వాహెద్ మైమని కథనం ప్రకారం, ఆ గీతంలో 38 షేర్లు ఉండేవి[2] కాని జనాబ్ నజీర్ హైదరాబాద్ 39 షేర్లను పేర్కొన్నాడు. ఈ గీతంలో 9 షేర్లు తరువాత 'నమూదె సుబాహ్' (ఉషో దర్శనం) శీర్షికతో 'బాంగెదిరా' అనే కవితా సంకలనంలో ముద్రణ పొందినవి.

(మిస్రా అంటే పద్య పాదం. రెండు మిస్రాలు కలిస్తే ఒక షేర్ అవుతుంది. 'షేర్' ఏకవచనం. 'అషార్' బహువచనం).

అబ్దుల్ రవూఫ్ ఉరూజ్ తన రచన[3] లో 'బాంగెదిరా' లో ఉన్న ఈ గీతం శీర్షిక 'తూలూఎసుబాహ్' (ఉషోదయం) అని వ్రాశాడు. ఇది సరికాదు.

మహారాజా కిషన్ ప్రసాద్'షాద్' ఇఖ్బాల్ పట్ల ప్రదర్శించిన సౌజన్యాన్నీ, సన్నిహిత సంబంధాలనూ ఉట్టంకించకపోతే, హైదరాబాదుకూ ఇఖ్బాల్‌కూ ఉన్న

---

1. ఇఖ్బాల్ ఔర్ హైదరాబాద్-నజీర్ హైదరాబాద్. పుట. 201.
2. ఇఖ్బాల్ ఔర్ హైదరాబాద్-నజీర్ హైదరాబాద్. పుట.201,202,203.
3. ఇఖ్బాల్ ఔర్ బజ్మె ఇఖ్బాల్ హైదరాబాద్ దకన్. పుట 22.

సంబంధాల కథనం అసమగ్రంగానే ఉండిపోతుంది. కిషన్ ప్రసాద్ వ్యక్తిత్వం హిందూ ముస్లిం సంస్కృతులకు సజీవ ప్రతీక. ఉరుదూ ఫారసీ భాషల్లో ఆయన కవి. ఉన్నత స్థాయికి చెందిన కవిత చెప్పేవారు. **ఇఖ్బాల్‌కు సంబంధించిన కొన్ని ముఖ్య విషయాల్లో** ఆయన **ఆంతరంగమిత్రుడు, సలహాదారుడుకూడా.** ఇఖ్బాల్ 'షాద్' పేర వ్రాసిన లేఖల్లో ఈ అంశాన్ని అవగతం చేసుకునేందుకు సూచనలు గూడా ఉన్నవి. తన కవితలపై మహారాజా అభిప్రాయాన్ని ప్రకటిస్తే ఇఖ్బాల్ సంతోషించేవారు. ఇఖ్బాల్ మహారాజాపై వ్రాసిన ప్రశంసా గీతంలో కొన్ని పంక్తులు-

అగర్ చెఖుద్రత్‌నె ముఝె అఫ్సర్ద దిల్ పైదకియా
ఆంఖ్‌వో బక్షీహై కెహై నజా ఆషోయ్‌బహార్
ఇత్నె దిన్ గాయబ్ రహా తు గుల్షనె పంజాబ్‌మెం
కర్‌లియాథా క్యాకిస్ సయ్యాద్‌నే తుఝ్‌కో షికార్?
కిస్ తజల్లీగాహ్‌నె ఖీంచా తెరామానెదిల్
తెరీ ముష్తెఖాకెనె కిస్ దేస్‌మె పాయా ఖరార్
క్యాకహుం ఇస్ బోస్తానె గైరత్ ఫిర్ దోస్‌కి
జిస్‌కె ఫూలోంమె హవా అయ్‌హంసవా మేరా గుజార్
ఇస్‌కి తక్‌రీరోంసె రంగీం గుల్సితానె షాయిరీ
ఇస్‌కి తహరీరోంసె నజ్మెమమ్లెకత్‌కా ఇస్తెసార్
లైలయె మానెక మెహమిల్ ఇస్కి నసర్ దిల్పజీర్
నజమ్ ఇస్కీ షాహెదేరాజే అజల్ కి పర్ద దార్
సిల్సిలా ఇస్కీ మురవ్వత్‌కా యూంహీ లా ఇంతెహా
జిస్ తరహ్ సాహెల్‌సె అర్ యె బహరెనా పైదా కినార్
దిల్రుబా ఇస్కా తకల్లుం ఖల్ఖ్ ఇస్కా ఇత్రెగుల్
గుంచ దిల్‌కెలియే మోజెనఫ్సె బాదెబహార్
హోఖతాకారీకదర్ ఐసే ముదబ్బిర్‌కోకహాం
జిస్‌పర్ హర్ తద్బీర్ కీతక్దీర్ హో ఆయినాదార్

హైయహాఁ షానె ఇమారత్ పర్దదార్ షానెఫఖర్
ఫిరఖ దర్వే షీకాహై జెరెఖబాయె జర్నిగార్
ఖాక్సారీ జోహర్ అయినా ఒ అజ్మత్ బనీ
దస్తె వఖఫ్ కార్ఫర్మాయి వదిల్ మగ్రసూ ఫెయార్

షుక్రియా అహెసాన్కా అయ్ ఇఖ్బాల్ జిందాముఝే
మద్దాహ్ హైరాయి అమీరోఁకినహీఁయె అషార్.

(నేను మనకమనసుతో పుట్టితేనేమి- వసంతశోభను చూడగలిగే కన్నులు నావి. పంజాబు ఉద్యానంలో ఇన్నాళ్లుదాగున్నావు. ఏ వేటగాని వలలోనైన చిక్కు-కున్నావా? ఏ కాంతి పుంజం నీ హృదయాన్ని ఆకర్షించింది? పిడికెడు మట్టికి ఎక్కడ స్వస్థత చేకూరింది? స్వర్గంలో సుందరోద్యానంలో పూలల్లో గడిచిన నా బ్రతుకును గూర్చి ఏమి చెప్పమందువు చెలికాడా? ఆయన రచనలు **రాజ్య క్రమానికి** ఆధారమైనవి. ఆయన వచనం సుందరార్థవిలసితం. అతని కవిత మృత్యురహస్యానికి అవకుంఠనం (అమృతత్వాభాసను కలిగిస్తుందని భావం.) ఆయన సౌజన్యం తీరంలేని సముద్రంలా అనంతం. వాక్కు మనోజ్ఞం. సౌజన్యం సౌరభం మనఃప్రసూనానికి అది ఆమనితెమ్మెర. అతడు వినయకోవిదుడు,దోషభయ మతనికెక్కడిది! అతడవలంబించిన ప్రతి నీతికి సాఫల్యం అద్దం పట్టుతుంది. ఇక్కడ ధనవైభవం వైరాగ్యవైభవానికి వేసిన యవనిక. విరాగులదేజాతి. ఎంత ధనమున్నా అది గౌణం. సేవావృత్తి గొప్పతనానికి దర్పణమైనది. చేయి దానం చేస్తుంది. చేతం భగవద్ధ్యానం చేస్తుంది. ఇఖ్బాల్! ఉపకారం చేసినందుకు ధన్య వాదం పలుకడం ధర్మం నాకు. ధనికులను కీర్తించడం నా అభిమతం కాదు.)

ఇఖ్బాల్ మౌలానా గిరామీని కూడా కలిశారు. హాఫిజ్ జలీల్హసన్ జలీల్ థాగ్ మరణం తరువాత నిజాం గురువుగా నియుక్తులైనారు. ఆయన ఇఖ్బాల్ గౌరవార్థం విందు చేశారు. అందులో ప్రముఖ సాహిత్యవేత్తలు పాల్గొన్నారు. ఆ **విందులోనే ఇఖ్బాల్కు బాల్యంలో విద్య** గరపిన మౌలానా

జహీర్ దహెల్వీ దర్శనమైనది. ఇఖ్బాల్ ప్రార్థనను అంగీకరించి ఆయన కొన్ని కవితలు ప్రసాదించారు. వాటిలో ఒకటి-

వొ ఝూటా ఇష్క్ హై జిస్‌మెం ఫుగాం హొ
వొ కచ్చీ ఆగ్ హై జిస్‌మె ధువాం హొ

(అరుపులు ఉంటే అచ్చమైన ప్రణయం కాదు. పొగలు ఉంటే అచ్చమైన అనలం కాదు.)

ఈ యాత్రలో ఇఖ్బాల్ గోలకొండ సుల్తానుల సమాధులను దర్శించారు. "నిశ్శబ్దనిశీధం, మబ్బు పట్టిన ప్రకృతి, మేఘాలు వడబోసిన వెన్నెల" ఇఖ్బాల్‌ను ఎంతో ప్రభావితం చేసినవి. హైదరాబాద్ నుంచి రాగానే ఆ కమనీయ దృశ్యం ఆయన కలంనుంచి "గోరిస్తాన్‌నెషాహి" (రాజుల శ్మశానవాటి) అనే గీతం శీర్షికతో వెలువడింది. అది 'మెక్జన్' (జూన్ 1910)లో ప్రచురితమైంది. ఈ గీతం "బాంగెదిరా" మూడవభాగంలో ఉంది. ఈ గీతంలోని కొన్ని పంక్తులను చిత్తగించండి.

ఆస్మాం బాదల్ కాపహనే కరకయే దేరీన హై
కుఛ్ ముకద్దర్‌సాజబీనె మాహ్‌కా ఆయినా హై
చాంద్‌నీ ఫీకీ హై ఇస్‌నజారయే ఖామూష్ మెం
సుబహ్ సాదిక్ సోరహీ హై రాత్‌కి ఆగోష్‌మెం
కిస్ ఖదర్ అష్జార్‌కి హైరత్ ఫిజా హై ఖాషి
బర్‌బతె ఖుద్రత్‌కి ధీమీసీ నవా హై కాషి
బాతిన్ హర్‌జర్రయె ఆలంసరాపదర్ద్ హై
ఔర్ ఖామూషీలబెహ స్తీపె ఆహెసర్ద్ హై
ఆహ్! జోలానిగాహ్ ఆలంగీర్ యానెవోహిసార్
దోష్‌పర్ అప్నె ఉఠాయె సైక్‌డోం సదియోం‌కాభార్
జిందగీ సెథా కభీ మామూర్ అబ్‌సున్సాన్ హై
యె ఖమూషీ ఇస్కెహంగామోంకా గోరిస్తాన్ హై

అప్నె సుక్కూనెకొహన్‌కి ఖాక్‌కావిల్ దాదాహై
కోహ్‌కె సర్‌పర్ మిసాలె పాస్బాఁ ఇస్తాదాహై
అబర్‌కె ఔజన్‌సె వొబాలాయె బామె ఆస్మాఁ
నాజిర్ ఆలంహై నజ్మెసబ్జ్‌ఫామె ఆస్మాఁ
ఖాక్బాజి వసతె దున్యా కాహై మంజర్ ఇసె
దాస్తాఁ నాకామియె ఇన్సాఁకిహై అజ్‌బర్ ఇసె
హై అజల్‌సె ఎ ముసాఫిర్ సోయె మంజిల్ జారహా
ఆస్మాఁసే ఇన్కలాబోఁకా తమాషా దేఖ్తా
గో సుకూఁ ముమ్కిన్ నహీఁ ఆలంమె అఖ్తర్ కె లియే
పాతయ్‌ఖానీకో ఎద్దైరాహై దంభర్ కెలియే
రంగ్ ఆబ్ జిందగిసే గుల్‌బదామన్‌హై జమీఁ
సైక్‌డోఁ ఖూఁగుష్తతహజీబోఁ కామక్‌ఫన్‌హై సమీఁ
సోతేహైఁ ఖామూష్ ఆబాదీకే హంగామోఁసెదూర్
ముజతరిబ్ రక్తిథీ జిన్‌కో ఆర్జూయె నాసుబూర్
ఖబర్‌కి జుల్మత్ మెహైఇన్ ఆఫ్తాబోఁకిచమక్
జిన్‌కె దరవాజోఁపె రహతాథా జబీఁగుస్తర్‌ఫలక్
క్యాయహీహై ఇన్ షహన్‌షాహోఁకి అజ్మత్‌కామాల్
జిన్‌కెతద్బీ రెజహాఁబానీసె డర్తాథా జవాల్
రైబె షాఫూరీహో దున్యాయెఁ కెషాన్ ఖైసరీ
టల్ నహీసక్తీ గనీమె మౌత్‌కీ యూరిష్ కభీ.
బాదుషాహోఁకి భీకుష్తె ఉమర్‌కా హాసిల్‌హై గోర్
జాదయ్ అజ్మత్‌కి గోయా ఆఖ్రీమంజిల్ హైగోర్
షోరీషె బజ్మెతర్బ్ క్యా ఊద్‌కి తక్రీర్ క్యా
దర్ద్ మందానె జహాఁకా నాలయ్ షగీర్ క్యా
అర్సయె పయ్‌కార్ మె హంగామె షంషీర్ క్యా
ఖూన్‌కో గర్మానే వాలా నారా తక్బీర్ క్యా

అబ్ కోయి ఆవాజ్ సోతోఁకొ జగాసక్తీ నహీఁ
సీనయ్ పీరాఁ మె జానెరఫ్తా ఆసక్తీ నహీఁ
రూహె ముష్ఖాక్ మె జహమత్కషెబేదాద్ హై
కూచయ్ గర్దనె హువా జిస్ దంనఫ్స్ ఫర్యాద్ హై
జిందగీ ఇన్సాకి హై మానిందె ముర్గె ఖుష్నవా
షాఖ్ పర్ బైఠా కోయి దం, చహ్ చహాయా ఉడ్‌గయా
ఆహ్! క్యా ఆయే రియాజే దహర్ మె హం క్యా గయే
జిందగీకీ షాఖ్ సే ఫూటే ఖిలె ముర్ఝాగయే
మౌత్ హర్ షావొ గదాకె ఖాబ్‌కీ తాబీర్ హై
ఉస్ సితంగర్‌కా సితం ఇన్సాఫ్‌కీ తస్వీర్ హై
సిల్సిలా హస్తికాహై ఎక్ బహరె నాపైదాకినార్
ఔర్ ఇస్ దర్యాయె బేపాపాయాఁకి మోజేఁ హై మజార్
అయ్ హవస్ ఖూఁరోకెహై ఎ జిందగీ బె ఎతెబార్
ఏషరారెకా తబస్సుం ఏఖసె ఆతిష్ సవార్
ఏఖమర్ జో నాజిమె ఆలంకా ఎక్ ఏజాజ్ హై
పహనె సోనేకి ఖబా మహ్వెఖిరామె నాజ్ హై
చరఖె బే అంజుం కి దహషత్నాక్ వసత్ మె మగర్
బేకసీ ఇస్కి కోయి దేఖె జరా వఖ్తె సహర్
ఎక్ జరాసా అబర్‌కా టుక్డాహై జో మహతాబ్ థా
ఆఖ్రీ ఆఁసూఁ టపక్ జానేమెహో జిస్ కీఫనా.

(జలదవసనాలవెప్పటివో వేసుకున్నది ఆకాశం. జాబిల్లి నుదురు అద్దం మసకగా ఉంది.

ఈ మౌన దృశ్యంలో వెన్నెల మసక మసకగా ఉన్నది. రేయి ఒడిలో ఉదయం నిద్రిస్తున్నది. ప్రకృతి మంద్రంగా ధ్వనిస్తున్నది. సృష్టిలోని ప్రత్యణువు ఆపాదమస్తకం గుప్తబాధ ననుభవిస్తున్నది. సృష్టి పెదవులు మౌనంగా

ఉన్నవి. ఉద్విగ్నత చల్లబారింది. ప్రపంచ దృగంచలాలైన ఆ పర్వతాలు తమ భుజస్కంధాలపై శతాబ్దాల భారాన్ని మోస్తున్నాయి. ఒకనాడు సజీవంగా కల కలలాడింది. ఇప్పుడు నిర్మానుష్యం. ఈ నైశ్శబ్ద్యం దీని తొదల సమాధి. తన పూర్వజుల మృత్తిక అంటే ఎంత ఆసక్తి దీనికి? కొండ నెత్తి మీద కాపలా కాస్తున్న వానిలా నిలిచి ఉంది. మేఘాచ్ఛన్నమైన ఆకాశం ప్రపంచాన్ని చూస్తున్నది పచ్చని నక్షత్రంలా. విశాల ప్రపంచంతో ఆడుకోవాలనుకుంటున్నది. మానవుని వైఫల్యాల కథ దీనికి కంఠస్థం. మృత్యువు గమ్యంగా ఉన్న ఈ బాట సారి నిద్రిస్తున్నాడు. నింగి నుంచి విప్లవాల చమత్కారాలు చూస్తూపోతున్నాడు. సృష్టిలో గ్రహ తారకలకు విశ్రాంతి లేదు. అయినా క్షణకాలం ప్రార్థన కోసం నిలిచి ఉన్నవి. సర్వసంపద్వైభవోపేతం ఈ భూమి. వందలాది నాగరికతల సమాధి ఈ భూమి. జనావాసాల అలజడులకు దూరంగా పడుకొని ఉన్నాయి. తీరని కోరికలు వాటి చిత్తశాంతిని. ఎంతగా చీకాకు పరచాయో? సమాధితమస్సుల్లో ఆ సూర్యుల కాంతులు. ఆకాశమే తన ఫాలాన్ని వంచి వార్కి ద్వారాలను స్పృశించేది. ఇదేనా ఆ రాజుల వైభవ సర్వస్వం? వాళ్ళ రాజనీతికి పతనమే భయపడుతూ ఉండేది కదా! షాపోర్ దర్పం కానీ, ఖైసర్ వైభవం కానీ, మృత్యువు దాడిని ఎదిరించలేదు. రాజులు కూడా ఎంత కాలం బ్రతికినా చేరుకోవలసింది సమాధికే. వైభవ పథానికి చివరి గమ్యం సమాధేనేమో! అలజడులేమి! దోపిడీలేమి? లోకంలో బాధాతాడితుల ఆర్తనాదాలేమి! యుద్ధాంలో ఖడ్గోత్పాతాలేమి? రక్తాన్ని ఉడుకెత్తించే నినాదాలేమి? ఇప్పుడే చప్పుడు నిద్రితుల మేల్కొలుపలేదు. వట్టిపోయిన హృదయంలో చైతన్యం తరగలెత్తదు. పికికెడు మట్టిలోని చైతన్యానికి ప్రశంస లేదు. మానవ జీవితం మధురగళమున్న పక్షివంటిది. కొమ్మపైన కూర్చుంటుంది. కూస్తుంది. ఎగిరిపోతుంది. ఈ కష్ట ప్రపంచంలో మా రాక ఏది? మా పోక ఏది? బ్రతుకు కొమ్మ నుంచి పుట్టుకొచ్చాము. వికసించినాము. వాడిపోయినాము. మృత్యువు ప్రతి రాజుకు, ప్రతి పేదకు స్వప్నాకృతి. ఆ దుర్విధి దౌర్జన్యం, న్యాయ స్వరూపం. సృష్టిక్రమం ఒక తీరం లేని అనంత సాగరం. అడుగులులేని ఈ నదీ తరంగాలే సమాధులు. లోభమా! రక్తరూపమా! ఈ బ్రతుకునమ్మరానిది. ఇది విషధర

హాసేరం. అనలజ్వాలాపరీవృతం. జాబిల్లి సృష్టికర్త వరప్రసాదం. బంగారు దుస్తులు కట్టుకుని విలాసంగా నడుస్తున్నాడు. ఉషోవేళలో చూడాలె ఇతని విశ శత్వాన్ని. ఒకప్పుడు జాబిల్లి ఇప్పడొక చిన్న మబ్బుతునక. అదృశ్యమైతే చివర్తి కన్నీటిబొట్టు రాలుతుంది.

ఇఖ్బాల్‌కు తొలిసారిగా హైదరాబాదు వచ్చినప్పుడు నిజామెదక్ఖాన్ మీర్ మహబూబ్ అలీఖాన్ దర్శనం కాలేదు. అతియాఫైజీ 30 మార్చి 1910నాటి లేఖలో ఈ విషయాన్ని కూడా తెలిపారు. 1

"నేనింకా కొన్నిరోజులపాటు హైదరాబాదులో ఉంటే అలాహజ్రత్ హుజూర్ నిజాం దర్శనం లభించిఉండేది. నా హైదరాబాదు యాత్రకు ప్రయోజనం లేకపో లేదు. మిగతా సమక్షంలో మనవి చేసుకుంటాను"

హైదరాబాదునుంచి తిరుగుప్రయాణంలో ఔరంగాబాదుమీదుగా పోవాలని ఇఖ్బాల్‌కోరిక. అక్కడ ఔరంగజేబ్ ఆలంగీర్ సమాధిని దర్శించాలనుకున్నారు. సర్ అక్బర్ హైదరీ ఆయన కోరికను మన్నిస్తూ ఔరంగాబాదులో ఆయనకుబస ఏర్పాట్లుకూడా చేశాడు. ఇఖ్బాల్ 23 మార్చి 1910 హైదరాబాదునుంచి లాహో రుకు బయలుదేరినారు. రెండురోజులు ఔరంగాబాదులో ఆగి ఆలంగీర్ సమాధిని సందర్శించారు. ఇఖ్బాల్ అన్నగారు షేక్ అతామహమ్మద్ కూడా ఆయనవెంట ఉన్నారు. ఇఖ్బాల్ 28 మార్చి 1910 నాడు లాహోర్ చేరుకున్నారు.

ఇఖ్బాల్ రెండవసారి 1929లో హైదరాబాదుకు వచ్చారు. జనవరి 14, 1929న హైదరాబాదుకు చేరుకున్నారు. ఈసారి ఆయన ఉస్మానియా విశ్వవిద్యా లయంలో తత్త్వశాస్త్రంపై విస్తరణోపన్యాసా (Extention Lectures)ల కోసం ఆహూతులై హైదరాబాదు వచ్చారు. సికింద్రాబాదు స్టేషన్‌లో పుర ప్రముఖులు, అక్బర్ హైదరీ, డాక్టర్ ఖలీఫా అబ్దుల్ హకీం, మౌలానా అబ్దుల్లా ఇమాది, డాక్టర్ ముజఫరుద్దీన్ ఖురేషీ, ఉస్మానియా విశ్వవిద్యాలయాధ్యాపకులు ఇఖ్బాల్‌కు స్వాగతం చెప్పి, పుష్పమాలలు సమర్పించారు. ఇంతకు ముందు

1. ఇఖ్బాల్‌నామా (రెండవభాగం) అతా ఉల్లా. పుట. 134.

'దిలాకుషా'లో ఆయనకు విడిది ఏర్పాటు చేశారు. కాని ఇప్పుడు ఆయన ప్రభుత్వ అతిథిగా రాజాతిథి గృహం 'వెల్లాచ్ వెస్టాల్'లో విడిది చేయాలని ఉస్మానియా విశ్వవిద్యాలయ రిజిస్ట్రారు ఇఖ్బాల్‌కు తెలియజేశారు.

ఇఖ్బాల్ 14 జనవరి నుంచి 18 జనవరి వరకు హైదరాబాదులో ఉన్నారు. 15 జనవరి 1929 నాడు పబ్లిక్ గార్డెన్ లెక్చర్ హాల్‌లో ప్రథమ ప్రసంగం చదివారు. ఆ సభకు మహారాజా కిషన్‌ప్రసాద్ అధ్యక్షత వహించారు. సభాసదుల్లో ఉస్మానియా విశ్వవిద్యాలయం అధ్యాపకులూ, విద్యార్థులూ ఉన్నారు. రాత్రి మహారాజా ఇంట్లో ఇఖ్బాల్ గౌరవార్థం సరసమైన విందు, కవిసమ్మేళనం జరిగింది. కవిసమ్మేళనంలో నజ్మ్ తబాతవాయి, నవాజ్ జియాయార్‌జంగ్ బహద్దుర్, నవాబ్ అజీజ్‌యార్ జంగ్ బహద్దుర్, జోష్‌మలేహ్ ఆబాదీ ప్రభృతులు తమ కవితలను వినిపించారు. ఇఖ్బాల్ ఈ సభలో తాను ఏ కవితా, ఏ గీతం వినిపించనని ముందే ప్రకటించారు. కాని సరసులైన అతిథులు ముఖ్యంగా సర్ కిషన్‌ప్రసాద్ అనునయంవల్ల ఫారసీలో కొన్ని కవితా పంక్తులను వినిపించారు.

జిందగీ అంజుమన్ ఆరా నిగహదార్ ఖుద్ అస్త్
అయ్‌కె దర్‌కాఫిలయ్ బేహఃమషోబా హంరో.

(జీవితం తనకు తానే సంరక్షకం. మరి తనలోనే ఒక సభ. ఓ పాంథుడా! అందరివెంట ఉంటూనే నీ అంతకు నీవు స్వతంత్రించి పయనించకు.)

ఆఁ నగీనే కె తౌబా అహర్ మనాఁబాఖ్త
హ బెజ్రబీల్ అమీఁ షువాఁకర్ గురో

(నీవు పిశాచాల అధీనం చేసిన మణి చాలా అనర్ఘమైనది. దేవదూత వద్దకూడా దాన్ని కుదువబెట్టడానికి వీలులేదుకదా!)

రెండవ ప్రసంగం కూడా ఇఖ్బాల్ 17 జనవరి నాటి ఉదయం పబ్లిక్ గార్డెన్ లెక్చర్ హాల్‌లో వినిపించారు. నవాబ్ అజంజాహ్ యువరాజు ఆ సభకు అధ్యక్షత వహించారు. మధ్యాహ్నం అక్బర్ హైదరీ ఇఖ్బాల్‌కు విందు చేశారు.

విశ్వవిద్యాలయాధ్యాపకులు, రెవిన్యూ శాఖాధికారులు, పుర ప్రముఖులు ఆ విందులో పాల్గొన్నారు. ఆనాటి రాత్రి నిజాం అంతరంగిక కార్యదర్శి సర్ అమీన్ జంగ్ ఇఖ్బాల్ గౌరవార్థం విందు ఏర్పాటు చేశారు.

జనవరి 18, 1929 నాడు నిజాం ఇఖ్బాల్‌కు దర్శనమిచ్చారు, కమనీయ మౌక్తికం చేతికందినట్లు. తాను హైదరాబాదుకు 1910 లో తొలిసారిగా వచ్చినప్పుడు ఇఖ్బాల్ ఈ గౌరవాన్ని పొందలేకపోయారు. ఈ సందర్శనోదంతానికి సంబంధించిన ఎన్నో సన్నివేశాలు ప్రచారంలో ఉన్నవి. వాటిలో కొన్ని- ఆసఫ్జాహిదస్తార్, (రాజును దర్శించే సందర్భంలో పెట్టుకునే ప్రత్యేకమైన టోపి వంటి శిరస్త్రాణం) బగ్లస్ (నడుం కట్టు) లేకుండా నిజాంను కాలుసుకోవడం, తన కావ్యకృతి "రమోజె బేఖుది" ప్రతిని నిజాంకు సమర్పించడం, నిజాంకు తన ఫారసీ కవిత వినిపించడం, ఒక విలువైన వజ్రాన్ని "చూస్తానన్న" కోరికను ఇఖ్బాల్ వెలిబుచ్చడం, సంస్థానంలో న్యాయశాఖా మంత్రిగా నియమిస్తామని నిజాం అనడం, దానికి ఇఖ్బాల్ అంగీకరించకపోవడం[1] వంటివి ఇంకా ఎన్నో ఎన్నో-ఇఖ్బాల్ నిజాంను ప్రస్తుతిస్తూ ఒక ఖసీదా (ప్రశంసా గీతం) వినిపించారు. అందులోని కొన్ని పంక్తులు-

అయ్ ముఖామత్ బర్ తరాజె చరఖ్ బరీఀ
అజ్ తొ బాకి సత్వతె దీనెమబీఀ

(నీ స్థానం ప్రపంచంలో సమున్నతం. నీవల్ల ఇస్లాం గొప్పతనం నిలిచి ఉంది.)

బందగానె హతీం మాతొ ఖాజా
అజ్ పై ఫర్దాయ్‌మా దిబాచా

(మీరు మా బానిసలకు యజమానులు- మా భవితవ్యానికి మీరు ఉపోద్ఘాతాలు.)

గోహరం రాషో షోఖైష్ బేబాక్ కర్ద్
తాగర్ బయానె సద్ఫ రా చాక్ కర్ద్

1. జిందారూద్ (మూడవ సంపుటి)- జావేద్ ఇఖ్బాల్ పుట. 368-84..

(ఆలిచిప్పను చీల్చుకొని రమ్మని నా మౌక్తికాన్ని ఆయన ప్రోత్సాహం ప్రేరేపించింది). నా ముత్యానికి కాంతి నిచ్చిందని ధ్వని.

పేషె సుల్తాన్ ఈఁ గౌహర్ ఆవర్ ద అం

ఖత్రే ఖూనే జిగర్ ఆవర్దహం.

(ఈ కవితలను మహారాజుకు సమర్పించడానికి తీసుకుని వచ్చాను. నేను మీ కోసం నా హృదయం రక్త బిందువులను తెచ్చాను).

నిజాంతో సమావేశానికి సంబంధించిన అపోహలను పోగొట్టడానికి నవాబ్ మీర్ ఉస్మానలీఖాన్ జారీ చేసిన ఫర్మాన్ (శ్రీముఖం) ను ఇక్కడ ఉద్ధరించడం సముచితం. ఈ ఫర్మాన్ ఇఖ్బాల్ ఆయన్ను కలుసుకున్న తరువాత వెలువడింది.

"మారా ఈఁ యాదహస్త్ కె తక్మీసన్ అర్స రబ సది గుజిష్తా అస్త్ కె ఇఖ్బాల్ ఈఁజా ఆమదాబూద్ మగర్ మాలూం నీస్త్ కె ఆయా అవాజ్ ఖుద్ ఖద్రె సైరొ సియాయత్ ఆమద బరో దావత్ కిసె యాబరాయెఖాస్ ఆమదా వహం చూఁకె బర్మా కాల్ (Call) కర్దబూద్ యానె నామెఖూవిష్ దర్ కితాబ్ నోష్త బూద్ హస్బెఆదత్ ముతాబెక్ ఎడికేట్ మా ఇదారా ఇంటర్వ్యూ దాదయ్ బోదెం వౌ నతీజాకె మా అజ్ గుఫ్తగూయె ఓ అకజ్ కర్దెం ఆఁఈఁ బోదెకెఓ బర్మామాహోయద్ అషద్ కె ఓజ జ్బయ్ ఖిద్మతె ఖౌంఒమిల్లత్ ఖవేష్ ధర్ దిల్ మి దాష్త వాయెఁ హం జాహర్ షుద్ కె ఓజబానె అంగ్రేజి రాఖూబ్ మి దానిస్త్ ఒస ఫర్ యూరప్ హంకర్దబూద్ బహర్ హాల్ షుమార్ వౌదరమి యానె ముషాహిర్ బేరూన్ముల్క్ బూద్ జ్యాదా అజ్ అహ వాలెఒ బ ద్దెహస్తీం"[1]

(ఫారసీ మూలం)

(దాదాపు 25 సంవత్సరాలకు పూర్వం ఆయన (ఇఖ్బాల్) ఇక్కడికి వచ్చారన్నది మాకు జ్ఞాపకం ఉన్నది. పర్యటనకోసం వచ్చారో లేక ఎవరైనా

1. నిజాం గజెట్ 4 మే 1944 గురువారం - ఇఖ్బాల్ ఔర్ బజ్మె ఇఖ్బాల్ హైద్రాబాద్ దక్కన్ అబ్దుర్రవూఫ్ ఉరూజ్. పుట. 39.

ఆహ్వానిస్తే వచ్చారో లేక ప్రత్యేకమైన పని ఏదైనా ఆయనకు ఉండెనేమో తెలియదు. ఎందుకంటె Visitors Book (సందర్శకుల పుస్తకం) (కితాబెజుబ జూరి)లో ఆయన పేరు నమోదుచేసుకున్నారు. అందుకే మా అలవాటు ప్రకారం, సౌజన్యంతో ఆయనతో సంభాషించి ఉంటిమి. ముస్లిములకు అతి ప్రీతి పాత్రులని సంభాషణవల్ల తెలుసుకోగలిగినాము. ఆయన హృదయంలో జాతి పట్లను స్వమతస్థులపట్లను వేదన ఉన్నట్లు ఆయన వాగ్ధోరణివల్ల మాకు స్పష్టమైంది. మొత్తానికి హైదరాబాదేతర ప్రముఖులలో ఎన్నదగినవాడు. ఆయనను గూర్చి మాకు ఇంతకంటె ఎక్కువగా తెలియదు.)

జనవరి 19, 1929నాడు ఇఖ్బాల్ హైదరాబాదునుంచి లాహోరు పయనమయ్యారు. ఈ విధంగా రెండవసారిచేసిన హైదరాబాదు యాత్ర ముగిసింది. ఆ తరువాత ఇఖ్బాల్ హైదరాబాదు ఎన్నడూ రాలేక పోయారు.

హైదరాబాదుకు చెందిన కొందరు విశిష్ట వ్యక్తులు బహద్దూర్ యార్‌జంగ్, మౌల్వీ అబ్దుల్ హక్, శ్రీమతి సరోజినీనాయుడు గారలతో ఇఖ్బాల్‌కు సత్సంబంధాలుండేవి. ఆయనతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపిన ప్రముఖులలో మహారాజా సర్ కిషన్ ప్రసాద్, సర్ అక్బర్ హైదరీ, మౌలానా గిరామీ, మౌల్వీ అబ్దుల్‌హక్, నసీరుద్దీన్ హాషిమా, శ్రీమతి హుమాయూన్‌మీర్జా, ప్రొఫెసర్ అల్యాస్ బర్నీ, తంకీన్‌కాజ్మీ, తసద్దుక్ హుసేన్‌తాజ్ పేర్కొనదగినవారు.

అయితే అక్బర్ హైదరీతో సంబంధాలు ఆ తరువాత అంత బాగా ఉండేవి కావు. జనవరి 10, 1938లో సర్ అక్బర్ హైదరీ సదర్ ఆజం (ప్రధాని) నిజాం తోషఖాన (వ్యక్తిగత ఆస్తి) నుంచి వెయ్యిరూపాయల చెక్కు ఇఖ్బాల్‌కు పంపించాడు. ఇందుకు ఇఖ్బాల్ కోపగించుకొని [1] ఒక లేఖతో చెక్కును త్రిప్పి పంపించారు. తోషఖానానుంచి ఇవ్వబడిన ద్రవ్యాన్ని ఇక్బాల్ భిక్షం అనుకున్నాడని ప్రతీతి. అందుకే ఆయన ఆత్మాభిమానంతో ఆ ద్రవ్యాన్ని స్వీకరించలేదు.

1. జిందారూద్ (మూడవ సంపుటం) జావేద్ ఇఖ్బాల్. పుటలు: 636/352.

ఇఖ్బాల్ కవితా సంకలనం "అర్ముగానె హిజాబ్"లోని ఒక ఖండికలో ఈ సంఘటన ధ్వనిస్తున్నది.ఈ సంకలనం ఆయన నిర్యాణంతరువాత ముద్రితమైంది.

థాయె అల్లాకా ఫర్మాన్ కెషిక్వయ్ పర్వేజ్
దోఖలందరోకో హైం ఇస్మెం మలూకానాసిఫాత్
ముఝ్సె ఫర్మాయకె లే ఔర్ షెహన్షాహికర్
హుస్నె తద్బీర్ సె దే ఆనీ వొఫానీకో సుబాత్
మైంతో ఇస్బార్ అమానత్కొ ఉఠాతా సరెదోష్
కాంధర్వేష్ మెం హర్ తల్ఖ్ హై మానింద్ నబాత్
గైరత్ ఫకర్ మగర్ కరనసకీ ఇస్కో ఖుబూల్
జబ్కహా ఉస్నే ఎహైమేరీ ఖుదాయీకీ జకాత్.

(విరాగికి దేవుడు వరాలిచ్చాడు. నాతో అన్నాడు దేవుడు. 'ఈ వరాలు తీసుకో, చక్రవర్తిత్వం చలాయించు, వివేకంతో నిత్యానిత్య సుఖాలను అనుభవించు, సాధించు.' నేనీన్యాస భారాన్ని భుజ స్కంధాలపై మోస్తూ ఉన్నాను. విరాగి జీవితంలో అన్నిఎదురు దెబ్బలే. తరువులా సహించాల్సిందే. ఆత్మాభిమానం స్వీకృతికి అడ్డువచ్చింది. అప్పుడన్నాడతడు "నీ ఆస్తికత్వం నీకు సంపాదించి పెట్టిన పుణ్యమిది" అని)

ఇఖ్బాల్ జీవితంలోనే 7 జనవరి 1938 లో ఇఖ్బాల్ దినోత్సవం జరిగింది. ఇది ఆయన భాగధేయం. ఆయన గర్వించదగ్గ విషయం. ముస్లిం కల్చరల్ సొసైటి పక్షాన పబ్లిక్ గార్డెన్లో ఇఖ్బాల్ ఉత్సవం జరిగింది. సభకు అధ్యక్షులు నిజాం యువరాజు ప్రిన్స్ ఆఫ్ బిరార్. నవాబ్ ఆజంజాహ్ బహద్దుర్ తమ ప్రారంభోపన్యాసంలో ఇఖ్బాల్కు జోహార్లు సమర్పిస్తూ[1]-

"ఇఖ్బాల్ తమ పారసీ, ఉరుదూ కవితలతో నేటి తరం హృదయాలను ప్రభావితం చేశారు. వాస్తవంగానే ఆయన ప్రపంచంలో ఒక మహాతాత్త్వికుడు. ఒక గొప్ప రచయిత. ఆయన కవిత్వం మానవాళికి ఒక సందేశం. ఈ లక్షణాల వల్లనే హైదరాబాదుకు పరిచితుడు."

1. ఇఖ్బాల్ ఔర్ బజ్మె ఇఖ్బాల్ హైదరాబాద్ దకన్. పుట. 47.

బిరారు యువరాజు ప్రసంగం తరువాత సర్ అక్బర్ హైదరీ ఇఖ్బాల్‌ను గూర్చి తమ భావాలను ప్రకటించారు. ఈ ప్రథమ 'ఇఖ్బాల్ ఉత్సవ' సందర్భంగా ప్రసిద్ధ భారతీయుల సందేశాలు కూడా అందినవి. వారిలో రవీంద్రనాథ్‌టాగూర్, శ్రీమతి సరోజినీ నాయుడు, పండిత్ జవాహర్‌లాల్ నెహ్రూ, సర్ ఆగాఖాన్ ఉన్నారు. ఈ సందేశాలన్నింటిని చదివి వినిపించారు.

రవీంద్రనాథ్ టాగోర్ తమ సందేశంలో[1]

"భారత దేశ మహాకవి ఇఖ్బాల్ ఉత్సవాన్ని నిర్వహిస్తూ మీరు పొందు తున్న ఆనందంలో నేనూ పాల్గొంటున్నాను. ఫారసీ ఉర్దూలలో పరిచయం లేని కారణాన ఇఖ్బాల్ వంటి మహాకవి కవితా సౌందర్యాలను దర్శించలేక పోయాననే విచారం నాకు జీవితాంతం ఉంటుంది. భగవంతుడు, జాతినీ, దేశాన్నీ సేవించ డానికి ఆయనను సజీవంగానూ సురక్షితంగానూ ఉంచాలని కోరుకుంటున్నాను."

శ్రీమతి సరోజినీనాయుడు

"నేను నా ఉత్తమ స్నేహితుడు ఇఖ్బాల్‌ను మహాకవిగా భావిస్తాను. ఈ కవి ఉర్దూ, ఫారసీ కవితలు భారతజాతికి నేతృత్వాన్నీ, మార్గదర్శకత్వాన్నీ ప్రసాదిస్తాయి."

పండిత్ జవాహర్‌లాల్ నెహ్రూ తమ సందేశంలో ఇఖ్బాల్ భగవద్దత్తమైన ప్రతిభా సామర్థ్యాలకు సాధువాదం పలికారు.

"నేటితరం ఇఖ్బాల్ గీతాలతో అత్యంత ప్రభావితమైందనే యాథార్థ్యాన్ని కాదనలేము. భగవద్దత్తమైన ఇఖ్బాల్ ప్రతిభా సామర్థ్యాలతో ప్రతివ్యక్తీ పరి చితుడే. 'ఇఖ్బాల్ ఉత్సవం' విజయవంతంకావాలని ఆశిస్తూ ఆనందాన్ని ప్రక టిస్తున్నాను."

ఈ సభలో డాక్టర్ అబ్దుల్ లతీఫ్, డాక్టర్ మొహియొద్దీన్ ఖాద్రీజోర్ కూడా ఉపన్యసించారు. మధ్యాహ్నం తరువాత రెండవ సభకు ఇఖ్బాల్ అభి

1. సబ్‌రస్-ఇఖ్బాల్ నెంబర్ పుట 50-51.

మాన స్నేహితుడు మహారాజా సర్ కిషన్‌ప్రసాద్ అధ్యక్షం వహించారు. మహారాజా తమ అధ్యక్ష ప్రసంగాన్ని ఈ వాక్యాలతో ప్రారంభించారు.[1]

"ఉర్దూ కవిత 'జన్మభూమి'లో ఈనాడు స్మరణీయ దినం. సర్ ఇఖ్బాల్ వంటి ప్రసిద్ధుడూ, జనప్రియుడూ అయిన కవి విశిష్టతలను సంస్తుతించడానికి సమావేశమైనాము. ఈ ఉత్సవాల్లో రెండవ సమావేశానికి అధ్యక్షం వహించే గౌరవాన్ని నాకు మీరు కలుగజేసినందుకు నాకెంతో సంతోషంగా ఉంది. నాకు ఇఖ్బాల్‌తో వ్యక్తిగత సంబంధాలవల్లనే నేనుకించిదజ్ఞుణ్ణైనా ఈ గౌరవానికి నేను అర్హుణ్ణి అనుకుంటాను.

ఆ తరువాత మఖ్దూం మొహియుద్దీన్ 'ముజాహెద్ ఇఖ్బాల్' (ధర్మ వీరుడు ఇఖ్బాల్) అన్న శీర్షికతో ఉన్న తమ వ్యాసాన్ని వినిపించారు.

సాంఘిక, వైయక్తిక వ్యక్తిత్వాలపట్ల ఇఖ్బాల్ విశిష్ట దృక్పథాలను గూర్చి ఆ వ్యాసంలో విశ్లేషణం ఉంది. మఖ్దూం మొహియొద్దీన్, సికిందర్ అలీవజ్ద్, సాహెబ్జాదామైకష్ ఈ సందర్భంగా తమ కవితలు వినిపించారు. మఖ్దూం వినిపించిన కవితాఖండంలోని మూడు పంక్తులను చిత్తగించండి.

ఇస్ అంధేరేమే ఎ కోన్ ఆతిష్ నవాగానేలగా
జానిబె మష్రిక్ ఉజాలా సా నజర్ అనేలగా
నగ్మయె జిబ్రీల్ హై ఇన్సాన్‌కా గానాసహీఁ
నూరె అక్సా ఫీల్ హై దునియానే పహచానా సహీఁ
అర్ష్‌కీ కందీల్ హై ఏక్ ఆస్మానీ రాగ్ హై
రాగ్ క్యాహై సర్ సె పాతక్ ఇష్క్‌కీ ఏక్ ఆగ్ హై

(ఈతిమిరంలో పాడుతున్న అనలగళుడెవ్వడు? తూరుపుదిశలో వెలుతురు కనిపిస్తున్నది. ఇది దేవదూత గీతం; మనిషిపాట కాదు. ప్రపంచానికి ఇంకా తెలియని ఆకాశదీపం ఇది. ఆకాశ సంగీతం. ఏమిరాగమిది? ఆపాదమస్తకం ప్రణయానలం.)

1. ఇఖ్బాల్ ఔర్ హైదరాబాద్ - నజర్ హైదరాబాదీ - పుట 35.

ఈ సందర్భంగా నవాబ్ హసన్ యార్ జంగ్ బజ్మె ఇఖ్బాల్, ఇఖ్బాల్ సొసైటి అనే సంస్థలను స్థాపించారు.

ఇఖ్బాల్ సాహిత్య జీవితాలకు సంబంధించిన పరిశీలనం హైదరాబాదులో విశేషంగా జరిగింది. ఇది హైదరాబాదుకు గర్వకారణం. అతి ప్రముఖ గ్రంథాలు ఈ దిగువ పేర్కొనబడిన అంశాలపై ప్రచురితమైనవి. 'బజ్మె ఇఖ్బాల్' ఇఖ్బాల్ జీవితం, మృత్యుతత్త్వం ఒక పుస్తకాన్ని ప్రచురించింది. ఇఖ్బాల్‌ను గూర్చి అరబ్బీ భాషలో ఉన్న ఒక వ్యాసానికి ఉర్దూ అనువాదం ఈ పుస్తకం. ఈ పుస్తకం పేరు 'అల్వియా తుల్కొత్ ఫిఫిల్సఫయ్ ఇఖ్బాల్' బజ్మె ఇఖ్బాల్ ప్రచురించిన రెండవ పుస్తకం 'మురక్కయ్ ఇఖ్బాల్', ఇఖ్బాల్ ఉత్సవం ఏప్రిల్ 1948 సందర్భంగా ప్రచురితం. ఇదిగాక డాక్టర్ యూసుఫ్ హుసేన్ ఖాన్, డాక్టర్ మొహియుద్దీన్ ఖాదరీజోర్, డాక్టర్ మౌల్వీ అబ్దుల్‌హక్, అష్ఫాక్ హుసేన్, అజీజ్ అహమద్, గులాం దస్తగిర్ రషీద్, ఆలంఖుంద్ మేరీకూడా ఇఖ్బాల్ కవిత, సాహితిని గూర్చి, జీవితాన్ని గూర్చి ప్రసిద్ధ గ్రంథాలు రచించారు.

మదరాసులోని అంజుమనె ఇస్లామియా ఆరు ప్రసంగాలు చేయవలసిందిగా ఇఖ్బాల్‌ను కోరినారు. **దక్షిణ భారతానికీ హైదరాబాదుకూ ఇఖ్బాల్ రెండవ సారి చేసిన యాత్ర** ఈ సందర్భంగా జరిగింది. అంజుమనె ఇస్లామియా మద్రాసు వారి పునః ప్రార్థనను పురస్కరించుకుని డిశంబరు 31, 1928 న లాహోరు నుంచి పయనమైనారు. బొంబాయిమీదుగా జనవరి 5, 1929 నాడు మదరాసు చేరుకున్నారు.

మొదటి ప్రసంగం 'దీనియాతె ఇస్లామియా ఔర్ అఫ్కార్ హాజిరా' ఇస్లాం ధర్మం- సమకాలిక ఆలోచనలు (Muslim Theology and Modern Thoughts) అల్లామా ఇఖ్బాల్ జనవరి 5 నాడు గోఖలే హాల్‌లో వినిపించారు. మదరాసు రాష్ట్ర విద్యా శాఖ మంత్రి సుబ్బారాయన్ అధ్యక్షత వహించారు. రెండవ ప్రసంగం "మజ్‌హబీతజ్రు బాత్‌కె కష్ఫె వాల్హామాత్ కాఫల్ సఫియానా ఇమ్తెహాన్" (ధార్మికానుభూతుల అభివ్యక్తి - తాత్త్విక పరిశీలనం) (The Philosophical Test of the Revelation's Religions Experience)

కూడా గోఖలే హాలులో 6 జనవరి 1929 నాడు చదివి వినిపించారు. ఆనాడే ఉదయవేళలో అంజుమన్ తరక్కీ-ఉర్దూ మద్రాస్, హిందీ ప్రచారసభ మద్రాస్ ఎఖ్బాల్‌కు సన్మాన పత్రాలు సమర్పించినవి. సన్మానికి సమాధానంగా ఎఖ్బాల్ ఉర్దూ భాష ప్రత్యేకతలను, ఆ భాషాభ్యుదయ సాధనాలనుగూర్చి ప్రసంగించారు. తరువాత అంజుమనె హిమాయతె ఇస్లాం సభకు అధ్యక్షత వహించారు. జనవరి 7, 1929 నాడు అంజుమనె ఖవాతీన్ మద్రాస్ సభలో కూడా పాల్గొన్నారు. సమ కాలిక ముస్లిం మహిళలు (దౌర్ హాజిర్‌కి ముస్లిం ఖాతూన్) అన్న అంశంపై ప్రసంగించారు. మూడవది చివరిదీ[1] అయిన ప్రసంగం 8 జనవరి నాడు గోఖలే హాలులో వినిపించారు. ఆనాటి సాయంకాలం మహమడన్ కాలేజ్,మద్రాస్ లెక్చర్ హాలులో ఒక సభ జరిగింది. రాత్రి ముస్లిం అసోసియేషన్ ఇఖ్బాల్‌కు వీడ్కోలు విందు ఏర్పాటు చేసింది.

జనవరి 8 నాడు ఇఖ్బాల్ బెంగుళూరుకు పయనమయ్యారు. జనవరి 1929 నాడు 'దారుల్సురూర్'లో ఇఖ్బాల్ అభిమానులు ఆ తత్త్వకవికి స్వాగతం పల్కారు. మైసూర్ దివాన్ సర్ మీర్జా ఇస్మాయిల్ అతి భక్తి ప్రేమలతో పుష్ప మాలను అర్పించి ఇఖ్బాల్‌ను సమాహ్వానించారు. దివాన్ మాలార్పణం తరువాత బెంగుళూరు ముస్లిం లైబ్రరీ, అంజుమనె తరక్కీ- ఉర్దూ సన్మాన పత్రాలు సమర్పించారు. ఆ నగరంలో తామున్న సందర్భంగా, నగరంలోని దర్శనీయ స్థలాలు- లాల్‌బాగ్, టిప్పుసుల్తాన్ ప్రాసాదం, కోట మొదలైన వాటిని సందర్శిం చారు. అనే సాయంకాలం విద్యాశాఖ డైరెక్టరు డాక్టర్ సుబ్బారావు అధ్యక్షతన ఇఖ్బాల్ మద్రాసులో తాము చేసిన ప్రసంగాన్ని వినిపించారు. మరునాడు జనవరి 10 నాడు మైసూరుకు విచ్చేశారు.

మైసూరుకు రాగానే అభిమానులైన పురప్రముఖులు సాదరంగా స్వాగతం పలికారు. వారిలో, మైసూరు విశ్వవిద్యాలయం వైస్ చాన్స్‌లర్ శ్రీ చాండీ, మహా రాజా మైసూరు సహాయ కార్యదర్శి ఆగా సాదిక్‌షా, మహమ్మద్ అబ్బాసేక్, నవాబ్ గులాం అహమద్‌కామి, ఉన్నారు. ఇఖ్బాల్ ప్రభుత్వం అతిథిగృహంలో విడిది చేశారు.

---

1. ప్రసంగం శీర్షిక ఏది? 'జిందరూద్' లో కూడా ఈ వివరం లేదు.

సాయంకాలం టౌన్‌హాలులో ఇఖ్బాల్ తమ ప్రసంగం Muslim theology and Modern Thought వినిపించి సభాసదులను వచోనైపుణ్యంతో ప్రతిభాసముపేతమైన భావాలతో ముగ్ధులను చేసి, వారి హృదయాలపై చెరగని ముద్రవేశారు. జనవరి 11నాడు మహారాజా కృష్ణరాజ ఒడయర్ ఆహ్వానం అందుకుని ఆయనను కలుసుకున్నారు. తరువాత కృష్ణరాజ్‌సాగర్ (టిప్పుసుల్తాన్ సిద్దై మోహి అన్నాడు)ను దర్శించడానికి వెళ్ళారు. ఆ జలాశయానికి పునాది వేసింది టిప్పుసుల్తానే. యాత్రలో శ్రీరంగపట్నంలో టిప్పు సమాధిని సందర్శించారు. కొంతసేపు ఆ మహా ప్రభువు సమాధి సమక్షంలో నిమీలిత నేత్రులై నిలుచున్నారు. ఆ స్థితినుంచి తేరుకున్నాక టిప్పుసుల్తాన్ సందేశాన్ని ఈ కవితలో అందించారు.

దరెజహాఁ తవాఁ అగర్ మర్దాన్ జీస్త
హంచోమర్దాఁ జూఁ సపర్దం జిందగీస్త

(ప్రపంచంలో పురుషులవలె బ్రతకడమే జీవితం. అది సాధ్యం కాకపోతే పౌరుషంతో జీవితాన్ని సమర్పించడమే జీవితం).

ఇఖ్బాల్ టిప్పుసుల్తాన్ 'ఐవానెఆమ్' (మహాజన సభాప్రాంగణం) 'దర్యా దౌలత్' ఉద్యానవనాన్ని దర్శించారు. హైదర్ అలీ పునర్ నిర్మాణంచేసి హిందువుల కిచ్చిన దేవాలయాన్ని కూడా చూశారు. తిరుగు ప్రయాణంలో కావేరీనదిని చూస్తూ మౌనంగా కొంతసేపు నిలిచి ఉన్నారు.

ఇక్కడ ఒక విషయాన్ని ప్రత్యేకంగా చెప్పవలసి ఉంది. ఇఖ్బాల్ తన ఫారసీ గీతంలో కావేరినదిపట్ల ఎంతో భక్తిని ప్రదర్శించాడు. ఇఖ్బాల్ కంటె ముందు ఏ ఉర్దూ లేక ఫారసీ కవి కూడా దక్షిణ హిందూ దేశంలోని ఈ నదిని ఉద్దేశించి కవితలు వ్రాయలేదు. ఈ కవితలో కొన్ని పంక్తులను చిత్తగించండి.

చూ. అనుబంధం. 14 - అనువాదం పుట. 34.

మైసూరుకు రాగానే టౌన్‌హాలులో ఏర్పాటు చేయబడిన ఒక సభలో ఇఖ్బాల్‌కు ఒక సన్మాన పత్రం సమర్పించారు. మైసూరు విశ్వవిద్యాలయం

తత్త్వశాస్త్ర ఆచార్యులు ఆచార్య వాడియా ముగింపు ప్రసంగం చేస్తూ ఇలా అన్నారు.[1]

"ఇఖ్బాల్‌ను ముస్లింలు తమవాడేనని ఎంతగా అనుకున్నా, ఆయన అందరివాడు. ఏ మతానికీ, ఏ వర్గానికి ఆయన చెందినవాడు కాదు. తమవాడని ముస్లిములకు గర్వముంటే, ఆయన భారతీయుడనే గర్వం మా హిందువులందరికీ ఉంది." -

జనవరి 12 నాడు ఇఖ్బాల్ మైసూర్ విశ్వవిద్యాలయం మనస్తత్త్వశాస్త్ర శాఖను సందర్శించడానికి వెళ్ళారు. డాక్టర్ గోపాలస్వామి ఆ శాఖకు అధ్యక్షులు. అదేరోజు బెంగుళూరుకు తిరిగివచ్చారు.సర్ మిర్జా ఇస్మాయిల్‌తో టీ పుచ్చుకున్నారు. బెంగుళూరు ప్రజలు జనవరి 13, 1929 నాడు తమ ప్రియతమ కవితల్లజునికి వీడ్కోలు చెప్పారు.

ఇఖ్బాల్ దక్షిణ భారత యాత్ర కథ ఇది.

మరెన్ని వివరాలకు ఈ దిగువ పేర్కొనబడిన పుస్తకాలను చదవండి.


1. అబ్దుల్ రవూఫ్ ఉరూజ్ — ఇఖ్బాల్ ఔర్ బజ్మేఇఖ్బాల్ హైదరాబాద్ దక్కన్, ప్రచురణ. కరాచీ సెప్టెంబర్ 1978.

2. నజర్ హైదరాబాదీ — ఇఖ్బాల్ ఔర్ హైదరాబాద్ ప్రచురణ. లాహోర్ 1981.

3. జావేద్ ఇఖ్బాల్ — జిందారూద్ (రెండవ సంపుటం) ప్రచురణ. లాహోర్ 1981.

4. జావేద్ ఇఖ్బాల్ — జిందారూద్ (మూడవ సంపుటం) ప్రచురణ. లాహోర్ 1984.

5. సలీంతమన్నాయీ — దానాయేరాజ్ దయారెదకన్‌మే ప్రచురణ. మైసూర్ 1982.


1. జిందరూర్ - (మూడవ సంపుటం) - జావేద్ ఇఖ్బాల్. పుట. 366.

# ఉపసంహారం

"తూర్పు తూర్పే. పడమర పడమరే. ఈ రెండూ ఎప్పుడూ కలవ జాలవు" అన్న సూక్తి నిజమైతే ఈ వాదానికి సరియైన పరిష్కారమే లేదు. జాతీయతను గూర్చి, సంస్కృతిని గూర్చి ప్రాచ్యదృక్పథం చాలా తర్క బద్ధంగా మానవాభ్యుదయకరంగా రూపొందింది. పాశ్చాత్యుల దృక్పథం మన భౌతికాభ్యున్నతికీ, శాంతియుత సహజీవనానికీ గట్టి పునాది కాగలుగుతుంది. తూర్పులో కూడా భారతీయ సంస్కృతి కొన్ని లక్షణాల దృష్ట్యా విశిష్టమైంది. ఈ భూమి వివిధ సంస్కృతులకు కేంద్రమే కాదు. సంగమ స్థలం కూడా- వివిధ సంస్కృతులు, క్రియలు, అంతర్ క్రియలు, ప్రతి క్రియలు ఇక్కడ ఒక చక్కని వాతావరణాన్ని ఏర్పరచినవి. వైవిధ్యంలో ఏకత్వానికి నిదర్శనమైంది. ప్రపంచంలో దీనికి ఎక్కడా పోలిక దొరకదు. అందుకే భారతీయ హృదయానికి వివిధ దృక్పథాలను ఒప్పుకుంటూనే సాంస్కృతిక ఆక్రమణలను నిరాకరించే పద్ధతి నచ్చుతుంది. మన సాంస్కృతికాంశాలలో దోపిడీ లేదు. కాని సహిష్ణుతకూ, పరస్పర సహకారానికీ స్థానం ఉంది. అందుకే జాతీయ సమైక్యత ప్రసక్తి వచ్చినప్పుడు ఇతర జాతుల తమ సాంస్కృతిక విలక్షణతలను కోల్పోయి ఒకే ఒక సాంస్కృతిక ప్రవాహంలో కలసిపోవాలని అర్థం చేసుకోకూడదు. ఇది భారతీయ విలక్షణతకే చాపు. భారత దేశంలో వివిధ ప్రాంతాల్లో, వివిధ సంస్కృతులూ, వివిధ నాగరికతలూ ఉన్నవి. కాని ఇంత వైవిధ్యం ఉన్నా, ఒక మౌలికమైన భావం కూడా ఉన్నది. భారతదేశ జాతీయ లక్షణాలకు అవి అవధులకు నిర్మి స్తుంది. ప్రాచీన ఖండంలో సాంస్కృతికంగా, నాయకత్వం వహించే శక్తిని కూడా ప్రసాదిస్తుంది. ఆధ్యాత్మిక ప్రయత్నాలవల్ల, సాధించిన జీవిత దృక్పథానికే ఈ సంస్కృతిలో ప్రాముఖ్యం ఉంది. అందుకే భారతీయ ఆధ్యాత్మిక ప్రముఖు లను ఆరాధించడం, వారి బోధనలను ఆలకించి, లాభాన్ని పొందడం అవసరం.

ఉర్దూ కవుల్లో కులీకుతుబ్షా, వలీదక్కనీ మొదలుకొని నేటిదాకా ఎవరు కూడా ఈ మౌలికమైన అంశానికి ఇఖ్బాల్ ఇచ్చినంత ప్రాముఖ్యం ఇవ్వలేదు. ఆయన భారత జాతీయతకు ఉన్న ఏకసూత్ర రహస్యాన్ని కనుగొన్నాడు. అందుకే ఆయన భారతీయ తాత్త్వికులకూ, సంస్కర్తలకూ ధార్మిక ప్రముఖులకూ నివాళులు అర్పించినప్పుడు శబ్దాడంబరాన్నీ కవితా చమత్కృతిని నిరాకరించి, గంభీరమైన భావసంపదను రాశిపోసినాడు.

జాతీయ సంస్కృతికి సంబంధించిన అనేక దృక్పథాలు ఈ శతాబ్దిలో పుట్టుకొచ్చినవి. వాటిని ఇలా వింగడించవచ్చు :

1. సాంఘిక దృక్పథం, 2. మత దృక్పథం, 3. దేశీయ దృక్పథం, 4. జాతీయ దృక్పథం.

వీటిలో అన్నింటికీ కావలసిన ఉపపత్తులున్నవి. కాని చారిత్రక యాథార్థ్యానికీ సమీపంగా ఉన్నదేది? భారతదేశం చాలాకాలంవరకు పశ్చిమ సామ్రాజ్యానికి దాస్యం చేసింది. సామ్రాజ్యవాదులు, భారతీయుల హృదయాల్లో ద్వేషాన్నీ, కలహబీజాలను నాటడానికి, దేశీయదృక్పథాన్నీ, సంస్కృతినీ, జాతీయతనూ అనువైన క్షేత్రాలుగా ఎన్నిక చేసుకున్నారు. ఇఖ్బాల్ వీళ్ళ దురాశయాలను అర్థం చేసుకున్నాడు.

స్వదేశాన్ని ఒక శిలగా మార్చేశారు. ఇది జాతీయతకు హాలాహలమవుతుందన్నాడు.

(ఈ కొత్త దేవతల్లో అన్నింటికంటే పెద్దది దేశం. ఈ దేవతకు తొడిగిన ఉడుపులు పాశ్చాత్య శవాలంకరణలు.)

"ఇన్ తాజాఖుదావోఁమేబడా సబ్ సేవతన్ హై
జోపీర్ హై ఇస్కా హై వోమజ్హబ్‌కాకఫన్ హై."

ఇఖ్బాల్ దేశీయ దృకృథం జాతీయ దృకృధం ఎన్నో వివాదాలకు దారి తీసింది. రకరకాల విమర్శకులు తమ మానసిక రుగ్మతలను చెదురుమదురు ఆలోచనలను ఇఖ్బాల్‌కు అంటగట్టారు. ఇందులో ఒక విషయం గమనించదగింది. దేశభక్తి - దేశీయత. ఈ రెండూ వేరే. ఇఖ్బాల్ దేశాన్ని ప్రతిమ అనడం ఈ అర్థంలో., ఆయన దేశభక్తుడు కాకపోవచ్చుకాని ఆయన దేశభక్తి అనుమానాలకు అతీతం.పశ్చిమ సామ్రాజ్యం తన వలసరాజ్యాల లాభాలను రక్షించుకోవడం కోసం ప్రతిచోటా కొత్త ఆయుధాన్ని ప్రయోగించారు మధ్య ప్రాచ్యంలో సమైక్య ఇస్లాంను బలపరచారు. కాని అరబ్బులను ఇస్లాం పేరుతో ఒక్కటి కానివ్వలేదు. ఈనాడూ కూడా అరబ్బులు జాతీయత పేరుతో సామ్రాజ్య శక్తులతో యుద్ధం చేస్తున్నారు. దానివల్ల వినాశనం, దుష్టఫలితాలుతప్ప మరేమీ లభించవు. ఇది స్పష్టం, ఈజిప్టు, ఇరాన్ తమ సంస్కృతిని జాతిగుర్తింపుకు పునాది చేసుకున్నాయి. ఇస్లామీ ఆలోచనాప్రవాహానికి దూరంగా వెళ్ళిపోయారు. ఈజిప్ట్‌లో విముక్తి ఉద్యమ నాయకుల ఆరాధనీయులైనారు. ఇరాన్ ప్రతి జీవితరంగం నుంచి అరబ్బులను వెళ్ళగొట్టే ప్రయత్నం ప్రారంభించింది. భారతీయసంస్కృతిస్థితి ఈజిప్ట్ ఇరాన్‌ల కంటె భిన్నం. ఇక్కడ జాతీయసమైక్యతకు పునాది ఏకత్వంలో భిన్నత్వం **Unity in diversity** పై ఆధారపడి ఉంది. దేశాన్ని ప్రతిమగా మార్చడం పశ్చిమ సామ్రాజ్య ఆశయాల పరిపూర్తికి సాధనం కాగలిగి ఉండేది. ఇఖ్బాల్ దేశీయదృకృథాన్ని నిరాకరిస్తే అతడు దేశభక్తుడు కాలేడని అర్థంకాదు. ఆయన ఈ వ్యతిరేతను నిజానికి పశ్చిమ సామ్రాజ్య వాదుల అపవిత్ర ఆశయాలను అర్థంచేసుకున్న తరువాతనే ప్రదర్శించారు. సామ్రాజ్య వాదులు మానవలోకాన్ని విభజించి చిన్నచిన్న గూళ్లలో కుక్కిపెట్టాలని చూశారు. పాశ్చాత్యుల జాతీయ దృకృథానికి ఆయన వ్యతిరేకతను తెలుపడానికి కారణం ఏమిటీ అంటే అది జాతులనూ, దేశాలనూ విభజించడానికి సామ్రాజ్య వాదులు వేసిన ఎత్తు. భారతీయ సమైక్యతనూ, ప్రాచీన సంప్రదాయాలపైన ఆధారపడిన ఒక ఆలోచనాధారపై నడవాలని ఆయన ఆకాంక్ష. నేడు జరుగుతున్న అనేక యుద్ధాలు జాతీయత పేరుతోనే జరుగుతున్నాయని, వీటివల్ల ప్రాచ్యదేశాలకే ఎక్కువ నష్టం కలుగుతున్నదని ఆయన అర్థం చేసుకున్నారు.

ఇక్కడ ఒక మౌలికమైన ప్రశ్నను గూర్చి పరిశీలించవలసిన అవసరం ఉంది. ఇస్లాంకు ప్రత్యేకమైన ఒక సాంస్కృతిక దృక్పథం ఉందా? మనం ఏ సంస్కృతినైనా ఇస్లామీ సంస్కృతి అనవచ్చా? ఈ విషయంపై చాలా చర్చలు సాగినవి. కాని ఇస్లాం ఆచరణ పరిధి కేవలం తాత్త్వికమైనదని మన ధోరణి. అది సర్వ మానవాళిని సంబోధిస్తుంది. సర్వ మానవులకు ఒక జీవిత దృక్పథాన్ని అందిస్తుంది. పరిమితమైన భౌగోళిక, సంస్కృతి లేక కల్చర్‌ను శుద్ధ ఇస్లామీ కల్చర్ అనలేము. ఈ అభిప్రాయాన్ని ఇలా వివరించవచ్చు. ప్రతి ప్రాంతంలో విశిష్టమైన చారిత్రక, భౌగోళిక, సంస్కృతిక సాంఘిక లక్షణాలు ఉంటాయి. యావత్ ఇస్లామీ ప్రపంచంలో ఒకే విధమైన ఉమ్మడి సంస్కృతి అంటూ ఏమీ లేదు. ఇస్లాం ఆలోచనా స్థాయిలోనే ఉమ్మడిగా ఉంటుంది. అంటే ఏకేశ్వరత్వం, ప్రవక్త ప్రాధాన్యం, పర లోకం ఇత్యాది. ముస్లింలు భావ స్థాయిలో ఒక సంఘంగా ఏర్పడవచ్చు. కాని వాళ్ల జాతి గుర్తింపు భౌగోళిక స్థితులతో ముడివడి ఉంది. ఉదాహరణకు భారతీయ ముస్లింలు ఇస్లాం ప్రాథమిక సూత్రాలకు కట్టుబడి ఉంటూనే విస్తృత భారతీయ సాంస్కృతిక జాతీయతలో పాలు పంచుకోవచ్చును. ఇఖ్బాల్ దేశీయ తత్త్వానికి ఇది తర్కబద్ధమైన వివరణం కాగలుగుతుంది. రాగిబ్ అహసన్ ఇలా వ్రాశారు :

"ఇఖ్బాల్ దేశీయతను ఇస్లాం సంఘ భౌగోళిక పరిమితులకూ విరోధి. జాతీయతకు అతడు ప్రబల విరోధి. కాని దేశభక్తికి కూడా విరోధి అనే నిర్ణయానికి రాకూడదు. ఇస్లాం సంఘం భౌగోళిక పరిమితులకు శత్రువు. అలాంటివాడు పాకిస్తాన్ సిద్ధాంతాన్ని సృష్టిస్తాడా? ఎంత పరస్పర వైరుధ్యం ఉన్నమాట? ప్రాచ్యఖండాన్ని విభజించి, కలహాలను పెట్టే సామ్రాజ్య శక్తులే జాతీయతను ఉపయోగించుకుంటున్నాయి కనుక వీటిని ఇఖ్బాల్ వ్యతిరేకించాడు. తర్కబద్ధంగా పరిశీలిస్తే భారతదేశ సమగ్రతను, జాతీయ సమైక్యతను ఆయన విలువైన సంపదలుగా భావిస్తాడు.

పశ్చిమ దేశాలనుంచి దిగుమతి అయిన దృక్పథాలు మరొక సమస్యను సృష్టించినవి, మన పరిస్థితులను గూర్చి ఆలోచిస్తూ ఆయన సాంఘిక సంస్కృ

తిని, ఆధ్యాత్మిక సంస్కృతి నుంచి విడదీసి చూస్తాడు. ప్రాచ్యులకూ, ప్రాశ్చాత్యులకూ భేదం ప్రాథమికంగా ఆధ్యాత్మిక భౌతిక నాగరికతలకున్న భేదం. భౌతిక నాగరికత సహజంగానే గతి తార్కిక భౌతిక వాదం (Dialectical) ఆధ్యాత్మిక సంస్కృతి నిశ్చలమైందేమీ కాదు. కాని భౌతికమైన మార్పు కలుగదు. ఒక దశలో లేనిది మరొక దశలో ఉంటుంది. భారత జాతీయత, జాతీయ సంస్కృతి చెరగు· ఈ ఆధ్యాత్మిక సంస్కృతితో ముడివడింది గౌతమ బుద్ధుడు, మహావీరుడు, కృష్ణుడు, రాముడు, చిష్తీ, నానక్, రామతీర్థ, గాంధీజీలో ఆ సంస్కృతి దర్శనమిస్తుంది. సూఫీ భక్తుల సందేశాల్లో వినిపిస్తుంది.

ప్రధానమైన ఈ అంశాలకు ఆయన కవితల్లో సూచనలు కనిపిస్తాయి. ఆ సూచనలను పరిశీలించి, ఇఖ్బాల్ వ్యక్తిత్వ తత్త్వ రహస్యాలను తెలుసుకోవచ్చు. ఈ వ్యక్తిత్వంకూడ మన ధార్మిక సంస్కృతికంటే చాలా లోతైనది. ఈ రెండు ఒకదానికొకటి పూరకాలు.

ఇఖ్బాల్ దాస్యానికి ఎంతో కుమిలిపోయాడు. దేశ స్వాతంత్ర్యం కావాలనే కాదు. ప్రాచ్యఖండం, విశేషించి భారతదేశం ఔన్నత్యానుభూతితో మానవ లోకానికి నాయకత్వం నెరపాలని శతాబ్దాలనుంచి సంతరించుకున్న భావసంపదతో జనబాహుళ్యానికి అందాలని ఆకాంక్షించాడు.

శుష్కమైన, మోసాల విషాలనుకక్కుతున్న నినాదాలతో పాశ్చాత్యులు భారతీయులను వలలో వేసుకున్నారు. వాళ్ల స్థాయిని భారతీయులు ఎంత త్వరగా తెలుసుకుంటే అంత మంచిది.

ప్రతి మతం ప్రాథమిక సూత్రాలను అర్థం చేసుకుని వాటి విలువలను తెలుసుకోవాలని ఇఖ్బాల్ కవిత మనకు పాఠం చెబుతుంది. ఎందుకంటే, మన దేశంలో వివిధ జాతులవాళ్ళు వివిధ మతాలవాళ్లు, వివిధ భాషల వాళ్లు నివసిస్తున్నారు. మనం ఇతరవర్గాల నాయకులను గౌరవించాలె, వాళ్లగురించి తెలుసుకోవాలె. ఇస్లాంతో గంభీరమైన సంబంధం ఉండికూడా ఇఖ్బాల్ భారతీయతత్త్వ

శాస్త్రాధ్యయనం చేశాడు. అందులోని గుణాలను తన భావాలలో ఇముడ్చుకున్నాడు. నేడుకూడా ఒక మతాన్ని నమ్మేవాళ్ళకు ఇతరమతాల ప్రాథమిక సూత్రాలతో పరిచయం లేకపోవడం చాలా శోచనీయం. సెక్యులరిజం అంటే మతాన్ని పూర్తిగా త్యజించడం కాదు. సెక్యులరిజం ఒక రాజకీయ దృక్పథం. మతానికి ప్రభుత్వ వ్యవహారాలతో ఏమీ సంబంధం ఉండదు. అందుకే సెక్యులర్ దేశంలో విద్యాలయాల్లో వివిధమతాల ప్రాథమిక సూత్రాలనుగూర్చి పిల్లలకు చెప్పడం అసమంజసం ఏమీకాదు.

ఇఖ్బాల్ ఇస్లామీ ఆలోచనంమీద ఆయన వ్యక్తిత్వతత్త్వంమీద విపులంగా మేము చర్చించాము. దైవం దయ తలిస్తే అది పుస్తకంగా త్వరలో బయల్వెడలగలదు.

# ప్రతిభాశ్లాఘనం

'ఇఖ్బాల్-జాతీయ సమైక్యత' ప్రథమప్రచురణపై విజ్ఞుల అభిప్రాయాలు.

1. మౌలానా సయ్యద్ అబుల్ హసన్ అలీనద్వీ :-

## విస్తృతాధ్యయనం

మీ విస్తృతాధ్యయనం, భావప్రకటనా నైపుణ్యం నన్నెంతో అలరించినవి. ఆశ్చర్యాన్ని కూడా కలిగించినవి. ఇన్ని పనులున్నా, చదువడానికీ, వ్రాయడానికీ మీకు సమయం ఎలా దొరుకుతుందో! ఇఖ్బాల్ కవితకూ, ఆయన సందేశానికీ సంబంధించిన ఇతర అంశాలనుకూడా పరిశీలించడానికి మీకు సమయం లభించాలని నా మనఃకామన.

2. ప్రొఫెసర్ నూరుల్ హసన్ :

## లోతైన ఆలోచన

ఇఖ్బాల్ జాతీయ సమైక్యత ఇఖ్బాల్ కవిత్వం, ఇఖ్బాల్ ఆలోచనలపై ఇది విలువైన అధ్యయనమేకాదు మీ లోతైన ఆలోచనకు ఇది దర్పణం.

3. షమ్సుర్ రహమాన్ ఫారోఖీ :

ఉన్నతశ్రేణికి చెందిన ఇఖ్బాల్ దర్శనం, మీ సహేతుకమైన చర్చ, విషయాల వింగడింపు ఉత్తమంగా ఉన్నాయి. ప్రభావోపేతంగా ఉన్నాయి. ఉపోద్ఘాతంకూడా మీరు విద్వత్పూర్ణంగా వెలయించారు. ఇఖ్బాలు కవిత, భావనలు, దేశభక్తిని గూర్చి చాలా చక్కగా మీరు చర్చించారు. ఉత్తమ శ్రేణికి చెందిన ఇఖ్బాల్ కవిత్వ మర్మజ్ఞులు మీరు. ప్రాచ్య పాశ్చాత్య భావాలతో మీకు చక్కని పరిచయం ఉన్నదనీ, ఈ పుస్తకం నిరూపిస్తున్నది.

4. ప్రొఫెసర్ మహమ్మద్ మునవ్వర్, డాక్టర్ ఇఖ్బాల్ అకాడమీ, పాకిస్తాన్, లాహోర్.

## విలువైన సృష్టి

ఇంత విలువైన సాహిత్యసృష్టి చేసినందుకు సయ్యద్ ముజఫర్ హుసేన్ బర్నీకి మా శుభాకాంక్షలు తెలియజేయండి ఆయనకు ఆయురారోగ్య విజయాలు లభించాలని ప్రార్థన.

5. గిరిజాకుమార్ మాథుర్ :

## నూత్న దృక్కోణం

అల్లామా ఇఖ్బాల్‌ను గూర్చి మీ ప్రసంగ పాఠం చదివాను. ఇఖ్బాల్ కవితా పరిశీలనానికి ఒక నూత్న దృక్కోణాన్ని మీరు కనుగొన్నారని నాకని పించింది. ఇఖ్బాల్‌వంటి మహా కవినిగూర్చి ఇంతవరకూ ప్రాముఖ్యంపొందని ఒక నవీన దృక్పథంపై మీరు వెలుగులు జిమ్మారు.

6. రేవతీశరణ్ వర్మ.

## మాతృభూమి పరిమళం

మన మాతృభూమిని కీర్తించిన ఇఖ్బాల్ కవితలలోని పరిమళాలను ఆస్వాదించి నేడుకూడా ఆనందించవచ్చు.

7. డాక్టర్ తారాచంద్ రస్తోగి :

## మైలురాయి

చెప్పుకోవడానికైతే కేవలం 62 పుటల చిన్న పుస్తకం. కాని అర్థదృష్టితో పరిశీలనాదృష్టితో పెద్దపెద్ద పుస్తకాలకంటే గొప్ప పుస్తకం.

బర్నీ గారు ఇఖ్బాల్ సందేశాన్ని అతి మనోహరమైన, శేముషీసంపన్నమైన పద్ధతిలో ప్రస్తుతించారు. ఆయన సాహిత్య స్నేహం; దేశకాల పరిస్థితుల అవగాహన, ఆయన గుణగ్రహణపారీణత ఈ పుస్తకంలో పుష్కలంగా ఉన్నవి.

బర్నీ గారికి సాహిత్యంపైన మంచి అధికారం ఉన్నది. ఆయన విద్వత్తు, ఆయన విజ్ఞానం సమధికం ఇఖ్బాల్ సాహిత్యంపట్ల ఆసక్తి ఉండటం సాధారణమైన విషయంకాదు. ఇఖ్బాల్ సాహిత్యాలోకనపథంలో బర్నీ గారి గ్రంథం ఒక కొత్త మైలురాయి.

# ప్రజావాణి

1. 'హమారీ జబాన్' వార పత్రిక, కొత్త ఢిల్లీ, 15 జనవరి, 1985.

అన్ని రకాల పక్షపాతాలకూ, వ్యక్తిగతాభిరుచులకూ అతీతులై ఇఖ్బాల్ కవితాకళనూ, దృక్పథాలను సక్రమంగా పరిశీలించగలిగే విమర్శలు చాలా అరుదు. సమీక్షకు వచ్చిన ఈ పుస్తకాన్ని చదివి, బర్నీగారు ఇఖ్బాల్‌ను ఇఖ్బాల్ కళాదర్పణంలో దృక్పథాల నీడల్లో దర్శించగలిగారన్న విషయం తెలుసుకున్నాక ఎంతో సంతోషం కలిగింది.

ఈ సందర్భంగా నేను ఒక అంశాన్ని తెలియజేయాలనుకుంటున్నాను. ఎన్నో గొప్ప చారిత్రక సంఘటనలు జరిగినవి. వాని వెనుక ఎందరో సమవేదనా పరుల, నీతిమంతుల మౌన హస్తాలు పని చేసినవి. వాటిని గురించి ఎవరికీ తెలియ కుండాపోయింది. బీహారులో ఉరుదూను అధికార భాషగా గుర్తించారు. కాని ఈ విషయంలో ఒక యదార్థ్యం ఉన్నది. ఏ ఉరుదూ వారికి తెలియనిదది. అదికూడా ప్రభుత్వం కవిలెల్లో కూరుకుపోయి ఉన్నది. అది ఇది. బర్నీగారు హోంశాఖా కార్యదర్శిగా ఉన్నప్పుడు, ఒకనాడు ఆయన నాతో మాట్లాడారు. ఉరుదూ పరి స్థితిపై సంభాషణ సాగింది. ప్రధానమంత్రి ఇందిరాజీ ఉత్తర భారతంలో కొన్ని రాష్ట్రాలలో ఉరుదూను ప్రభుత్వ భాషగా గుర్తించాలనుకుంటున్నారని బర్నీగారు నాతో అన్నారు. నేను వెంటనే అన్నాను. ఈ ప్రయోగం బీహారులో ప్రారంభించ వచ్చు. బర్నీ గారన్నారు. తనకు కూడా ఇలాంటి అభిప్రాయమే ఉందనీ, మీ యీ ప్రతిపాదనతో నా అభిప్రాయానికి బలం చేకూరిందనీ అన్నారు. ఆనాడే ముల్లా గారితో మాట్లాడాను. మేమిద్దరం బీహారు నుంచే ప్రారంభం కావాలనే నిశ్చయానికి వచ్చాము. మరునాడే బర్నీగారికి నేను ముల్లాగారి సలహాను గూర్చి తెలిపాను. మూడు రోజుల తరువాత బీహారు ముఖ్యమంత్రి పండిట్ జగన్నాథ్ మిశ్రా మంత్రివర్గ సమావేశంలో ప్రప్రథమంగా ఉరుదూను రెండవ ప్రభుత్వ భాషగా గుర్తించే ప్రతిపాదనను ప్రవేశపెట్టారు. అది ఆమోదింపబడింది.

క్షమించండి. ఈ ఆక్షేపణీయమైన వాక్యం, ఆక్షేపణీయ సంఘటనగా రూపొందింది. కొంచెం దీర్ఘమైంది. కాని ఉరుదూకు బర్నీగారు చేసిన ఉపకారాన్ని గూర్చి చెప్పేందుకు అవకాశమే దొరకలేదు.

ఇఖ్బాల్ 'తరానయ్‌హిందీ' నుంచి 'తరానయ్‌మిల్లీ' వరకు జరిగిన మనో యాత్ర చాలా ముఖ్యమైంది. క్లిష్టమైంది. నిజానికి వీటి అర్థాలను పరిశీలిస్తున్న ప్పుడు విమర్శకులు ఇఖ్బాల్ కవిత్వంపై తమ దృక్పథాల పచ్చదాన్ని చెప్పే స్తారు. ఇఖ్బాల్ యూరప్‌లో ఉన్నప్పుడు దేశభక్తి ఎంత ప్రతిమించిందో, ఎంత దౌర్జన్యాన్ని పులుముకుందో చూడగలిగారు. స్వతంత్రమైన, శక్తిమంతమైన సైనిక రాజ్యాలు యూరప్‌లో పుట్టుకొచ్చాయి. ఆ విధంగా చిన్న చిన్న బలహీన జాతులను తమ ఆధీనంలో తీసుకోవడానికి పోటీలు ప్రారంభమైనవి. అవి ఆయన చూశారు. ఈ పరిస్థితిలోనే డాక్టర్ జాన్‌సన్ "అల్పుడు చివరకు దేశభక్తిని ఆసరాగా తీసుకుంటాడ"న్నారు. అలాంటప్పుడు ఇఖ్బాల్ కూడా ఇలా అనడంలో తప్పేమి లేదు.

ఇన్‌తాజా ఖుదావోఁ మేఁబడాసబ్ సే వతన్ హై
జో పైరహన్ ఇస్‌కాహై వోహ్ మజహబ్‌కాకఫన్ హై

(ఈ దేవతల్లో అన్నింటికంటె పెద్దది దేశం. ఆ దేవత కట్టుకున్న వస్త్రం మతానికి శవాలంకరణం)

బర్నీగారి అభిప్రాయం నిజమైంది. ఇఖ్బాల్ జాతీయతా సిద్ధాంతాన్ని వదిలిపెట్టాడు. కాని తన దేశభక్తిలో ఎలాంటి లోపం రానివ్వలేదు. దేశభక్తిని అతడెన్నడూ కాదనలేదు. మానవజాతి వినాశనం వైపుకు తీసుకువెళ్లే సంకుచిత దృష్టికీ, ఉన్మాదానికీ ఆయన వ్యతిరేకి.

ఈ పుస్తకం నిజానికి బర్నీగారు భూపాల్ విశ్వవిద్యాలయంలో జనవరి 14, 1984లో చదివిన ప్రసంగానికి ప్రతిరూపం. ఈ ప్రసంగం ఇంగ్లీషులో ఉంది. బర్నీగారు ప్రసిద్ధ ఉరుదూ పరిశోధకులు, విమర్శకులు. డాక్టర్ నిసార్ అహమద్ ఫరూఖ్ సహాయంతో ఉరుదూలోకి అనువదించారు. ఇఖ్బాల్ కవితా

